


## ఎత్తున కూర్చొని పై ఎత్తు?

ఎడారుల్లో పెరిగే జెముడు చెట్టుపై గడుసుపిల్లి ఎలా కూర్చుందో చూశారా? అంత ఎత్తున కూర్చోవాలనే కోరిక దీనికి ఎలా కలిగిందబ్బా? ఏముంది? వేటకోసం ఎత్తులు వేస్తోందేమో? ఏదేమైనా మార్జాల మహారాజు అంత ఎత్తు ముళ్ల చెట్టుపై ఎలా కూర్చున్నాడో.. ఆయన భారాన్ని మోస్తూ కూడా ఆ చెట్టు పిసరంతైనా వంగలేదంటే అదెంత బలంగా ఉందో మీరే ఆలోచించాలి!

# చతుర

సంపుటి -31
సంచిక - 2
మార్చి 2008
362వ సంచిక



దేశంకాని దేశంలో వారిద్దరి మధ్య అభిమానం చిగురించింది. స్నేహం మొగ్గతొడిగింది. ఆలోచనలు పంచుకున్నారు. అభిరుచులు కలబోసుకున్నారు. అనివార్య కారణాలవల్ల ఆమె ఇండియాకు వచ్చేస్తే తనను కలిసేందుకు వచ్చిన అతనికి ఎదురైన అనుభవం ఏమిటి? మనసు- మమతల తీరుతెన్నుల్ని అత్యద్భుతంగా అక్షరీకరించిన డాక్టర్ అక్కినపల్లి సుబ్బారావు నవల **మరో వసంతం** 14 వ పేజీలో...

బొమ్మలు: ఆనంద్



ముఖచిత్ర ఛాయాగ్రాహకుడు : రాఘవేంద్ర
చివరి పేజీ : చిత్రరూపకర్త : చిత్ర
ముఖపత్రాలంకరణ : రాజు యాట

# విపుల ఆహ్వానము

# అనువాద కథలకు

సుతిమెత్తని సంవేదనలు
అనురాగభరిత ఆత్మ నివేదనలు
ఉత్కంఠభరిత కథన వేగాలు
ఉత్తేజపూరిత చైతన్య ప్రవాహాలు

## ప్రపంచ సాహిత్యంలో కోకొల్లలు

సమకాలీనమై మీ మనసును మురిపించి, మైమరపించిన
అన్య భాషల కథలను తెలుగు పాఠకులకు అందించండి,

**అనువాదం సరళంగా, ఆకట్టుకునేలా ఉంటే**
**విపుల మీకు వారధిగా నిలుస్తుంది.**

---

అనువాద రచనల పూర్తి వివరాలతోపాటు, మూలభాషా రచయితల నుంచి పొందిన అనుమతి పత్రం, స్టాంపులంటించిన సొంత చిరునామా గల కవరు జతచేయండి. మూల రచయితల నుంచి అనువాదకులు తగిన అనుమతి పొందలేని సందర్భాలలో మేమే అనుమతి పొందగలం. మీ కథ మాత్రం ఎనిమిది పేజీలకు మించకుండా ఉండాలి.

---

**రచనలు పంపవలసిన చిరునామా**

సంపాదకుడు
విపుల, ఈనాడు కాంప్లెక్స్,
సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.



# అపార్ట్‌మెంటాలజీ-2

# బాంబోపాఖ్యానం



యర్రంశెట్టి సాయి

(గత సంచిక తరువాయి)

"ఆ నువ్వు నాన్ వెజిటేరియన్ తింటావా?"

అవధాని సిగ్గుపడ్డాడు. "అందుకే మీకా బ్యాగ్ చూపించనని చెప్పాను" కొంచెం కోపంగా అన్నాడు.

"సీక్రెట్ గా అందరం తినబోతూంటే మీరొచ్చి నానా గొడవ చేశారు"

అందరం వెనక్కు తిరిగాం.

అప్పటికే మూడో బ్లాక్ దగ్గర చాలా మంది గుమిగూడి ఉండటం కనిపించింది మాకు.

వాళ్ల మధ్యలో మా కమిటీ మెంబర్ బాబుమోహన్ నిలబడి బిగ్గరగా అరుస్తున్నాడు.

"పిలవండి మన సొసైటీ ప్రెసిడెంట్ ని! దీని వ్యవహారం ఏంటో ఇప్పుడే తేలాలి!" అంటున్నాడు.

మేమంతా అతని దగ్గరకెళ్లాం.

"ఏంటి సంగతి?" అడిగాడు హమీద్ మియా.

"ఇదిగో! ఈ స్కూటర్ చూడండి- ఇవాళ ఉదయం నుంచీ ఇక్కడే పార్కు చేసి ఉందది- ఇదే ఫస్ట్ టైమ్ దీన్నిక్కడ చూడడం. ఎవర్నడిగినా మాది కాదంటున్నారు."

అందరం భయపడ్డాం-

"సాధారణంగా బాంబులు స్కూటర్‌లోనే పెడుతుంటారు!" అన్నాడు రెడ్డి మాతో రహస్యంగా.

వెంటనే పోలీస్‌కి ఫోన్ చేశాం-

మరికాసేపట్లో ఒక పెద్ద వ్యాన్ వచ్చి ఆగింది.

పోలీసులు ఇంత ప్రాంప్ట్‌గా వచ్చారంటే చాలా గ్రేటే" అన్నాడు చౌదరి.

"అలా అనుకోకండి! పోలీస్ ఇప్పుడు అదివరకిలాగా కాదు. చాలా ఎడ్వాన్స్ అయిపోయారు" అన్నాడు శంకరమూర్తి.

అందరం వ్యాన్ దగ్గరికెళ్లి మూగేసరికి ఓ లావుపాటి వ్యక్తి సఫారి సూట్‌లో ముందు సీట్లోంచి దిగాడు.

"పెద్ద సి.ఐ.డి. ఆఫీసరయివుంటాడు" అన్నాడు మొహిందర్.

అందరం అతనికి నమస్కారం చేశాం.

"ఇంత త్వరగా మీర్రావడం చాలా

హ్యాపీగా ఉందిసార్" అన్నాడు హమీద్ మియా.

"ఇంతకూ ఆ స్కూటర్ ఎక్కడ?" అడిగాడతను.

అందరం అతనిని తీసుకెళ్లి స్కూటర్ చూపించాం.

"ఏయ్ రాందాస్! కెమెరా తీసుకురా!" అంటూ అరిచాడతను.

వెంటనే లోకల్ న్యూస్ చానెల్ పే(రాసివున్న కెమెరా ఒకటి వ్యాన్‌లోనుంచి తీసుకొచ్చాడు ఓ వ్యక్తి.

అప్పుడు గానీ మాకర్థం కాలా! వాళ్లు పోలీసులు కాదు, ఆ చానెల్ కెమెరామెన్, ఇతర సిబ్బందిని.

"మీరెలా వచ్చారు? మేము పోలీసులకు ఫోన్ చేశాంకదా" అడిగాడు రెడ్డి.

"పోలీసులు ముందు మమ్మల్ని పంపుతారండీ! వాళ్లు ఇక్కడికి రావడం విచారణ మొదలెట్టడం ఇవన్నీ టీవీ చానల్స్ కవరేజీ లేకుండా ఎలా చేస్తారు వాళ్లు?"

అప్పుడే అతనికి ఫోన్ వచ్చింది.

"ఏమోయ్ గిరీశం- ఆ మెంటల్ అపార్టుమెంట్‌కి చేరుకున్నారా?"

"ఎప్పుడో వచ్చాం సార్ ఇంతసేపా?"

"సరే అయితే మేమూ స్టార్టవుతాం!"

మా అపార్టుమెంట్‌లో ఫ్యామిలీస్ అన్నీ టీవీ కెమెరా చుట్టూ మూగిపోయాయి.

టీవీ చానల్లో కనబడతాం అన్న విషయం తెలిసేసరికి లేడీస్ అర్జంట్‌గా మేకప్ చేసుకుని లేటెస్ట్‌గా కొన్న కాస్ట్‌లీ శారీస్ కట్టుకు వచ్చేసారు.

అలాంటి వ్యూయర్స్ చానల్స్‌కి వర(ప్రసాదం గనుక వెంటనే కెమేరామెన్ షూటింగ్ స్టార్ట్ చేశాడు.

"హలో గజనీ! ఇక్కడ ఈ రామ్‌భరోసా అపార్టుమెంట్స్‌లో ఒక స్కూటర్ అంటే ఎవరిదో తెలీని స్కూటర్- నిన్నటి నుంచీ పార్క్ చేసి ఉంది. ఇదెవరిదో ఎవరికీ తెలీడం లేదు! టె(ర్రరిస్టులు ఇందులో




బాంబ్ పెట్టి ఉంటారని అందరూ అనుమానిస్తున్నారు గజనీ"

"ఆ అపార్ట్‌మెంట్స్‌లో ఉన్నవాళ్ళు ఈ పరిస్థితి చూసిఎలా ఫీలవుతున్నారు గిరీశం?"

"గజనీ! ఇప్పుడే అపార్ట్‌మెంట్స్‌లో వాళ్ళంతా ఇక్కడకు చేరుకున్నారు గజనీ! వాళ్ళు చాలా భయపడుతున్నారు. ఏ క్షణాన బాంబ్ పేలుతుందోనని- ఇప్పుడే వాళ్ళతో మాట్లాడదాం-

"మేడమ్- మీ పేరేంటి?"

"అసలు పేరు వింధ్యగానీ మరీ పర్వతం పేరు బాగుండదని మావారు సంధ్య అంటారండీ"

"చూడండి సంధ్యగారూ! ఇప్పుడు ఈ ఓనర్‌షిప్ తెలీని ఈ స్కూటర్ మీ అపార్ట్‌మెంట్స్ మధ్యలో- లోపల బాంబ్ అమర్చి ఉందేమో అని అనుమానం కలిగిస్తున్న నేపథ్యంలో మీకెలా అనిపిస్తోంది?"

"చాలా హాపీగా ఉందండీ!"

"ఎందుకని హాపీగా ఫీలవుతున్నారు?"

"ఎప్పుడూ ఇలాంటి వార్తలు టీవీలో చూడ్డమే గానీ ఇలా మాకే అనుభవంలోకి రావటం చాలా హాపీగా ఉంటుంది కదా"

ఛప్పున పక్కనున్నావిడ అందుకుంది.

"అదీగాకుండా మా కెప్పటినుంచో టీ

వీలో కనబడాలని కోరికండి. ఈ చుట్టుపక్కల కాలనీల్లో ఉన్న రెండు లక్షల మంది ఏదొక టీవీ ప్రోగ్రామ్‌లో కనబడ్డవారే గానీ మాకే ఆ ఛాన్స్ రాలేదు-"

"నగరంలో పెరిగిపోతున్న ఈ బాంబ్ కల్చర్ గురించి మీరేమనుకుంటున్నారు? "

"అమాయకులను ఇలా చంపటం అన్యాయం అని నేను ఆ బిన్‌లాడెన్‌కి చెప్పాలనుకుంటున్నాను. అంతేకాదు. ఆ బిన్‌లాడెన్ ఏదొక రోజు నాకు కనబడక పోడు- అప్పుడు నాలుగు దులిపేస్తాను" కోపంగా అందామె. అందరూ నవ్వేసరికి ఆమెకు కోపం వచ్చి వెళ్ళిపోయింది.

"గిరీశం- ఇప్పుడు ఆ స్కూటర్‌ని ఏం

"ఈ స్కూటర్‌ని ఆ టెర్రరిస్ట్‌లు ఇక్కడ పెట్టి వెళ్ళిపోవటం కాలనీ వాచ్‌మెన్ చూశాడా?"
"చూశాననే వాచ్‌మెన్ చెప్తున్నాడు గజనీ-"

చేయబోతున్నారు? "

"ఇంకాసేపట్లో పోలీసులు వస్తున్నారు గజనీ- వచ్చాక యాంటీబాంబ్ స్క్వాడ్ వాళ్ళతో ఆ స్కూటర్ అంతా చెక్ చేయిస్తారు. ఒకవేళ అందులో నిజంగానే బాంబ్ ఉంటే దానిని డిఫ్యూజ్ చేస్తారు గజనీ-"

"ఈ స్కూటర్‌ని ఆ టెర్రరిస్ట్‌లు ఇక్కడ పెట్టి వెళ్ళిపోవటం కాలనీ వాచ్‌మెన్ చూశాడా? "

"చూశాననే వాచ్‌మెన్ చెప్తున్నాడు గజనీ-"

"అయితే అతన్ని అప్పుడే ఎందుకు పట్టుకోలేదు గిరీశం? ఏ కారణంగా ఆ టెర్రరిస్ట్‌ని చూసి కూడా వదిలేయాల్సి వచ్చింది? "

"ఆ విషయం వాచ్‌మెన్‌నే అడుగుదాం గజనీ- హలో నీ పేరేంటి? "

"సింగినాథం సార్"

"సింగినాథం- నువ్ టెర్రరిస్ట్‌లు స్కూటర్ తేవటం చూశానన్నావ్ కదా! మరి వాళ్ళని అప్పుడే ఎందుకు పట్టుకుని పోలీసులకు అప్పగించలేదు? "

"మంచిగున్నారే సార్-ఆళ్ళు టెర్రరిస్ట్‌లని నాకేం తెలుసు? బ్లాక్‌లో గీజర్ రిపైర్ ఉందని బుక్‌లో రాశారు. అందుకని ఎలక్ట్రీషియన్ అనుకుని పంపించాను-"

"ఇప్పుడు మళ్ళీ అతనిని చూస్తే గుర్తుపడతావా? "

"పడతాన్సార్-"

"ఇంతే గజనీ- సింగినాథం ఇంత కంటె ఎక్కువ ఇన్‌ఫర్మేషన్ ఇవ్వలేకపోతున్నాడు-"

ఈ వార్తా లైవ్ కార్యక్రమాన్ని చూస్తున్న మా ప్రేక్షకులందరూ వాచ్‌మెన్ తను డ్యూటీని సక్రమంగా నిర్వర్తించాడనుకుంటున్నారా లేక నిర్లక్ష్యంగా అజాగ్రత్తగా ఉన్నాడనుకుంటున్నారా? అనే విషయం వెంటనే ఎస్.ఎం.ఎస్ ద్వారా మాకు తెలియజేయండి. ఆ ఎస్.ఎం.ఎస్‌లో మీ పేరు, ఊరు రాయటం మర్చిపోకండి.

ప్రస్తుతానికింతే గిరీశం- పోలీస్ వచ్చాక మళ్ళీ మాట్లాడతాను. అంతవరకూ నీ కెమెరాని ఆ స్కూటర్ దగ్గరే పాతేసి ఉంచు. ఎవరెవరొస్తున్నారు? ఆ స్కూటర్ గురించి ఏమనుకుంటున్నారు? అన్నీ మన ప్రేక్షకులకు ప్రత్యక్షంగా చూపించే అవకాశం కలిగిద్దాం-"

"ఓకే గజనీ- బై-"

మాకు ఓ పక్క బాంబ్ పేలితే మా అపార్ట్‌మెంట్స్ అన్నీ కూలిపోతాయేమో, మేమంతా ఛస్తామేమో అని భయం పట్టుకుంటే- ఈ ఛానెల్ వాళ్ళు వాళ్ళ చానెల్ వ్యూయర్‌షిప్ పెంచుకోడానికి మా అపార్ట్‌మెంట్స్‌ని ఎన్నుకోవటం మాకు చిరాకు కలిగించింది.

అప్పుడే పోలీస్ జీప్ వచ్చి ఆగింది.

ఇన్‌స్పెక్టరు, సబిన్‌స్పెక్టర్, కానిస్టేబుల్స్ జీప్‌లోనుంచి సినిమాల్లో లాగా ఎగిరి బయటకు దూకారు గానీ అక్కడే నిలబడి పోయారు.

"సార్! ఆ స్కూటర్ ఇక్కడుంది" అంటూ అరిచాడు హమీద్ మియా. అయినా గానీ వాళ్ళు ముందుకు రాలేదు- రాకపోగా మళ్ళీ అందరూ జీప్ ఎక్కారు- ఎక్కటంతోనే మళ్ళీ దూకారు.

మాకు ఆశ్చర్యంగా ఉంది.

"ఒకవేళ ఇదోరకం డ్రిల్లేమో!" అన్నాడు రెడ్డి-

ఈలోగా వాళ్ళంతా మళ్ళీ జీప్ ఎక్కి మళ్ళీ అందరూ ఒకేసారి దూకారు. అంత వరకు కెమెరా అడ్జస్ట్ చేసుకుంటున్న గిరీశం కెమెరామెన్‌తో పాటు పోలీస్‌కి ఎదురుగ్గా వెళ్ళాడు. అప్పుడు జీప్ ఎక్కి మళ్ళీ దూకారందరూ-

"ఇంకొక్కసారి" అన్నాడు కెమెరామెన్ గిరీశం.

"ఎన్నిసార్లయ్యా! అందుకే మిమ్మల్ని కెమెరా పట్టుకుని రడీగా ఉండాలని ముందే చెప్పాను. ఈ ఏజ్‌లో ఇంతింత భారీ కాయాలతో అన్నిసార్లు జీప్ ఎక్కి దూకాలంటే మాటలా? అసలే మా సీఐకి జాయింట్ పెయిన్స్!"

"మీర్రావటం ఆలస్యమయిందని కెమెరా ఇప్పుడే ఆఫ్ చేశాన్సార్! త్వరగా దూకండి! ఆన్ చేశాను-"

"ఛ! మీతో లాభంలేదు. ఇంకో న్యూస్ చానెల్ కొత్తగా వచ్చింది. ఇకనుంచీ వాళ్ళని పిలుస్తాం! ఆ కొత్త చానెల్ హెడ్ మొన్నే బతిమాలివెళ్ళాడు. ఏ క్రైమ్ జరిగినా మా చానెల్‌నే పిలవండిసార్- మీకు ఎంతో కొంత ముట్టజెబుతాం- అన్నాడు తెలుసా? "




ఇలా తను ప్రత్యర్థి చానెల్ వాళ్ళు పోలీస్‌కి లంచం ఇవ్వడానికి రడీ అయ్యారనేసరికి గిరీశం జంకాడు.

తను నకరాలు చేస్తే ఇంకో క్రైమ్ స్పాట్‌కి ఆ చానెల్ వాళ్ళనే తీసుకెళ్ళినా తీసుకెళ్తారు-

"సారీ సార్"- ఎందుకయినా మంచిదని ఒకసారీ' పడేశాడతను.

కెమెరా కవరేజ్‌తోపాటు స్కూటర్ దగ్గరకు నడిచి స్కూటర్ చుట్టూ తిరిగి పరీక్షించారు వాళ్ళు. వెంటనే మళ్ళీ కెమెరా ఆన్ చేశాడు గిరీశం.

"ఈ స్కూటర్‌లో బాంబ్ ఉన్నదీ లేనిదీ నిర్ధారించుకోడానికి పోలీసులు వచ్చారు గజనీ!" ఇంకాసేపట్లో బాంబ్ డిస్పోజల్ స్క్వాడ్ వాళ్ళు కూడా చేరుకుంటారు. అప్పుడుగానీ మనకు కరెక్ట్ పిక్చర్ తెలీదు గజనీ!"

"ఈ స్కూటర్ గురించి పోలీస్ అధికారులేమంటున్నారు గిరీశం? "

"ఇప్పుడే ఇన్‌స్పెక్టర్ గారితో మాట్లాడతాను గజనీ! సార్! ఈ స్కూటర్‌లో బాంబ్ ఉన్నది లేనిదీ మీరేమయినా చెప్పగలరా? "

"ఖచ్చితంగా ఉండే ఉంటుంది! లేకుంటే స్కూటర్ ఈడొదిలి ఎందుకు పోతారు? "

"ఈ సందర్భంగా మీరెవరిని అనుమానిస్తున్నారు? "

"ఇది ఖచ్చితంగా మన దేశంలో ఉన్న రెండొందల అరవై ఆరు టెర్రరిస్ట్ ఆర్గనైజేషన్స్‌లో ఒకదాని పని అని నేను ఘంటాపథంగా చెప్పగలను!"

"ఈ సందర్భంగా జంటనగర ప్రజలకు మీరిచ్చే సందేశం ఏమిటి? "

"ఈ బాంబ్ పేలుళ్ల గురించి మీరెవరూ ఆందోళన చెందాల్సిన అవసరం లేదు. ఉన్నోడుంటాడు- పోయినోడు పోతాడు! ఎంతమంది పోయినా మన దేశానికున్న వంద కోట్ల జనాభా ఎప్పటికీ తరగదు- మన జనాభాని తగ్గించుకోటం మన గవర్నమెంట్ వల్లే కాలేదు. ఇంక టెర్రరిస్ట్‌ల వల్లేమవుతుంది? "

ఆ డైలాగ్‌తో అక్కడున్నవారంతా దేశభక్తి పొంగిపొరలి చప్పట్లు కొట్టారు.

"భారత్ మహాన్ హై" అన్న అరుపులు వినిపించినయ్ జనంలోనుంచి.

అప్పటికే మా అపార్ట్‌మెంట్స్‌లో స్కూటర్ బాంబ్ పేలబోతోందన్న వార్త టి.వి. చానెళ్ళలో ప్రత్యక్షంగా ప్రసారం అవుతుండడంతో చుట్టుపక్కల ఊళ్లనుంచీ, లొకాలిటీ నుంచి జనం తండోపతండాలుగా రావటం మొదలుపెట్టారు.

వాళ్లను కంట్రోల్ చేయడానికి అప్పటికప్పుడు రెండొందల మంది పోలీసులను పంపించమని పై అధికారిని వైర్‌లెస్‌లో కోరాడు ఇన్‌స్పెక్టర్.

"నీకేమైనా తెలివుందా? అంతమంది పోలీస్‌లెక్కడున్నారు మన దగ్గర? ఉన్నోళ్ళలో 50 శాతం మినిస్టర్స్ ఇళ్ల దగ్గరా, హై అఫీషియల్స్ ఇళ్ళ దగ్గర పెట్టాంకదా! ఇప్పుడు ఇంకొంత మందిని చిరంజీవి ఇంటి దగ్గరకు కూడా పంపించాం! పైగా అసలు 35 వేల వేకెన్సీలు ఇంకా భర్తీ చేయనేలేదు. అన్నీ తెలిసి రెండొందల మందిని పంపమంటావేంటి? నేనూ, డిజిపిగారు కూడా యూనిఫారం వేసుకు వచ్చినా వందమంది కూడా ఉండరు"

"పోనీ ఎంతమందుంటే అంతమందిని పంపించండి సార్! అన్నట్లు ఇంకో రిక్వెస్ట్ సార్"

"ఏంటది? "

"రేపు నాకు చిరంజీవి, రాజశేఖర్ ఇళ్ల దగ్గర స్పెషల్ డ్యూటీ వేయండి సార్. సరదాగా చిరంజీవితో మాట్లాడ్డానికి ఛాన్స్ ఉంటుంది"

"ముందా బాంబ్ సంగతి చూడు!" కోపంగా అరిచాడు అధికారి.

మరి కాసేపట్లో బాంబ్ స్క్వాడ్ వాళ్లు వచ్చారు. వాళ్లు రాగానే గిరీశం మళ్ళీ యాక్టివ్ అయిపోయాడు.

కెమెరా పట్టుకుని ఎడాపెడా షూటింగ్ చేసేస్తున్నాడు.

మా కాలనీ ప్రెసిడెంట్ హమీద్‌మియా సెల్‌ఫోన్లో ఆ టి.వి. న్యూస్ ఛానెల్ వస్తోంది. మేమంతా ఆ సెల్‌ఫోన్లో కనబడుతుంటే మాకే 'థ్రిల్' కలుగుతోంది.

ఈ విషయం తెలుసుకునేసరికి కాలనీ లేడీస్ అందరూ ఒకర్నొకరు తోసుకుంటూ కెమెరా ముందు నిలబడ్డానికి ప్రయత్నిస్తున్నారు.

"ఇప్పుడు హైద్రాబాద్‌లోని రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్‌లోకెళ్లి అక్కడ స్కూటర్ బాంబ్ పరిస్థితేమిటో మన ఛానెల్ జర్నలిస్ట్ గిరీశం నడిగి తెలుసుకుందాం!

"గిరీశం! ఇప్పుడక్కడ ఏం జరుగుతోంది? "

"ప్రస్తుతం బాంబ్ స్క్వాడ్ వచ్చింది గజనీ! వాళ్లు స్కూటర్ డిక్కీని తెరవడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ తరువాత లోపలున్న బాంబుల్ని డిఫ్యూజ్ చేస్తారు గజనీ!"

"ఈ సమయంలో ఆ బాంబ్ స్క్వాడ్ ఇన్‌ఛార్జిగారేమంటున్నారు గిరీశం"




“ఇప్పుడే అడిగి తెలుసుకుందాం గజనీ! హలో సర్. ఇప్పుడు ఈ బాంబ్‌ని నిర్వీర్యం చేయడానికి ప్రయత్నిస్తున్నారు కదా. మీకెలా అనిపిస్తోంది? ”

“ఏయ్ నీకేమయినా దమాకుందా? నీయవ్వ- బాంబ్ మా చేతుల్లోనే ఎక్కడ పేల్తుందో అని నానా టెన్షన్‌తో మేము చస్తుంటే మధ్యలో మీ లొల్లి ఏంది? చల్ హట్!”

“చాలా టెన్షన్ ఫీలవుతున్నారు గజనీ! ఎందుకంటే అది బాంబ్‌తో వ్యవహారం కదా!” అందరూ బాంబ్‌స్క్వాడ్ వాళ్ళు స్కూటర్ డిక్కీ ఓపెన్ చేస్తూంటే చిన్నెత్తు శబ్దం కూడా లేకుండా సస్పెన్స్‌తో చూస్తున్నారు.

సడెన్‌గా నలుగురు గాళ్స్ ప్రత్యక్షమయారక్కడ- అందరిదీ ఒకటే కలర్, ఒకే మోడల్ డ్రస్!

నలుగురూ జనంలో నాలుగు మూలల కొచ్చి బ్యాగ్‌లో నుంచి అప్లికేషన్ ఫామ్స్ తీసి పంచసాగారు.

“సార్! ఐసీఐసీఐ హెల్త్ ఇన్సూరెన్స్ స్కీమ్ ఫండ్ కొత్తగా ఓపెనయింది. సార్- ఎల్లుండి క్లోజయిపోతుంది. మీరు నెలకు వెయ్యి కడితే మూడేళ్ళయ్యాక 72 వేలవుతుంది సార్- ఇంకెక్కడా ఇంత లాభం మీకు దొరకదు సార్-”

36 వేలు 72 వేలవుతుందనేసరికి జనం ఆ అమ్మాయిల చుట్టూ మూగిపోయారు. పోలీసులు ఇక లాభం లేదని వాళ్ళందరిని బయటగ్గెంటారు. అటువాళ్ళనిగెంటారో లేదో ఇటు బజ్జీలమ్మేవాళ్ళు, ఐస్‌ఫ్రూట్ అమ్మేవాళ్ళు, కొంతమంది అడుక్కుతినేవాళ్లు జనంలోకి చొరబడిపోయి బిజినెస్ స్టార్ట్ చేసేశారు. ఇదే ఛాన్స్ మా సొసైటీ ప్రెసిడెంట్ హమీద్‌మియా తను బంగ్లాదేశ్ యుద్ధంలో పాల్గొన్న విశేషాలుగా అందరికీ బలవంతంగా వినిపించడం ప్రారంభించాడు.

కల్చరల్ సెక్రటరీ శంకర్‌మూర్తి కాలనీ లోని పిల్లలందరినీ ఓ మూలకు చేర్చి వచ్చే గణపతి నవరాత్రి ఉత్సవాలకి వాళ్ళు ఏ

సినిమా పాటలకు రికార్డ్ డాన్స్ చేయగ లరో పరీక్షిస్తున్నాడు.

లేడీస్ వింగ్ ప్రెసిడెంట్ షైనీ తన కాల్ సెంటర్ అనుభవాలు లేడీస్ అందరికీ చెప్తోంది.

జనరల్ సెక్రటరీ మొహిందర్‌సింగ్ సర్దార్‌జీ జోకులు చెప్తున్నాడు తన చుట్టూ ఉన్నవాళ్ళకి - తనను రాత్రి రెండింటికి టాక్సీవాడు రేప్ చేయడానికి ప్రయత్నిం చటం - తను కరాటే కిక్కులతో వాడిని చావగొట్టి - తనే తీసుకెళ్ళి హాస్పిటల్లో చేర్పించటం- అవధాని టీవీ చానెల్లో పని చేసే స్టాఫ్ చుట్టూ ఎలాంటి పొలిటిక్స్ ఉంటాయో విరక్తిగా చెప్తున్నాడు.

అప్పటికి స్కూటర్ హాండిల్ కింద ఉన్న వైర్లనీ కత్తిరించేశారు బాంబ్‌స్క్వాడ్ వాళ్ళు. తీరా డిక్కీ ఓపెన్ చేయబోతుం డగా హమీద్‌మియా స్పెషల్‌గా తయారు చేయించిన చాయ్ బిస్కెట్లు ఆ బాంబ్ స్క్వాడ్ వాళ్ళకూ, పోలీసులకూ కప్పుల్లో సప్లయ్ చేయటం మొదలుపెట్టాడు.

"మీరు మా కాలనీ కోసం పాటుబడుతు న్నారు గనుక ఈ మాత్రం చెయ్యకుండా ఎలా ఉంటాం సార్" అంటున్నాడు. చిరు నవ్వుతో కాసేపు దూరదూరంగా జరిగి రిలాక్సవుతూ వాళ్లంతా కబుర్లు చెప్పుకుం టున్నారు. సందట్లో సడేమియా అన్నట్లు సరిగ్గా అందరూ టీ తాగుతూన్న సమ యంలో ఓ యువకుడు హడావుడిగా వచ్చి ఆ స్కూటర్ స్టాండ్ తీసి స్టార్ట్ చేయడానికి కిక్ కొడుతూంటే అప్పుడు స్పృహలో కొచ్చి అందరూ అతనిని గట్టిగా పట్టుకున్నారు.

"ఏంట్రా! స్కూటర్ స్టార్ట్ జేస్తున్నావ్"

"నాదే సార్ ఇది!"

"నీదా? మరి పొద్దున్నుంచీ మొత్తుకుం టూంటే ఏమైపోయావురా నువ్వు?"

"స్కూటర్లో బాంబుందా?" అడిగాడు ఒక కానిస్టేబుల్.

"బాంబా? బాంబుందా సార్ ఇందులో?" భయంగా అడిగాడు వాడు.

ఇన్‌స్పెక్టర్ ఆ యువకుడి కాలర్ పట్టు కుని పక్కకులాక్కెళ్ళాడు.

"ఏదీ నీ డ్రైవింగ్ లైసెన్స్ చూపించు-"

"లేద్సార్"

"పోనీ నీ అయిడెంటీ కార్డు ఏమైనా ఉందా?"

"లేద్సార్"

"అసలు నువ్వెవరు? నీ పేరేంటి? నువ్వెక్కడుంటావ్?"

వాడు పొంతన లేకుండా సమాధానం చెప్తూంటే సీఐ నాలుగు తగిలించాడు. దాంతో నిజం చెప్పేశాడు. వాడు.

"నేను ఈ ఏరియాని చాంద్ పైల్వాన్‌కి లక్ష రూపాయలిచ్చి కొనుకున్నా సార్!"

"ఈ ఏరియా కొన్నావా?"

"అవున్సార్! ఈ ఏరియాలో ఏ దొంగతనమయినా నేనే చేయాలి. ఇంకోడె వడూ నా ఏరియాకొచ్చి చెయ్యకూడదు. అందుకే లక్ష ఇవ్వటం- ఈ సొసైటీ కూడా నాదే గనుక నెలకొసారి ఇక్కడకొచ్చి స్కూటరు, మోటర్ సైకిలు ఎత్తుకుపో తూంటాను సార్-"

ఆ మాటతో పోలీసులకు వళ్ళు మండి పోయింది.

"ఏంట్రా! చాంద్ పైల్వాన్ ఒక్కొక్క ఏరి యాకో ఒక్కో లక్ష వసూలు చేస్తున్నాడా?"

"అవున్సార్! మరీ బిజీ ఏరియా అయితే అయిదు లక్షలు-"

"మరి మాతో పాతికవేలే అన్జెప్పాడే! అంటే ఈ లెఖ్ఖన వాడు యాభై లక్షలు సంపాదిస్తున్నాడు- చూశారా సార్! మనకి పది లక్షలే మామూలు కడుతున్నాడు- ఆ చాంద్ పైల్వాన్‌గాడు" పై అధికారికి కంప్లె యింట్ చేశాడు ఎస్.ఐ.

ఆ అధికారి ఇంకా మండిపడ్డాడు.

**(బాంబు కథ ఏమైందీ తెలియా లంటే వచ్చే నెలదాకా ఆగాల్సిందే)** ©

# మరోవసంతం

డా॥ అక్కినపల్లి సుబ్బారావు



నడివయస్సుదాటిన కుమార్‌లో ఉన్న ప్రత్యేకత ఏమిటోగానీ అనుక్షణం జలజ ఆలోచనల్లో అతనే మెదిలేవాడు. ఏ పనిచేస్తున్నా అతనే గుర్తొచ్చేవాడు. అలాగని ఆమె కూడా పదహారేళ్ల బాలా కుమారేమీ కాదు. తను కుమార్‌కన్నా పెద్దది. అయినా ఈ వయసులో పరాయి మగాడిపట్ల ఈ ఆకర్షణేంటి? మనసు మాటవినదేం? పెళ్లయిన కొడుకూ కూతురూ గల ఆమె.. బాధ్యతల బంధనాల నుంచి విడివడే తరుణంలో అనూహ్యంగా చివురు తొడిగిన ఈ బంధం తన జీవితాన్ని ఎన్ని మలుపులు తిప్పింది? ఏ ఏ అనుభవాల్ని రుచిచూపింది? లేటువయసులో మనసుచేసే మాయాజాలాన్ని అందంగా అక్షరీకరించిన డాక్టర్ అక్కినపల్లి సుబ్బారావు అపురూప నవల మరోవసంతం ఈనెల చతుర కానుక.



"కుమార్ మెల్లిగా పరుపు మీద నుంచి లేచి కిందికి దిగబోతుంటే క్రితం రోజు చిన్ననాటి స్నేహితుడు సోమేశ్వరరావు దగ్గర నుంచి వచ్చిన ఉత్తరం జారి మంచం కింద ఎక్కడో వాలింది.

"ఏ వస్తువులైనా జారిపడితే, మనకి అందని మారుమూల ప్రదేశానికి వెళ్లి ఆగుతాయి" అంటాడు సూక్తులు చెప్పే తుర్ఫీ. "పుస్తక రూపంలో వచ్చిన తుర్ఫీ సూక్తుల్ని మరోసారి చదవాలి. ఇంటర్నెట్‌లో ఇంకా దానిని పెట్టి ఉండరు. జలజని లైబ్రరీ నుంచి తెచ్చిపెట్టమంటే తెస్తుంది" అనుకుంటూ పరుపు మీదనుంచి దిగి పెర్కోలేటర్‌ని ఆన్‌చేసి స్నానాల గదివైపు నడిచాడు కుమార్. బాత్రూంలో స్విచ్ వేయగానే ఎనిమిది బల్బ్‌లు ఒక్కసారి వెలిగి గదిని మిరుమిట్లు గొలిపేలా కాంతివంతం చేశాయి. జలజ తలపు వలన కాబోలు మొహం మీద చిరునవ్వు వ్యాపించింది. బ్రష్ చేసుకుని, గడ్డం గీసుకుని పది నిమిషాల తరువాత బాత్రూంలోంచి బైటకి వచ్చేసరికి పెర్కోలేటర్‌లో కాఫీ డికాక్షన్ తయారుగా ఉంది. డికాక్షన్‌కి కాసిన్ని పాలని మాత్రమే కలిపి, మైక్రోవేవ్‌లో వేడి చేసి చేతిలో కాఫీ కప్పుతో కిటికీకి ఎదురుగా నిలబడి, "నిన్నటిలా ఈవేళ నేల మీద కాఫీ ఒలకలేదు. పాపం జలజకి కిచెన్ దగ్గర పడిన కాఫీని తడిగుడ్డతో తుడవాల్సిన పని కల్పించా నిన్న" అనుకుంటూ బైటకి దృష్టి సారించాడు కుమార్.

ఆకలితో అరిచి అరిచి మొహమంతా ఎర్రబడిన పసికందులా ఉన్న సూర్యబింబం న్యూయార్క్ పట్టణంలో ఉన్న డెబ్భయి-ఎనభై అంతస్తుల భవనాల మధ్య నుంచి ఆకాశం మీదికి ఎగబాకుతోంది.

"నీకు సూర్యుడు, చంద్రుడు అంటే తెగ ఇష్టం కదూ?" అనడిగింది జలజ, సాయంసంధ్య సూర్యుడిని తదేకంగా చూస్తున్న తనని. చిరునవ్వు నవ్వాడు తను. సాయంకాలం సంధ్య సూర్యుడు! మనస్సు గతంలోకి పరుగుపెట్టింది. దాదాపు పాతికేళ్ల క్రితం... మధురానగరం మేడమీద కూర్చుని విశాఖపట్నం నుంచి బిచాణా కట్టేసి వెళ్లిపోతున్న సూర్యుడిని చూస్తున్నాడు తను. క్రికెట్ మ్యాచ్ జరుగుతోంది కాబోలు, రోడ్డుమీద జనంలేరు. తెరలు తెరలుగా, లీలగా మువ్వల శబ్దం వినిపించగా రోడ్డుమీదకి చూశాడు తను. ఒక స్త్రీ నడిచివెళ్తోంది. కాదు నడక ఇదే అని నిర్వచిస్తూ కదిలివెళ్తోంది. సాయంకాలపు బంగారు కిరణాలు ఆమె గంధపు రంగు లాంటి చీరమీద, రవ్వంత తెలుపు ఛాయ ఆమె శరీరం మీద పడి, నీళ్లలో పంచదార కలిసిపోయినట్లు కరిగిపోతున్నాయి. విసనకర్రకి మొదట్లో గీతలున్నట్లు అమర్చిన కుచ్చెళ్లు, అడుగులు పడుతుంటే కాళ్ల మడమలు మాత్రం అప్పుడప్పుడు కనిపించేంత దిగువ వరకు ఉన్నాయి. ముందర కాలు కదలికకి చీర కాస్త పైకి జరిగి వెనక కాలి తెల్లని మడమ, మడమ మీద తెల్లని వెండి పట్టీ దర్శనమిస్తున్నాయి. వెండి పట్టీలకి చిన్న మువ్వలున్నాయి కాబోలు, కాలి కదలికతో అత్యంత క్రమబద్ధమైన లయతో శబ్దాన్ని వదులుతున్నాయి. పల్చని గాలి, సన్నని గాలి, సౌమ్యమైన, సొంపైన, సొగసైన గాలి ఆమె ముంగురులని తాకి వింతగా వాటిని ఊగిస్తుంటే, అలసిపోయిన సూర్యుడు ఆమెని చూసి ఉత్సాహంతో గెంతులేసి, నొప్పించకుండా ఆమె మీదకు కిరణాలను తలంబ్రాలలా జారవిడుస్తున్నాడు. ఆ స్త్రీ బహుశా ఐదడుగుల మూడంగుళాల పొడవు, నలభైఅయిదు కిలోల బరువు ఉంటుందేమో! సన్నని

# తిరస్కరించినా ఆనందమే!




**న్యూ**యార్క్‌కి చెందిన ప్రసిద్ధ ప్రచురణ సంస్థ డబుల్‌డే పేజ్ ఎప్పుడూ ఓ నియమాన్ని పాటించేది. ఓ రచయిత కథని అంగీకరించడం లేదని తెలియచేసే ఉత్తరం రాసే టప్పుడు ఆ రచయిత దుఃఖంగా ఉండకుండా సంతోషించేలా చేయాలని ఇలా చేసేది. ఈ విషయంలో ఆ సంస్థ ఎంత నిపుణత సాధించిందంటే ప్రముఖ రచయిత ఓ హెన్రీ ఓ సారిలా అన్నాడు-

"నా కథల్లో ఒకదాన్ని డబుల్‌డే పేజ్ తిరస్కరిస్తూ రాసే ఉత్తరం వల్ల నేను రచయితగా సమర్థుడినన్న నమ్మకం నాలో బలపడిసాగింది. వారు ఆ కథని తిరస్కరిస్తూ ఎంత దయగా, పొగడ్తతో రాశారంటే రచయితకి ఆ ఉత్తరం ధైర్యాన్నిస్తుంది. మరో పత్రిక కథని అంగీకరిస్తూ రాసే ఉత్తరంకన్నా నాకు వీరి తిరస్కార ఉత్తరమే ఆనందాన్నిచ్చింది"

## మనసున ఉన్నదీ...

**'చతుర' ఇపుడు సరికొత్త అందాలతో సర్వాంగ సుందరంగా వెలువడుతున్న విషయం మీకు తెలిసిందే. ఉత్తమ నవలలతోపాటు సరికొత్త శీర్షికలను షడ్రసోపేతవిందుగా అందిస్తున్న 'చతుర'కు లెక్కకు మిక్కిలిగా అభినందనలు నిత్యం మా కార్యాలయానికి చేరుతున్నాయి.**

**మరి మీరేం అనుకుంటున్నారు?**

**మీ అభిప్రాయాలను క్లుప్తంగా పోస్టుకార్డుపై మాత్రమే రాసి పంపండి.**

**ఈ-మెయిల్ కూడా చేయవచ్చు.అభిప్రాయాలు మాకు చేరాల్సిన చివరితేదీ ప్రతినెలా 20.**

చిరునామా: సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ -500 082
ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

## కొత్తగాలి...

**'అమ్మా-నాన్న'**
**అనాధలా?**
**'మమ్మీడాడీ'**
**వచ్చేరుగా!**

*-ధరణికోట శివరాంప్రసాద్, హైదరాబాద్*

శరీరం, దానికి సరిపడా మొహం, ఉలిపెట్టి చెక్కినట్లున్న చెక్కిళ్ళు, రెండు నల్లని కను బొమ్మల కింద, ఆమె తల ఎత్తినపుడు స్వచ్ఛమైన కళ్లు కనిపించాయి. తీర్చిదిద్దిన నాసిక, లిప్‌స్టిక్ రాసిందో ఏమోకాని దాని మ్మగింజ రంగు అధరాలు, సన్నని పొడ వాటి హంస మెడ, మెడలో విరాజిల్లు తున్న తెల్లని ముత్యాలదండతో, 'ప్రకృతిలో ఇంత అందమైన స్త్రీ ఉంటుందా?' అని పిస్తూ కనిపించింది. మొహం మీదికి మోతాదుకి మించి వాలేయి కాబోలు, కుడి చేతితో ముంగురులని హుందాగా సవరిం చడంలో ఆల్చిప్ప ఆకారంలో చెవి, చెవి కింద భాగంలో కమ్మలకి వేలాడుతున్న చిన్న బూటాలతో జూకాలు కనిపించాయి. జూకాలు మనోహరంగా ఊగుతున్నాయి. చెయ్యి మీదకి ఎత్తినపుడు బొడ్డున దోపిన వెండి తాళాలగుత్తి తళుక్కుమంది వెలుతు రులో. ముక్కుకి పుడకలేదు, పాపిడిలో జిగినీనాను లేదు. అవి కూడా ఉంటే అప్పుడే భరతనాట్య ప్రదర్శనకి ముస్తాబై తరలివెళ్లబోతున్న నాట్యకత్తెలా ఉండేది. కుడిచేతికి వాచీ, ఎడమ చేతికి బహుశా ఏడెనిమిది మట్టిగాజుల మధ్య రెండో, మూడో బంగారుగాజులు ఉన్నాయి. ధరిం చిన దుస్తులకి సామాన్య ఆభరణాలకి ఒక రకమైన వెలుగుని, హుందాతనాన్ని ఆపా దిస్తోందామె ఆకృతి. ఆమెని బహుశా రెండు నిమిషాలపాటు చూసి ఉంటా డేమో! పరీక్షగా మరోసారి గమనించేలోగా ఆమె వీధి మలుపు తిరిగి మాయమైంది. తను కళ్లు మూసుకుని ఆ సౌందర్యాన్ని తన మెదడులో ముద్ర వేసుకుని కళ్లు తెరి చేటప్పటికే ఆమె అదృశ్యమయింది. సూర్యుడూ ఆమెని వెతకడానికి వెళ్లి మాయమవడంతో చీకటి క్రమేణా ముసు రుకుంది.

అతడి వయస్సు అప్పుడు పద్దెనిమిది. కాలేజీలో చేరడానికి ఉద్యుక్తుడవుతు న్నాడు. సౌందర్యరాశి లాంటి ఆ స్త్రీ వయ స్సును తను ఊహించే ప్రయత్నం చేయ లేదు. తరువాత దాని గురించి ఆలోచిం చినా ఒక నిర్ణయానికి రాలేకపోయాడు తను.

"కాఫీ చల్లారిపోయినట్లుంది, వేడిచేసి తీసుకువస్తాను. ఎంతసేపు అలా తదే కంగా సూర్యుడివైపు చూస్తావు? నేను వచ్చిన సంగతే గమనించలేదు" అంటూ కప్పుని అతడి చేతిలోంచి తీసుకుంది జలజ.

మైక్రోవేవ్ వేపు నడిచి వెళ్లి కాఫీ వేడిచే స్తున్న జలజవైపు పరీక్షగా చూశాడు కుమార్. మైక్రోవేవ్‌లో ఉన్న బంగారు కాంతి దాని కంతలలోంచి ఆమె మొహం మీద లీలగా పడి ఆనందంతో ఎగిరి గంతులేస్తోంది.

అదే మొహం! అదే హుందాతనం! అదే నిండుదనం! మొహంమీద ముంగురులు అలాగే కదలాడుతున్నాయి. ఆనాడు తనకి వినిపించనివి, ఈనాడు తన చెవిలో పడి నవి ఆమె మాటలు. లేతపాకంలో తీపిని కడుపునిండా పీల్చుకున్న గులాబ్ జామ్‌లో తీయదనంలా, ఆమె పలుకులు తీయగా ఉంటాయి. తను మొట్టమొదటిసారి ఆమెని గతంలో ఎప్పుడో దూరం నుంచే పరీక్షగా చూశానన్న సంగతి ఆమెతో ఎప్పుడూ చెప్పలేదు. అబ్బో! అది జరిగి

చతుర ప్రపంచం




# ఓ మానవతావాది దాతృత్వం

అమెరికాలో సెకండ్ హేండ్ కార్లని అమ్మే వృత్తిలోనివారికి మంచి పేరు లేదు. వారు మోసగాళ్ళనే అభిప్రాయం ప్రజల్లో బాగా ఉంది. కాని ఆరెగాన్ రాష్ట్రంలోని పోర్ట్‌లాండ్‌లో ఉన్న కారు డీలర్ కొర్రీ హాల్జ్ వాండర్ ఇందుకు భిన్నమైన వ్యక్తి.

డిసెంబర్ 2007లో ఓ రోజు అతను తన ఇంటి ఆవరణలోని, తన కారులో పడుకుని నిద్రపోతున్న ఒకతడ్ని చూసి లేపాడు. తనకి ఇల్లు లేకపోవడంతో, అక్కడ పడుకున్నానని అతను జవాబు చెప్పాడు. అతన్ని తిట్టి వెళ్ళగొట్టే బదులు హాల్జ్‌వాండర్ అతన్ని ఇంట్లోకి ఆహ్వానించి, కాఫీ ఇచ్చి రెండు గంటలసేపు మాట్లాడాడు.

అతని పేరు డాన్ పెచుమ్. అతనికి కాలేజీకి వెళ్ళే ఓ కొడుకున్నాడు. హాల్జ్‌వాండర్ నించి అతను ఓ జత పాత బూట్లు మాత్రమే ఆశించాడు. కాని, ఇంకా ఎక్కువ సహాయమే అందింది. అతని కొడుకుకి తన ఆఫీసులో పార్ట్‌టైం ఉద్యోగం ఇచ్చాడు. ఓ నెల అద్దె కట్టి, ఓ అపార్ట్‌మెంట్‌ని కూడా ఇప్పించాడు.

డాన్ ఈ సంగతి జైలు శిక్ష అనుభవించి విడుదలైన తనమిత్రుడు ఫీన్‌వుడ్‌కి చెప్పడంతో అతడు హాల్జ్‌వాండర్‌ని సహాయం కోసం కలిశాడు. అతనికి కూడా వాచ్‌మెన్ ఉద్యోగం ఇచ్చాడు. మిత్రులు వారించినా వినలేదు. త్వరలోనే ఈ మంచి వ్యక్తి గురించి ఇల్లు లేనివాళ్ళకి, జైలులోని వాళ్ళకి తెలిసింది. వారంతా అతన్ని ఆశ్రయించసాగారు. ఎంతమంది వచ్చినా కాదనక తన ఆఫీస్‌లో ఉద్యోగం ఇచ్చాడు. అతను సహాయం చేసిన ఏభైమందిలో ఒకరైన యాండీగ్రేషియా, తన భార్య, ఇద్దరు పిల్లలతో ఓ వేన్‌లో నివశిస్తున్నాడు. అతనికి ఉద్యోగం ఇచ్చి ఓ నెల అద్దె అడ్వాన్స్‌గా కూడా ఇచ్చాడు.

ఇంకా ఎక్కువమందికి సాయం చేయాలని ఐదు బెడ్‌రూంలు గల ఓ ఇంటిని కొన్నాడు. ఎవరైనా సరే, ఉద్యోగం, ఇల్లు సమకూరే దాకా అందులో ఉండవచ్చు. వాళ్ళు వెళ్లాక కొత్తవారు ఆ ఇంటికి వస్తారు.

'ఈ భూమండలం మీద చెడ్డ వ్యక్తులు లేరు. దారి తప్పిన వారున్నారు' అని ఓ అమెరికన్ టి.వి.కి ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పాడు హాల్జ్‌వాండర్.

ఇరవై ఐదేళ్లు పైనే అయింది. అన్నాళ్ల యినా, అలనాటి ఆ ముద్ర చెరగకుండా, పెద్ద సరస్సులో విచ్చుకున్న రంగుల కమ లంలా గుండెనిండా నిండి ఉంది.

"థాంక్యూ" అంటూ జలజ తెచ్చిన కాఫీ కప్పు అందుకుని కాఫీ చప్పరించబోతే నాలిక చురుక్‌మంది.

"నే కాఫీ వేడిగా తాగుతాను బాబూ. వేడి ఎక్కువైందా? ఏదీ చూడనీ", అంటూ కప్పు అందుకుని ఒక గుక్క తాగి, "వేడీ లేదు ఏమీలేదు, సింగినాదం. వేడి వేడిగా కాఫీ తాగకపోతే ఏం బాగుంటుంది? " అంది జలజ కప్పు తిరిగి చేతికి అందిస్తూ. జలజకి చాలా వాటిమీద నిశ్చితాభిప్రా యాలు ఉన్నాయి. వాటిలో కాఫీ వేడి ఒకటి.

కాఫీ తాగుతూ ఏదో జ్ఞాపకం వచ్చింది కాబోలు, జలజ మొహంమీద ఉదయించిన చిరునవ్వు చూసి,

"ఎందుకా చిరునవ్వు? ఏం జ్ఞాపకం వచ్చిందేమిటి? " అనడిగేడు కుమార్.

"నీకెలా తెలిసింది, ఏదో జ్ఞాపకం వచ్చిందని? " అంటూ జలజ కళ్ళు ఆశ్చ ర్యంతో పెద్దవి చేసింది. విప్పారిన ఆ కళ్ళని, వెలుగుతున్న జలజ మొహాన్ని చూసి కుమార్ ఆనందంతో కళ్ళు మూసు కుని, "నీ హావభావాలలో కొన్నిటికి కారణం నాకు తెలుస్తుంది" అన్నాడు.

"ఏం తెలుస్తుందో ఏమో, నేను వచ్చా ననే నువ్వు ఆశ్చర్యం ప్రకటించలేదు" అంది జలజ.

"నిజమే, నువ్వు రాగానే నన్ను నేను మరచిపోతాను. ఇంతకీ నీ చిరునవ్వుకి కారణం ఏమిటి? " అనడిగాడు కుమార్.

"క్రిందని ఈ బిల్డింగ్‌కి కొన్సియర్ ఉంటాడు కదా! ఎప్పుడు నేలోపలికి వచ్చి ఎలివేటర్‌వేపు నడవబోతున్నా, దగ్గరకి వచ్చి 'యు లుక్ లవ్లీమేడమ్' అంటాడు" అంది జలజ.

"ఎవడు? ఆ అరవైఏళ్ళ ముసలివాడా? డేంజరస్ ఫెలో జాగ్రత్త" అంటూ కుమార్ హెచ్చరించాడు.

"ముసలివాడూ డేంజరసే, పడుచు వాడూ డేంజరసే" అంటూ నవ్వింది జలజ.

గోదావరి నది నాసిక్ దగ్గర ఉదయించి ప్రవహిస్తూ ఊపందుకుని గమనంతో పాటు విస్తరించినట్లు జలజ మొహంమీద ముక్కుపుటాల చివర్ల, పెదవుల అంచున మొదలయిన నవ్వు క్రమేణా చెక్కిళ్లని మీదకి లేపి, పెదవులని విప్పార్చి, కళ్ళని చికిలింపచేసి మొహం అంతా విస్తరింపచే సింది. నవ్వుతో చెక్కిళ్ళలోనికి రక్తం చింద డంతో మొహం లేత ఇటుక రంగుగా మారడం కుమార్‌ని గిలిగింతలు పెట్టింది.

"నేను ఇంకొక అరగంటలో క్వీన్స్ హాస్పి టల్‌కి వెళ్ళాలి. రెండు గంటలు వలంటరీ వర్క్ చేస్తానని ఒప్పుకున్నాను. అందుకే మామూలుకన్నా ఒక అరగంట ముందరే వచ్చాను" అంటూ కాఫీ కప్పు కడిగి, దానిని యథాస్థానంలో ఉంచి ఒక్కసారి కుమార్‌ని దగ్గరికి తీసుకుని, చెంపకి చెంప ఆన్చి "రేపు ఉదయం నాకు ఖాళీ, బ్రేక్ ఫాస్ట్ కలిసి చేద్దామా? " అనడిగింది జలజ.

"రేపు ఉదయం నన్ను కలవడానికి ఒక తను పదిన్నర గంటలకి వస్తానన్నాడు. కాస్త తొందరగా వస్తే కలిసి బ్రేక్‌ఫాస్ట్ చేయవచ్చు ఉప్మా చేస్తావా? " అడిగాడు కుమార్.

"సాయంత్రం కలుస్తాం కదా, అప్పుడు దాని గురించి మాట్లాడుకుందాం" అంటూ జలజ నిష్క్రమించింది. జలజ వెళ్ళినవేపే చూస్తూ నిట్టూర్చాడు కుమార్.

అతడు అమెరికా వచ్చి దాదాపు ఇరవై ఏళ్ళయింది. ఇంజనీరింగ్ ముగించి, నాలు

గేళ్ళు టాటా కంపెనీలో పనిచేసి ఎమ్. ఎస్. చేయడానికి అమెరికా వచ్చాడు. తరువాత ఉద్యోగం, గ్రీన్‌కార్డ్ సంపాదించాక ఉద్యోగంలో పైకి ఎదిగాడు. అత్యాశకి పోకుండా ఒకే పెద్ద కంపెనీలో పనిచేయడంవల్ల ఉద్యోగం పోకుండా నిలబడగలిగాడు. తన జీవితం రెండే రెండుసార్లు గాడి తప్పింది. అందులో ముఖ్యమైనది రెండోసారి జరిగిందే. గతం ముందర నిలుచుంది.

అది డిసెంబర్ మాసం. క్రిస్ట్‌మస్‌కు రెండు రోజుల ముందర మంచు కురుస్తున్న రోజు. ఆఫీసునుంచి రాత్రి పదకొండు గంటలకి ఇంటికి తిరిగి వస్తూ ట్రాఫిక్ లైట్ దగ్గర కారు ఆపాడు. తన కారుకి ముందరా వెనుకా ఇంకే వాహనాలు లేవు. రోడ్డుమీద చేరుతున్న మంచుని పక్కకి నెడుతున్న వాహనం తన కారుకి వెనుకగా ఆగబోయింది. కాని అప్పుడే పడిన మంచుమీద ఎక్కువ వేగంగా రావడంవల్ల కాబోలు ఆగకుండా వచ్చి తన కారుని మెల్లగా ఢీకొంది. అంత బలమైన వాహనం గుద్దడంతో అతడి కారు రెడ్‌లైట్‌ని దాటి ఆగింది. గ్రీన్‌లైట్ ఉన్న రోడ్డులో, రెండవ దిశలోంచి వస్తున్న వేన్‌లాంటి కారు తన కారుని పక్కనుంచి గుద్దింది. దాంతో తన కారు బొంగరంలా రెండు గిరికీలు కొట్టి ఆగింది. కారు బాగా దెబ్బతింది. అతడికి బాగా దెబ్బలు తగిలాయి. పక్కనుంచి కారు వచ్చి అతడిని ఎదురుగా ఢీకొనడంతో కాళ్ళు నలిగిపోయి సొట్టపడిన కారు ముందర భాగంలో ఇరుక్కుపోయాయి. చావులోంచి బైటపడినా, మోకాళ్ల దగ్గర నుంచి కాలు తీసేయాల్సి వచ్చింది. మునిసిపాలిటీ ఇచ్చిన పరిహారం, కంపెనీ ఇస్తున్న డిసెబిలిటీ సహాయంతో ఆర్థిక ఇబ్బంది లేకుండా రోజులు వెళ్తున్నాయి. జీవిత రథం మళ్ళీ పట్టాలమీదకి వచ్చినా, కృత్రిమకాళ్ళతో నడక అతడి జీవితంలో చేదును నింపింది.

ఇలాంటి సంఘటనలు జరిగినప్పుడు, అందరూ ప్రశ్నించేలాగే 'నేనేం పాపం చేశానని నాకీ శిక్ష?' అనుకుని మధనపడేవాడు ఏక్సిడెంట్ అయిన కొత్తలో. కంపెనీ ఉదారంగా వ్యవహరించి వారంలో రెండురోజులు మాత్రం ఆఫీసుకి వచ్చి మిగతా మూడురోజులూ ఇంటిలో ఉంటూ కంపెనీ పనిచేయవచ్చు అనడంతో కొంత వ్యాపకం ఏర్పడింది. ఆటలన్నా, స్పోర్ట్స్ అన్నా పడిచచ్చే తను వాటిలో పాల్గొనే అవకాశం లేకపోయింది. శరీరానికి సరైన వ్యాయామం లేదు. తన ఆలోచనా ధోరణిలో మార్పు వచ్చింది.

ఎవరి తప్పు లేకుండా జరిగిన ప్రమాదానికి ఎవరినీ నిందించడానికి లేక కొన్నాళ్ళు 'అలా రాసిపెట్టి ఉంది', 'అందుకే అలా జరిగింది' అనుకుని సమాధానపడ ప్రయత్నించినా తర్కించుకునే తత్వం దానిని ఒప్పుకోలేకపోయింది.

ఆవేళ ఆ మంచు తొలగించే మెషీన్ కారు వచ్చి తనకి ఏక్సిడెంట్ కలిగిస్తుందని ఎవరో ఎప్పుడో నిర్ణయించడమేమిటి? అలా గుద్దాలని ఆ మంచు మెషీన్ డ్రైవర్ నుదుటని రాసి ఉంచారా? ఆవేళ మంచు కురుస్తుందని ఎవరి నుదుట రాసి ఉంటారు? ఆవేళ తను పీజా తినడానికి ఆగుతానని, ఆగాలని నుదుటని రాసి ఉంటుందా? ట్రాఫిక్ లైట్స్ కంట్రోల్ చేయడం కూడా పూర్వజన్మ పాపపుణ్యాల మీద, ఆ క్షణంలో రెండవ వీధిలోంచి వేగంగా వచ్చిన వాన్‌డ్రైవర్ నుదుటి రాత మీద ఆధారపడి ఉందా? నాన్సెన్స్! అది కేవలం యాధృచ్ఛికత్వ, ప్యూర్ కో-యిన్సిడెన్స్ అనుకుని సర్దుకోవడానికి చాలా కాలం పట్టింది.

అది జరిగి ఐదేళ్ళయింది. ఆ ఏక్సిడెంట్ ప్రభావంలోంచి బైటపడి తిరిగి మను ష్యుల్లో పడడానికి తనకి దాదాపు మూడేళ్ళు పట్టింది. మొట్టమొదటిసారి ప్రభాకర్ ఇంటిలో భోజనానికి వెళ్ళాడు.

న్యూయార్క్ లాంటి పెద్ద పట్టణాలలో ఊరిమధ్య కట్టిన ఫ్లాట్లు చిన్నవిగా ఉండ డంతో పార్టీకి కేవలం ఐదారు కుటుంబాలే వచ్చినా, ఫ్లాట్‌లో జనం కిటకిటలాడుతు న్నట్లనిపించింది. తను పార్టీకి వెళ్ళేసరికి కాస్త ఆలస్యమైంది.

కర్ర కాళ్ళతో ఊతం లేకుండా నడవడా నికి ప్రయత్నం చేస్తున్న రోజులవి. అవ యవ లోపం కనపడకుండా దాచాలని ప్రయత్నం చేసే రోజులవి. అప్పట్లో అందులో ముఖ్యంగా కాళ్ళు తీసేసిన కొత్తలో ఎవరైనా తనని చూసి జాలిపడితే అతడిలో ఆపుకోలేనంత కసి ఉద్భవించేది. లోలోపల అర్థంలేని అసహ్యం రాజుకుని ఇబ్బంది పెట్టేది. ఆ రోజుల్లో అతడి పరి స్థితి మొదటికంటూ నరకబడి మోడువారి పోయి చిగురించడానికి ప్రయత్నిస్తున్న చెట్టులా ఉండేది.

ఫ్లాట్ తలుపు తీసుకుని లోపలికి ప్రవే శిస్తుంటే ప్రభాకర్ స్వాగతం పలికాడు. సోఫాలో కూర్చుని కబుర్లలో పడ్డారు. ఏక్సి డెంట్ అయినప్పుడు ప్రభాకర్ అతడి కుటుంబం తనని బాగా ఆదుకున్నారు. పార్టీ అంటే నిరాసక్తి పెంచుకున్న తను ప్రభాకర్ ఆహ్వానిస్తే, కాదనలేక ఆల



స్వంగా వచ్చాడు. ముందర గదిలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న అతిథులకి, వెనక డైనింగ్ టేబిల్ దగ్గర కూర్చున్న అతిథులు చెప్పుకుంటున్న మాటలు కలగాపులంగా వినిపిస్తున్నాయి. ముందర గదిలో ఎక్కువ మంది స్త్రీలు ఉన్నారేమో, పురుషుల మాటలు వినిపించడంలేదు.

ప్రభాకర్ భార్య అనిత వచ్చి "పెయింటింగ్ చాలా బాగుంది, థాంక్స్!" అంటూ షేక్‌హాండ్ ఇచ్చి వెళ్లింది.

అరగంట గడిచిందేమో... ఆఫీసు కబుర్లు, ప్రపంచదేశాలు, రాజకీయాల గురించి ఇద్దరు ముగ్గురు ఒకచోట చేరి చర్చిస్తున్నారు. తెలిసిన వ్యక్తులు తక్కువ మంది ఉండడంతో అతడికి సంభాషణల మీద ఆసక్తి సన్నగిల్లి ఆలోచనలోపడి కళ్ళు మూసుకున్నాడు. తాగుడు మోతాదు మించడంవలనో, లేక తొట్రుపడో ఇద్దరు ఢీకొనడంతో కుమార్ కూర్చున్న ప్రదేశానికి దగ్గరగా ఒక పెద్ద క్రిష్టల్ గ్లాసు కిందపడి, తునాతునకలయి గాజుపెంకులు అన్ని దిశలకు చెల్లాచెదురుగా పడ్డాయి. సంభాషణ ఆగి, ఒక్క క్షణం నిశ్శబ్దం రాజ్యం చేసింది.

"కాళ్ళకి జోడు లేనివాళ్ళు ఇటువైపు రావద్దు" అన్నాడు ప్రభాకర్.

తనకి కర్ర కాళ్ళతో వంగి ఏరడం రవ్వంత కష్టంగా ఉన్నా, ఒక స్త్రీ అదే పని చేస్తూ రెండడుగుల దూరంలో కనిపిం



## కొత్తగాలి...

**మిత్రులెవరో తేలాక**
**మిగతావారు?**
**మన తప్పుల్నే చూపే**
**మార్గదర్శులు**

—కేసవరపు మహాలక్ష్మి, ఆలమూరు

చింది. ఒక్కసారి తనలో విద్యుత్ తీవ్రంగా ప్రవహించినట్లనిపించింది. ఆ స్పందనతో చేయి కాస్త వేగంగా కదిలి సూదిమొనంత వాడి ఉన్న ఒక గాజు పెంకు తన చూపుడు వేలికి గుచ్చుకుని రక్తం కారడం మొదలయింది. "అరెరె! మీ చేతికి గాజుపెంకు గుచ్చుకుంది, అలాగే ఉండండి" అంటూ స్పీడ్‌గా లోపలికి వెళ్లి పేపర్ టిష్యూతో తిరిగి వచ్చి, కళ్ళద్దాలని సరిచేసుకుంటూ టిష్యూ పేపర్‌ని చూపుడు వేలుకు చుట్టి, బలంగా నొక్కి ఉంచింది. మహా అయితే ముప్ఫయి సెకన్లు అలా ఉంచిందేమో, ఒక్కసారి ఆమె చేస్తున్న సహాయం చూసి, ఆశ్చర్యంతో తలమునక లౌతూ, ఏమాత్రం కదలిక లేకుండా చిత్త రువల్లే సోఫాలో ఉండిపోయాడతడు.

"కాస్సేపు ఇలాగే నొక్కి ఉంచుకోండి, ఇప్పుడే వస్తాను" అంటూ ముందర గది బాత్రూంలోనికి త్వరత్వరగా వెళ్ళి అంతే తొందరగా బేండెయిడ్‌తో తిరిగివచ్చి దానిని అతని వేలికి అంటించింది. ఇంతలో ప్రభాకర్ భార్య రెండు చీపుళ్ళతో రావడంతో ఆమె, నేలమీది గాజు రజనుని ఒకచోట చేర్చి దానిని చెత్తడబ్బాలో పడ వేస్తూ, "ఎందుకైనా మంచిది మీరు నడిచే టప్పుడు జాగ్రత్త, కాళ్ళకి గాజుపెంకులు గుచ్చుకోకుండా జాగ్రత్తపడండి" అంటూ పిల్లవాడికి చెప్పినట్లు చెబుతూ సోఫాలో తనకి దగ్గరగా సర్దుకుని కూర్చుంది.

"థాంక్స్" అంటూ వస్తున్న నవ్వుని ఆపు కోలేక బిగ్గరగా నవ్వాడతను. ఆశ్చర్యంగా అతనివేపు చూసి, "ఎందుకలా నవ్వుతు న్నారు? " అనడిగిందామె.

"నవ్వినందుకు క్షమించాలి. నా పేరు కుమార్. నాకున్నవి కృత్రిమ కాళ్ళు. అది తెలియక మీరు గాజుపెంకులు గుచ్చుకుం టాయని హెచ్చరిస్తే నవ్వు వచ్చింది. మిమ్మల్ని దాదాపు ఇరవై ఐదేళ్ళక్రితం చూశాను" అన్నాడతను.

"నన్నా... ఇరవై ఐదేళ్ళక్రితం నన్ను చూసి గుర్తు పెట్టుకున్నారా? " అంటూ బొడ్డున నడుము దగ్గర దోపుకున్న రుమాలు తీసి కళ్ళద్దాలని తుడుచుకుని తిరిగి పెట్టుకుంటూ విచిత్రంగా అతడివేపు చూసింది. కాని అతడి మొహంలో ఏమీ విచిత్ర భావం కనపడక, ఇంకే కారణం వలనో, "ఐ హోప్ యు ఆర్ నాట్ ఏ క్రేజీ పెర్సన్ నా పేరు జలజ" అంటూ చేయి చాచింది.

చాచిన జలజ చేతిని అందుకుని, మృదు వుగా ఉన్న ఆమె చేతిని ఐదుసెకన్లు ఆల స్యంగా వదిలిపెట్టాడతను.

"మీరు చెప్పిన ఇక్ష్వాకులనాటి కాలంలో, పెళ్ళి చేసుకుని హైద్రాబాదులో ఉన్నాను. నన్ను మీరు విశాఖపట్నంలో చూశానంటు న్నారు? " అనడిగింది జలజ.

"విశాఖపట్నం మధురానగరంలో ఓ సాయంకాలం మీరు నడిచి వెళ్తుంటే బాల్కనీలో కూర్చున్న నేను మిమ్మల్ని చూశాను. చాలా వైవిధ్యంగా ఉన్న మీరు నాకు చాలా కాలం తాజా జ్ఞాపకంగా మిగి లిపోయి ఉన్నారు. అందుకే మిమ్మల్ని చటుక్కున గుర్తుపట్టాను" అన్నాడతను. ఎప్పుడూ తక్కువగా మాట్లాడే తన నోటి నుంచి అతి తొందరగా వాక్యాలు బైటప డడం అతడికే ఆశ్చర్యం కలిగించింది.

"అవునవును. డైమండ్ పార్క్ దగ్గర

ఉన్న మా అక్కయ్య ఇంటికి అప్పుడప్పుడు వస్తుండేదాన్ని" అంది జలజ. కాస్సేపాగి, "ఇరవై ఐదేళ్ళక్రితం కనిపించిన నాలో ఏ ప్రత్యేకత మిమ్మల్ని మీరు నన్నంతగా జ్ఞాపకం ఉంచుకునేలా చేసింది? " అని అడగాలనిపించినా తను నిగ్రహించుకున్నానని చెప్పింది జలజ.

"ఇరవై ఐదేళ్ళక్రితం కాదుకాని రెండేళ్ళ క్రితం న్యూయార్క్ పోర్ట్ అథారిటీ బస్ టెర్మినల్ దగ్గర మిమ్మల్ని చూశాను" అంది, అతడివేపు పరీక్షగా చూస్తూ.

నోరు వెళ్ళబెట్టాడతను.

"నేను టాక్సీ కోసం అక్కడ క్యూలో నిలుచున్నాను. క్యూ చేంతాడంత ఉంది. క్యూలో నిలబడి ఏదో నవల చదువుతోంది ఒకావిడ. రోడ్డుకి రెండవ వైపు మీరు క్రచెస్‌తో నిలుచున్నారు. ఒక దొంగ, క్యూలో నిలబడి నవల చదువుకుంటున్న స్త్రీ పర్సు లాగుకుని పారిబోతుంటే పట్టుకొమ్మని అరిచింది. ఎవ్వరూ ఏమీ పట్టించుకోలేదు. జనం తక్కువ ఉన్న సైడ్‌లోంచి పరిగెత్తి పారిపోబోతూ మిమ్మల్ని దాటినపుడు మీరు క్రచెస్‌ని వాడి కాళ్ళకి అడ్డంగా ఉంచారు. దాంతో కింద పడ్డ దొంగ చేతిలోంచి పర్సు జారింది. మిమ్మల్ని బూతులు తిడుతూ ఆ పర్స్ వదిలేసి అతను పారిపోయాడు. మీరు పర్స్ ఆమెకి అందిస్తే, ఆమె మీకు కృతజ్ఞతలు చెప్పింది. న్యూయార్క్ లాంటి పెద్ద పట్టణాలలో, ముఖ్యంగా సాయంకాలం, రాత్రుళ్ళు ఒకరి గురించి ఇంకొకరు పట్టించుకోరు. ఇలాంటి దురాగతాలు చేసేవాళ్ళు ఎలాంటి స్థితిలో ఉంటారో చెప్పలేం కదా? ఏమీ ఆలోచించకుండా ఆ స్త్రీ ఇబ్బంది గురించి పట్టించుకున్న మిమ్మల్ని అభినందించాలని క్యూ వదిలి మీ వైపు వస్తుంటే, ఒక టయోటా కారులో మీరు వెళ్ళిపోయారు. ఇంటికి ఒక గంట ఆలస్యంగా చేరాను మీ వల్ల. దానికి కారణం మిమ్మల్ని అభినందించడానికి వచ్చినపుడు క్యూలో నా స్థానం పోయింది" అంది జలజ. ఆశ్చర్యంతో అతడికి నోట మాట పెగలలేదు.

"ఎన్నాళ్ళయింది మీరీ దేశం వచ్చి? మీ భర్త ఏంచేస్తారు? " అనడిగాడు తను తెప్పరిల్లి.

"బ్యాంక్‌లో మేనేజర్‌గా పనిచేసేవారు. ఆయన చనిపోయి మూడు సంవత్సరాలైంది. నేను ఈ దేశం రావడం ఇది రెండోసారి. ప్రభాకర్ నాకు దూరపు బంధువు. మీ సంగతేమిటి? " అడిగింది జలజ.

"ఈ దేశం వచ్చి ఇరవై ఏళ్ళు పైనే అయింది. ఏక్సిడెంట్‌లో కాళ్ళు పోగొట్టుకున్నాక కంపెనీకి కన్సల్టెంట్‌గా పనిచేస్తున్నాను. నేను ఒంటరిని" అన్నాడతడు నిర్లిప్తంగా.

ఒక నిమిషం మౌనంగా ఉన్నాక, "ఈ ప్రపంచంలో చాలామంది ఒంటరులే. ఒకే పంచకింద ఎవరి లోకంలో వాళ్ళు రెండవ వ్యక్తితో కలవకుండా ఉప్పుడు బియ్యం అన్నపు మెతుకుల్లా, జీవితాల్ని వెళ్లదీస్తున్న వాళ్ళంతా ఒంటరులే. అతి తక్కువమంది దాని బారిన పడకుండా, దానికి బానిస అవకుండా జీవితాన్ని మలచుకోగలరు? " అంది జలజ తూచితూచి పదాలను వదులుతూ. అతడేమీ సమధానమీయలేదు వెంటనే.

"నేను ఒకటి రెండు మాటలు చెబుతాను అవి మిమ్మల్ని ఇబ్బంది పెడుతాయేమో" అన్నాడు ఒక్క నిమిషం తరువాత.

"నేనేం తప్పు పట్టనులే చెప్పండి" అంది జలజ.

"మీ కంఠంలో మార్దవం ఆ ఉచ్ఛారణలో ఉన్న తీయదనం నేను ఇంతవరకు

ఎక్కడా చూడలేదు. గంపెడు పూలను నేలమీద ఒంపితే, అవి చేసే శబ్దంలా, మీ నోటి నుంచి అక్షరాలు మెత్తగా మృదుమ

వాళ్ళిద్దరూ మరిచిపోయారు.

"మీ గురించి వివరాలేమీ చెప్పలేదు."

"ఈ దేశంలో అలాంటి ప్రశ్నలు వేయ



ధురంగా వెలువడ్డాయి" అంటూ ఆగాడు అతడు. జలజ కంగారు కప్పిపుచ్చుకోవడానికి చాలా కష్టపడుతోంది. ఒక్కసారి జలజ మొహంలోకి రక్తం తన్నుకు వచ్చింది. క్రమేణా ఎర్రపడుతున్న ఆమె కపోలాన్ని గమనిస్తుంటే, వీడియో కెమేరా ఉంటే బాగుండుననిపించింది అతనికి.

"అమెరికాలో అతిశయోక్తి ఎక్కువగా ఉపయోగిస్తారని నే గమనించాను. కాని ఇంత ఎక్కువ పనికిరాదు.. ఎనీవే థాంక్స్" అంది జలజ రూమాలుతో ఎర్రబారిన మొహం తుడుచుకుంటూ. ఎర్రపడిన జలజ చెక్కిళ్ళు మునుపటి తెలుపు రంగుకి మారబోమని మంకుపట్టు పట్టుకుని కూర్చోవడంతో ఆమెవైపు చూస్తూ ఉండిపోయాడు అతడు. సంభాషణని కొత్త దశలో ఎలా మళ్ళించాలో తెలియక ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

గదిలో ఇతరులు ఉన్నారన్న సంగతే

రని తెలిసినా వేస్తున్నారు" అన్నాడతను. బహుశా ఎక్కువ చనువు తీసుకుంటున్నాడని కాబోలు అతడివైపు మరోసారి పరిశీలనగా చూసింది జలజ.

"మీరు అతి చనువు ప్రశ్నలు వేస్తున్నారు. నాకు ఒక కొడుకు. పేరు సారథి, క్వీన్స్‌లో ఉంటున్నాడు. అతనికి పెళ్ళయింది. మా అమ్మాయి సరోజ ఇండియాలో ఉంటోంది. పెళ్లైంది. గతంలో మావారు పోయిన కొత్తలో ఒకసారి అమెరికా వచ్చి రెండు నెలల మాత్రమే ఉండి వెళ్ళాను. ఇప్పుడు ఎన్నాళ్లు ఉంటానో చెప్పలేను. మా అబ్బాయి ద్వారా నాకు గ్రీన్ కార్డ్ వచ్చే అవకాశాలున్నాయి. ఇంకేమైనా వివరాలు కావాలా? నా వయస్సెంతో చెప్పమంటారా? " అంటూ చిలిపిగా ప్రశ్నించింది జలజ.

"మీకు పెళ్లైన ఇద్దరు ఎదిగిన పిల్లలు ఉన్నారంటే నమ్మలేకుండా ఉన్నాను. మీ మొహంలో వయస్సు కనిపించదు. సారీ, ఎందుకో మీతో త్వరగా పరిచయం పెరు



గుతోంది" అన్నాడతడు.

జలజ నవ్వింది. నవ్వు ఆపుకుందామన్న ప్రయత్నం చేయకుండా కాస్సేపు నవ్వి, కంటిలో తిరిగిన చెమ్మని తుడుచుకుంటూ "మీరు తెగ అతిశయోక్తులు వాడే ఎడ్వర్టైజ్‌మెంట్ కంపెనీకి పనిచేస్తారా? నా గురించి మీకు ఎందుకు ఇంత ఆసక్తి ఇప్పుడేగా మనం కలిశాం" అంది జలజ.

"నేనేదో చెప్పేవాడినే కాని ఇప్పుడు కాదు మరోసారి" అన్నాడతను.

## కొత్తగాలి...

**పూర్ణగర్భిణిలా**
**వెళుతోంది ఆటో**
**ఆస్పత్రికి చేరేదాకా**
**ప్రసవం ఆగుతుందా?**

—అనుముల బదరీనారాయణ, జమ్మలమడుగు

"అంటే మనం మళ్ళీ కలుస్తామా?" జలజ ప్రశ్నించింది.

"మీ మాటలు విన్నాక, మీ పరిచయం అయ్యాక నేను మిమ్మల్ని కలవడానికి ప్రయత్నం చేయనని ఎలా అనుకుంటారు? అది మీకిష్టం లేకపోతే దూరంగా నిలబడిపోతాను. మిమ్మల్ని బాధ పెట్టను" అన్నాడతను. ఆ మాటలు నూటికి నూరుపాళ్ళు గుండెలోంచి బైటపడినవే.

చిన్న మొక్కలా మొదలయిన జలజతో పరిచయం, మారాకులు వేస్తూ ఫెన్స్ చుట్టూ అల్లుకుంటూ పాకిన విరజాజి మొక్కలా చిలువలు పలవలు వేసింది. ఉదయం, సాయంకాలం కలిసి కబుర్లు చెప్పుకోవడం సామాన్యమైంది. హాస్పిటల్‌లో వాలంటీర్ పని, మ్యూజిక్ పాఠాలు చెప్పి జలజ పగలంతా వెళ్ళదీస్తే ఆఫీసు పనితో తనరోజు గడిచేది. జలజ ఎప్పుడు వస్తుందా? అని ఎదురు చూసేవాడు ప్రతిరోజూ. జలజ రాని సాయంకాలం తెగ చికాకు అనిపిస్తోంది ఇప్పుడు. ఒంటరితనం చాలా కాలం తనని అంటిపెట్టుకొని కాపురం చేసినా జలజతో సాన్నిహిత్యం పెరిగాక, ఎప్పుడైనా ఒంటరితనం తొంగిచూడబోతే భరించలేకుండా ఉన్నాడు. జలజ చెప్పే కబుర్లు వినడం మితభాషి అయిన తనకి చాలా ఆనందం కలిగిస్తోంది. ఆ కళ్ళ కదలిక, విచ్చీ విచ్చకుండా విచ్చుకున్న అందమైన పెదవుల లోంచి బైటపడే జలజ వాక్యాలు, నవ్వుతూ గాజులు శబ్దం చేసేలా చేతులు తిప్పడం తనలో ఒంటరితనాన్ని, నీరసాన్ని దాగి ఉన్న చేదు గతాన్ని చాలా మట్టుకు తుడిచిపెట్టింది. రెండేళ్ళలో ఇద్దరూ కలిసి చాలా ప్రదేశాలు చూశారు, ఆనందించారు. కృత్రిమ కాళ్ళతో తన నెమ్మది నడకకి జలజ ఎప్పుడు విసుగు ప్రదర్శించలేదు. ప్రత్యేక ప్రదేశానికి వెళ్లి ప్రకృతిని డ్యాం బద్దలయి పరిగెత్తుకు వచ్చే నీటి ప్రవాహం లాంటి జలజ ఉత్సాహం చూసి తను సంబరపడుతుంటే కుమార్ "నీతో పరిచయం పెరగకపోతే ఇవన్నీ చూసే అవకాశం వచ్చేది కాదేమో" అంది జలజ ఒకసారి.

"నేను కాకపోతే ఇంకెవరో తీసువెళ్ళేవారు నిన్ను" అన్నాడతను కవ్విస్తూ

"అంతకన్నా పొగడడం నాకు రాదు. ఇతరులని పొగడడం నాకు ఇష్టం ఉండదు బాబూ?" అంటూ గోముగా అంది. అలా గతాన్ని నెమరువేసుకుంటుంటే టెలిఫోన్ మోగింది. ఆలోచనల్ని కట్టేసి ఫోన్ ఎత్తాడు కుమార్.

"సారీ, సాయంకాలం నే వచ్చేసరికి ఆరున్నర ఏడుగంటలవుతుంది" అంటూ శ్రావ్యమైన జలజ కంఠం వినిపించింది. "ఓకే" అంటూ ఫోన్ పెట్టేశాడు కుమార్. కానీ రిసీవర్ కింద ఉంచిన రెండు నిమిషాల తరువాత కుమార్‌లో నిస్పృహ మొదలయింది. సామాన్యంగా సాయంకాలం నాలుగున్నర గంటలకి వచ్చే జలజ ఏడు గంటలకి వస్తానంటే కనీసం రెండు గంటలు ఆలస్యంగా వస్తుంది అనుకుంటూ కిటికీలోంచి బైటికి చూశాడు కుమార్. ఆలోచనలు తిరిగి ఊపందుకున్నాయి. జలజ రెండు గంటల ఆలస్యంగా రాబోతోంది. ఆ రెండు గంటలు ఏం

చేయడం? టెలివిజన్ చూడవచ్చు కానీ ఏమిటో జలజ లేకుండా టెలివిజన్ చూడడం బోరు బాబూ? జలజ పక్కన ఉంటే ప్రోగ్రాం మీద ఏదో వ్యాఖ్యలు చేస్తూ ఉంటుంది. ప్రతీ అంశం మీద ఏదో ఒక అభిప్రాయం వ్యక్తపరచకుండా మౌనంగా ఊరుకోదు. తను ఏమీ మాటలాడకుండా ప్రోగ్రాం చూస్తానని గేలి చేస్తుంది జలజ! రెండు గంటల ఆలస్యంగా వస్తానని ఫోన్ చేస్తే తను ఇంత గాభరాపడిపోతున్నాడే, అవసరం పడి జలజ ఊరు వెళ్తే తను ఏమౌతాడు? ఆ ప్రశ్న మనసులో మెదలవగానే కుమార్‌కి తలనొప్పి మొదలయింది. అరగంట గడిచేటప్పటికి అది తీవ్రమవుతుంటే మెడిసిన్ కేబినెట్ తెరచి మాత్ర వేసుకోబోయాడు.

"ప్రతిదానికీ మాత్రల వాడకం మంచిది కాదు, తగ్గించు" అన్న జలజ మాటలు జ్ఞాపకం వచ్చి కేబినెట్ తలుపు మూసి, అదురుతున్న కణతలని తడుముకుంటూ తిరిగి వచ్చి హాలులోని సోఫాలో చతికిలపడ్డాడు కుమార్.

తలనొప్పి ఇప్పటిలో తగ్గేలా లేదు. ఈ తలనొప్పితో సాయంకాలం ఆరున్నర గంటలవరకు తల పగిలిపోకుండా ఉంటుందా? లాభంలేదు ఏదో ఉపశమనమార్గం వెతకాలి అంటూ మళ్ళీ మెడిసిన్ కేబినెట్ తలుపు తెరిచి చూస్తే ఎదురుగా అమృతాంజనం కనిపించింది. దానిని అందుకున్నాడు కుమార్.

ఒక గంట గడిచింది. తలనొప్పి తీవ్రతలో తగ్గుదల ఏమీ కనిపించలేదు సరికదా. దట్టంగా కణతలకి, నుదురుని పట్టించి అమృతాంజనం ప్రభావం వల్ల కళ్లలోంచి, ముక్కులోంచి నీరు కారడం మొదలయింది. "ఏడు గంటలవరకు ఈ బాధను భరించలేను" అనుకుంటూ ఏడ్రిల్ మాత్ర వేసుకుని సోఫాలో కళ్లు

మూసుకున్నాడు కుమార్.

సాయంకాలం దాదాపు ఆరున్నర గంటలయింది. పగలంతా తిరిగి తిరిగి అరిగిపోయేనన్నట్లుగా గడియారపు ముళ్లు బద్ధకంగా కదులుతున్నట్లనిపించింది. జలజ కోసం ఎదురుచూస్తున్న కుమార్‌కి, మ్యూజిక్ క్లాస్ ముగిసి అరగంటపైగా అయి ఉంటుంది. అయినా జలజ రాలేదు. ఆమెకు ఏమీ అవలేదు కదా? వద్దన్నా కిక్కిరిసి ఉన్న సబ్‌వే ఇ-ట్రెయిన్ ఎక్కుతుంది. వెధవ ఖంగాళీ జనం దానినిండా అనుకుంటూ పరిపరివిధాల ఆలోచిస్తూ, నిమిషానికోసారి చేతి వాచీవేపు చూస్తూ గడియారం ఏడు గంటల నలభై నిమిషాలు చూపించేసరికి టెన్షన్ తగ్గడానికి టెలివిజన్ ఆన్ చేశాడు కుమార్.

2



సాయంకాలం ఆరున్నర గంటలకి గడియారపు ముళ్లు చేరబోతున్నాయి. మ్యూజిక్ క్లాస్ ముగిసి అరగంటయినా పిల్లల్ని వదిలించుకోలేక చిరాకుగా ఉంది జలజకి. ఆరు గంటలకి బైటపడి సబ్‌వే రైలు ఎక్కితే దాదాపు ఆరు గంటల ముప్ఫయి నిమిషాలకు కుమార్ ఫ్లాట్‌కి చేరే అవకాశం ఉండేది. కాని ఇప్పుడు వెంటనే బైటపడినా కుమార్ ఫ్లాట్‌కి చేరేసరికి ఏడుగంటలు దాటుతుంది అనుకుంటూ మ్యూజిక్ క్లాస్ పిల్లలతో సంభాషణ తుంచ ప్రయత్నిస్తోంది జలజ. నిమిషాలు గడుస్తుంటే అసహనం క్రమేణా రాజుకుంటున్నా దానిని అదుపులో ఉంచడానికి ప్రయత్నిస్తోంది. పదిహేను నిమిషాలు గడిచాకగాని బయటపడలేకపోయింది. "సారీ, అనుకున్నదానికన్నా ఆలస్యమైంది" అంటూ ఏడుగంటల నలభై ఐదు నిమిషాలు చూపిస్తున్న గడియారం వేపు చూసింది. అంతవరకూ ఏ మూడ్‌లో ఉన్నాడో ఏమోకాని జలజ మొహం కనిపించగానే కుమార్ మొహం విప్పారడం చూసి జలజ మనస్సు తేలికపడింది.

"ఆలస్యం అవుతుంటే ఏవేవో ఆలోచనలు వచ్చేస్తాయి తెలుసునా? న్యూయార్క్ పట్టణం, చీకటిపడిన సాయంకాల సమయం మెదడుని విపరీతంగా ఆలోచింపజేస్తాయి" అంటూ కుమార్ కళ్లు మూసుకున్నాడు.

"ఐయామ్ సారీ, ఫోన్ చేయ ప్రయత్నించినా వీలవలేదు" అంటూ జలజ కుమార్ దగ్గరగా వచ్చింది.

"ఫ్రిజ్‌లోంచి పదార్థాలు బైటికి తీసి వేడి చేసి ఉంచాను. అవి చల్లారిపోయి ఉంటాయి. మళ్లీ వేడి చేస్తాను క్షణంలో" అంటూ కుర్చీలోంచి లేవబోతున్న కుమార్‌ని వారించింది జలజ.

"ఏం చల్లపడలేదులే" అనుకుంటూ తిండి తింటూ కబుర్లలో పడ్డారు కుమార్, జలజలు. రాత్రి తొమ్మిదవుతుండగా జలజ లేచి నిలబడి, "ఆలస్యమౌతుంది, నేవెళ్తాను" అంది తలుపువేపు కదులుతూ. రవ్వంత దిగులు మొహంతో ఉన్న కుమార్‌ని స్పృశించి, "రేపు ఉదయం కలుస్తాంగా" అంటూ ప్రయాణమైంది జలజ.

★ ★ ★

హాలులో స్లీపింగ్ బ్యాగ్ వేసుకుని నిద్రపోదామని ప్రయత్నిస్తున్న జలజకి యథా

ప్రకారం నిద్ర రావడంలేదు. ఉన్న ఒకే ఒక బెడ్రూం కొడుకు సారథి, కోడలు గిరిజ వాడుకుంటారు. అనుకున్న సమయానికంటే ముందరే వచ్చిన రాజధాని ఎక్స్‌ప్రెస్ రైలులా చలికాలం తొందరగా వచ్చిందనడానికి నిదర్శనంగా బైట చలిగాలులు బలంగా వీస్తున్నాయి. ఇరవై ఆరో అంతస్తులో ఉన్న సారథి ఫ్లాట్‌లోనికి చల్లగాలి జొరపడలేక గాజు కిటికీల మీద ఒత్తిడి చూపిస్తోంది. గది లోపల, గది వేడిచేసే కన్నాలలోంచి వస్తున్న వేడిగాలి గదిని అరవై మూడు డిగ్రీల (ఫారన్‌హీట్)లో ఉంచుతోంది. గదిని వెచ్చగా ఉండడానికయ్యే ఖర్చు తగ్గించడానికి గదిలో ఉష్ణోగ్రతని కేవలం అరవై మూడు డిగ్రీల ఫారెన్‌హీట్‌లో ఉంచి, చలివేయకుండా ఉండాలని ఇంటిలో బాగా దళసరి దుస్తులు, జీన్స్ వేసుకుంటుంది గిరిజ. సారథి చలికి బాగా అలవాటుపడడంతో అరవై మూడు డిగ్రీల వాతావరణం అతనికి ఇబ్బందిగా అనిపించదు. ఇండియా లెక్కల ప్రకారం అది పదిహేడు సెంటీగ్రేడ్ డిగ్రీలు. అంత చల్లదనానికి అలవాటులేని తనకి మొదట్లో మరీ కష్టంగా అనిపించేది. ఉన్ని దుస్తులు, బాగా దళసరి దుస్తులు ధరించి నిద్రపోవడం అంటే తెగ చిరాకు తనకి. ఒకసారి ఫ్లాట్‌లో ఉష్ణోగ్రత గురించి చర్చకి వచ్చినప్పుడు, కోడలు వ్యక్తపరిచిన దృఢమైన ఉద్దేశం విన్నాక తను ఇంకేమీ మాట్లాడలేదు. ప్రతిరోజు పనికి వెళ్ళే కొడుకు, కోడలుకి వారంలో ఉరుకులు పరుగులతో ఏమీ తీరుబడి ఉండదు. వారాంతంలో ఆలస్యంగా లేవడం, బట్టలు ఉతుక్కోవడం, ఇల్లు శుభ్రం చేసుకోవడం, మార్కెట్ వెళ్లి ఇంటికి కావలసిన సరుకులు తెచ్చుకోవడంతో ఒకరోజు అంతా గడిచిపోతుంది. ఇంకోరోజు ఎవరింటికో భోజనానికి లేక ఇతర ఫంక్షన్‌కో వెళ్లడమో లేక ఎవరినైనా

## సాహిత్యమంటే మక్కువ ఎక్కువ



**అక్కినపల్లి సుబ్బారావు**

అక్షరాలతో సాన్నిహిత్యం, సాహిత్యం పట్ల మమకారం, మంచి రచనలు చేయాలనే తపన వెరసి ఈరోజు రచయితగా పాఠకుల ముందు నిలిచాను. 'మరో వసంతం' నేనెంతగానో అభిమానించే 'చతుర' మాసపత్రికలో ప్రచురితమవుతున్న నా అయిదో నవల. అంతకుముందు 'నీళ్లలో చంద్రుడు', 'పగటి పూట చంద్రుడు', 'శీతాకాలం సూర్యుడు', 'అంచుకి అంచుకీ మధ్య...' అనే నవలలు 'చతుర'లోనే ప్రచురితమయ్యాయి. విశ్వకథా వేదిక 'విపుల'లో కూడా నే రాసిన అనేక కథలు ప్రచురణకు నోచుకోవడం నిజంగా నాకు ఆనందం కలిగించే విషయం. 'ఆంధ్రభూమి', 'ఆంధ్రప్రభ', 'రచన' తదితర పత్రికల్లో సుమారు యాభైదాకా నా రచనలు వెలువడ్డాయి. వృత్తిరీత్యా ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్‌లో ప్రొఫెసర్‌గా 19 ఏళ్లు పనిచేసి ఎమెరిటస్ ప్రొఫెసర్‌గా పదవీ విరమణ చేశాను.

**నా చిరునామా :**
డాక్టర్ అక్కినపల్లి సుబ్బారావు
ఫ్లాట్ నంబర్: 412, సాయిటవర్స్, రెడ్నమ్ గార్డెన్స్, జైల్‌రోడ్, విశాఖ పట్టణం-530002
ఫోన్: 0891-2745342
ఈమెయిల్: akkinapalli@yahoo.com

ఇంటికి ఆహ్వానించడమో లాంటి సాంఘిక ఆచారాలని, ఆనవాయితీలని నిర్వర్తించడా నికి ఉపయోగపడుతుంది. లేకపోతే అను కోని ఇంటిపని తగిలి ఒకరోజు గడిచిపో తుంది. రెండు వారాల క్రితం జరిగిన సంఘటన చటుక్కున జ్ఞాపకానికి వచ్చింది. సామాన్లు పెట్టుకోవడానికి ఒక షెల్ఫ్ కావాలంటే గిరిజ, స్టోర్‌నుంచి సామాన్లు తెచ్చి సారథి బిగిస్తుంటే దగ్గ రగా కూర్చుని పనిముట్లని అందిస్తోంది తను. ఒకసారి 'నట్' ఇవ్వు అన్నాడు. తను చేతికి అందిన చతురస్రాకారం ఉన్న కాడలాంటి దానిని అందించింది. "మమ్మీ, గుండ్రటి చిల్లులో ఈ చతురస్రాకారం ఎలా వెళ్తుందమ్మా?" అన్నాడు సారథి. తప్పిదం గ్రహించి సరి అయిన 'నట్'ని అందించింది.

వాళ్ళ జీవితాలు- తన జీవితం, గుండ్రటి చిల్లు- చతురస్రాకారం నట్ లాంటివి. సరిగ్గా ఇమడవు. అవి సరి అయిన జోడీ కాదు.

ఏభై ఐదేళ్ళ తన శరీరంలో ఇంకా శక్తి ఉంది, ఏదో ఒకటి చేద్దామన్న కోరిక ఉంది. మంచి అందమైన జీవితాన్ని ఇంకా కొన్నాళ్లు గడుపుదామన్న తపన ఉంది. కొడుకు, కోడలు జీవితాల్లో తన ఉనికికి ప్రాముఖ్యం లేదని కాదు. కానీ తను లేక పోయినా వాళ్ల జీవితాలు తల్లకిందుల వవు. కానీ కూతురు సరోజలో చురుకు తనం తక్కువ, ముభావి. మెదడులో ఎలాంటి ఆలోచనలు పరిగెడుతున్నాయో, ఏమేమి ఊహలున్నాయో కాని బైటికి మా త్రం వ్యక్తపరచదు. బలవంతంగా ఆమెను చాలాసార్లు బైటికి లాగ ప్రయత్నిస్తే, బిగ దీసుకుపోయి తను చెప్పినది చేయలేదు. చిన్నప్పటినుంచీ స్నేహితులు తక్కువవ డంతో, పెరిగి పెద్దదైనా ఇతరులతో కలవ డానికి వెనుకంజ వేస్తుంది. ఆమె వయస్సు పిల్లలందరూ ఉద్యోగాలు చేయ డమో లేక గృహిణులుగా మారడమో చూసినపుడు సరోజలో రవ్వంత ఆత్మ స్థైర్యం ఉంటే బావుండుననిపించేది. అస లు ఆ కారణంగానే మేనరికం చేశారు. ఆమె స్వభావం బాగా తెలిసిన వ్యక్తి పెళ్లి చేసుకుంటే ఆమె నెమ్మదిగా వ్యవహరించే స్వభావాన్ని అర్థం చేసుకుంటాడన్న నమ్మ కంతో, శాస్త్రీయంగా మేనరికాలు చేయ డంలో ఇబ్బందులు ఉన్నాయన్నా తను ఒప్పుకుంది. పెళ్లయినా సరోజలో అట్టే మార్పు కనిపించలేదు. వెనకపడి తోస్తుంటేకాని ఏ పనీ చేయడానికి ఉత్సాహం చూపించని సరోజకి తన అవ సరం ఉంది. కాని ఎన్నాళ్ళు ఆమెకి తను సాయం చేయగలదు? తను వెళ్ళేక ఏమౌ తుంది? నీటిలో నిలబడి ఈత నేర్చుకోద లచిన వ్యక్తి చేయి వదలనంతకాలం ఈత రాదంటారు. సరోజ అలాంటి కోవకి చెందుతుందా? తన ఒంటరి జీవిత ప్రమాణానికి ఒక ఆలంబన అది ఎంత చిన్నదైనా సరే కావాలి. ఏదీ ఆ ఆలం బన? సరోజ ఒక ఆలంబనా? ఈమధ్య కుమార్‌తో పరిచయం పెరగడంతో రోజులు కొంతమట్టుకి ఆనందంగానే వెళ్తు న్నాయి. కాని తను ఇక్కడ శాశ్వతంగా ఉండిపోలేదు. ఆ కోణంలోంచి చూస్తే ఈ కొత్త పరిచయం, స్నేహం ఏమీ మంచి చేయవు. కాని దానిలో ఆనందం అనుభ విస్తోందే! మరి ఎలా? దీని గురించి ఆలో చించాలి అని గింజుకుని నిద్రరాక అటూ ఇటూ పరుపుమీద దొర్లింది జలజ.

★ ★ ★

శుక్రవారం అందుకున్న చెక్‌ని బేంక్‌లో జమచేసి బైటకి వచ్చింది జలజ. జాగ్ర త్తగా పొదుపుచేసి, అనవసర ఖర్చులేవీ పెట్టకుండా ఉండడంవల్ల రెండేళ్లలో మూడువేల డాలర్లు నిలవచేయకలిగింది.

తను, సారధిని అడగకుండా ఇండియా వెళ్ళడానికి తన దగ్గర ఇప్పుడు డబ్బుంది. సరోజని చూడాలి, ఎలా ఉందో సరోజ? అనుకుంటూ సబ్‌వే ప్రయాణంచేసి కుమార్ ఫ్లాట్ తలుపు తీసుకుని లోపలికి వచ్చింది జలజ. ఫ్లాట్ ఖాళీగా ఉంది, కుమార్ జాడలేదు. ఈ టైమ్‌లో కుమార్ ఎక్కడికి వెళ్ళేడబ్బా? అనుకుంటూ జలజ సోఫాలో చతికిలపడింది. ఫ్లాట్ చాలా నీట్‌గా ఉంది. ఎక్కడ వస్తువులు అక్కడ ఒక క్రమంలో అమర్చి ఉంచుతాడు కుమార్ అనుకుంటూ, "ఆ! అతను ఒక్కడే కదా, ఎక్కడ పెట్టిన వస్తువులు అక్కడే ఉండడంలో ఆశ్చర్యం ఏముంది?" అని కొట్టిపారేయబోయింది. ఫ్లాట్‌లో దుమ్ము లేకుండా ఉండడం, నీట్‌గా ఉన్న సింక్, బాత్రూం చూశాక 'ఫ్లాట్ తీర్చిదిద్దుకోవడం దానిలో ఉన్న వ్యక్తుల అభిరుచిబట్టి కాని, ఎంతమంది ఉన్నారనడాన్ని బట్టి కాదని గ్రహించింది. 'ఇతరులను గాని, ఇతరుల నైపుణ్యాన్నిగాని మెచ్చుకోవడం అంటే తనకి ఇష్టం ఉండదు' అని నవ్వుకుంటూ బాత్రూంవేపు వెళ్ళబోతూ గోడమీదున్న రవివర్మ పెయింటింగ్ చూసి ఆగింది జలజ. ప్రియుని కోసం నిరీక్షిస్తున్న ఒక స్త్రీ మొహంమీద నీళ్ళనుంచి విస్తరించిన చంద్రకాంతి పడడం అత్యంత అందంగా ఊహించి చిత్రించి జీవం పోయగలిగిన రవివర్మ కళాత్మక సామర్థ్యం చూసి ఆశ్చర్యంతో పాటు రవ్వంత అసూయ కలిగింది. అంత అందమైన స్త్రీ మొహం కేవలం రవివర్మ ఊహ లోనిదేనా? ఇండియానుంచి బయలుదేరి రాబోయేముందు, వీలయితే రవివర్మ పెయింటింగ్ కాపీ ఒకటి ప్రభాకర్ తీసుకురమ్మంటే, తనకి నచ్చిన పెయింటింగ్ రెండు కాపీలుతెచ్చి ఒకటి ప్రభాకర్‌కి ఇచ్చింది. అది జరిగిన రెండు నెలలకి, తను మొట్టమొదటిసారి కుమార్ ఫ్లాట్‌కి వచ్చినపుడు, ఫ్రేమ్ కట్టించి బాగా వెలుతురుపడే ప్రదేశంలో తళతళా మెరిసిపోతున్న ఆ రవివర్మ పెయింటింగ్‌ని తదేకంగా చూస్తుంటే, 'అద్భుతం కదూ?' అనడిగేడు కుమార్. తల ఊపింది తను.

"అలా చంద్రకాంతిలో స్నానం చేస్తూ, నా గురించే కేవలం నా గురించే ఒకరోజయినా నిరీక్షించే స్త్రీ నా జీవితంలో ఎప్పుడైనా తటస్థ పడుతుందా?" అంటూ గొణిగేడు కుమార్.

కాస్సేపాగి, "నా మనస్సులో ఉన్న గాఢమైన కోరికకి ప్రతీక అయిన ఈ చిత్రపటం అంటే నాకు చాలా ఇష్టం" అంటూ చిత్రపటం వేపే చూస్తూ ఉండిపోయాడు కుమార్. తనేమీ జవాబీయకుండా కుమార్‌ని పరిశీలించసాగింది. కుమార్‌తో పరిచయం, ఇద్దరిమధ్యా సాన్నిహిత్యం అతిత్వరగా పెరిగేయి. అయినప్పటికీ అంతర్భావాలను బైటకి వ్యక్తపరిచి వాటిని తనతో పంచుకుంటున్న కుమార్ తనని తరచూ ఆశ్చర్యపరుస్తున్నాడు. చాలా విషయాలలో ఇద్దరి ఆలోచనా సరళి ఒకేలా ఉండడంతో ఇద్దరి మధ్యా సాన్నిహిత్యం పెరిగిందా? లేక సాన్నిహిత్యం పెరగడంతో ఇద్దరి ఆలోచనా సరళి ఒకేలా మలచపడుతోందా? అన్నది తెలియలేదు తనకి. కాని కుమార్‌తో గడిపిన కాలం ఆహ్లాదంగా గడిచిపోతోంది. ఈ మూడేళ్ళలో ఏరోజూ అతని సాహచర్యంలో ఆనందరహితంగా గడవలేదు.

నలభైఏడు-నలభై ఎనిమిదేళ్ళ వయస్సు గల కుమార్‌లో ప్రత్యేకత ఏమిటి? ఆజానుబాహుడు కాదు, అందగాడు కాదు. నలుగురిని మాటలతో ఆకట్టుకునే చాతుర్యం లేదు. దానితోపాటు అంగవైకల్యం ఉంది. ఒకసారి చూసిన అతనిని మరోసారి చూడాలి అనిపించే ఏ

గుణమూ అతనిలో లేదు. అతనితో ఎందుకు కాలం హాయిగా గడిచిపో తోంది? అంగవైకల్యం ఉన్నా డీలాపడిపో కుండా జీవితాన్ని నెట్టుకువస్తున్న అతని ధైర్యం తనకి నచ్చిందా? అతను ఇతరుల గురించి ఆలోచించే వ్యక్తి అవడంవలనో, తను అన్నా, తన వ్యక్తిత్వం అన్నా గౌరవం చూపించడం వలనో కావచ్చా?

"ఏభైఏళ్ళు దాటిన మీరు ఇంకా చిన్నవా రిలా కనబడతారు" అంటూ పొగిడి తనలో మరుగుపడిపోయిన ఆత్మవిశ్వా సాన్ని పాదుకొల్పడం వలనో? ఏమో! కుమార్‌తో కాలం గడపాలని తన మనస్సు బాగా వాంఛిస్తోంది. అతనితో పరిచయం పెరిగాక అతని పరోక్ష ప్రోత్సాహం వలనో ఏమో కాని తనలో ఉత్సాహం తిరిగి పెల్లు బికింది. అతను ప్రతిపాదించి ఇచ్చిన సల హాతో మ్యూజిక్ పాఠాలు చెప్పనారంభిం చింది. ఆర్థికంగా కొంత స్వతంత్రురాలు అయింది తను. జీవితంలో ఏదో ఒక పని చేస్తూ కొంత ఆర్జన చేయాలన్న తన చిర కాల కోరిక సఫలమైంది. తృప్తి కలిగింది. దానికి కారణం కుమార్. తద్వారా అతనికి ఒకవిధంగా తను రుణపడి ఉంది. తనవ ద్దనున్న మూడువేల డాలర్లతో ఇండియా వెళ్ళి సరోజను చూసి రావచ్చు. సారథి మీద విమాన ప్రయాణపు ఖర్చు రుద్దనవ సరం లేదు, అనుకుంటూ బాత్రూంలోకి నడిచింది జలజ.

మొహం కడుగుకుని బాత్రూం తలుపు తెరిచేసరికి, ఒకసారి "భౌ" అనే అరుపు వినగానే, పరాకుగా ఆలోచనల్లో మునిగి ఉన్న జలజ కెవ్వున కేక వేసింది. కుమార్ జలజ నోటిని తన చేతితో మూసి ఆ కేక ను ఆపాడు నవ్వుతూ.

"ఏమిటా భయపెట్టడం? " అంటూ ఉద్వేగంతో ఎగిరే గుండెలని సముదాయిం చుకో ప్రయత్నించింది జలజ.

"ఐయామ్ సారీ, అలా భయపెట్టకుండా ఉండాల్సింది" అంటూ జలజ వేపు పరీ క్షగా చూసేడు. ఎగసిపడుతున్న ఆమె ఉపరిభాగం, భయంతో పెద్దవైన కళ్ళని చూసి ఆనందపడినా జలజలో కల్గిన కంపనం కుమార్‌ని ఆందోళనకు గురి చేసింది.

"దూరం ఆలోచించకుండా అనవసరంగా భయపెట్టేను. నీకేమైనా అయితే? " అన్నాడు కుమార్.

"అయితే? "

"మనం కలవం" అన్నాడు కుమార్.

"ఎందుకు కలవడం? " అనడిగింది జలజ నవ్వుతూ. ఒక్కసారి కుమార్ బిగు సుకుపోయాడు. అతని వాలకం చూసి తను అనకూడనిదే అందని గ్రహించి "సారీ" అంది వెంటనే.

"తెలియక ఆ మాట అన్నావు, రిమోట్ కంట్రోల్ నొక్కితే ఎలక్ట్రానిక్ పరికరం పని చేయడం మొదలు పెట్టినట్లు, ఆ వాక్యం నాలో పుండుని కెలుకుతుంది ఎప్పుడూ" అన్నాడు కుమార్.

"ఏమయిందో చెప్పు" అంది జలజ. కుమార్ ఏమీ మాటలాడకపోవడంచూసి, "అయితే నే వెళ్తాను" అని లేవబోతుంటే, "కూర్చో తొందరపడకు, చెబుతాను" అన్నాడు కుమార్. ఒకనిమిషం పోయాక మొదలుపెట్టాడు.

"అవి నేను ఇంజనీరింగ్ పాసయిన తరువాత పూణేలోని టాటా కంపెనీలో పనిచేస్తున్న రోజులు. జీవితం గురించి అప్పటికి ఇంకా ఏ నిశ్చితమైన అభి ప్రాయం ఏర్పడని రోజులవి. అంతవరకు ఇంట్లోనే ఉండి చదువు ముగించిన నేను బైట ప్రపంచంలోకి కొత్తగా అడుగుపె ట్టాను. పూణే కొత్త ఊరు నాకు. మరాఠీ కొత్త భాష. నాకు వచ్చిన నామమాత్రం హిందీతో తప్పులు మాట్లాడుతూ, తడ

బడుతూ అదో రకమైన ఉత్తేజంతో సాగిపోతున్న రోజులవి. నాది ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ డిగ్రీ. అప్పట్లో ఇంకా కంప్యూటర్లు ఇండియాలో పాపులర్ అవలేదు. విదేశాలలో దాని ప్రాముఖ్యత పెరగడం పసిగట్టి ఇండియాలో కంప్యూటర్ ప్రోగ్రామింగ్ మీద ప్రత్యేకమైన కోర్సులు నడిపేవారు. కొన్ని కోర్సులు ఒకేఒక వారం నడిస్తే, మరికొన్ని ఆరు వారాలు నడిపేవారు. ఆరు వారాల క్లాస్ తీసుకోవాలంటే ముందస్తుగా ఈ ఒక వారం కోర్సు తీసుకోమనేవారు. దానిలో చేరాలంటే అదొక అర్హతగా ప్రకటించేవారు. ఒక వారం కోర్సు, ఆరు వారాల కోర్సు పూర్తి చేశాను నేను. అమెరికా నుంచి ఒక ప్రొఫెసర్ వచ్చి ఒక కొత్త కోర్సు మొదలుపెడితే కంపెనీ డబ్బు పెట్టి దానిలో చేరమని ఆదేశిస్తే చేరాను. ఆ కోర్సులో చేరడానికి కంప్యూటర్ ప్రోగ్రామింగ్ అతి ముఖ్యం కాకపోయినా, ప్రోగ్రామింగ్ గురించి కొంత పరిజ్ఞానం అవసరం అని ప్రొఫెసర్ ప్రకటించాడు. ముప్పయిమంది ఉన్న ఆ కోర్సులో ఇరవై మంది మగపిల్లలు, పదిమంది ఆడపిల్లలు ఉన్నారు.

అక్కడే లీనా నాకు పరిచయమైంది. ఉదయం ప్రొఫెసర్ రెండున్నర- మూడు గంటలు పాఠం చెప్పి, మధ్యాహ్నం దాని మీద ఆధారపడే లెక్కలు చేయించేవాడు. దానిని బాగా అర్థం చేసుకోవడానికి కంప్యూటర్ ప్రోగ్రాం రాసి దానిని టెస్ట్ చేయమనేవాడు. ఈ కంప్యూటర్ ప్రోగ్రాం రాయడం, టెస్ట్ చేయడం ముఖ్యం కాకపోయినా ప్రొఫెసర్ కళ్లలో పడడానికి అందరూ కంప్యూటర్ ప్రోగ్రాంలు రాయ

ప్రయత్నించేవారు.

మొట్టమొదటిరోజే నా పక్కసీట్లో కూర్చుని ఉన్న లీనా ప్రొఫెసర్ ఇచ్చిన ట్యుటోరియల్‌తో కుస్తీ పట్టడం గమనించాను. ఆమెవేపు పరిశీలనగా చూడకపోయినా, తల అటూ ఇటూ తిప్పుతున్నప్పుడు ఆమె ఇబ్బందిగా ఆలోచిస్తోందని సులభంగా గ్రహించాను. సాయంకాలం నాలుగున్నర గంటలకు బైటికి వెళ్లబోతుంటే "ట్యూటోరియల్ చాలా కష్టంగా ఉంది కదూ?" అనడిగింది లీనా. అప్పటికి ఇంక పేర్ల పరిచయం అవలేదు, కాని అమెరికన్ ప్రొఫెసర్ ఇండియన్ల పేర్లు నోటిలో తిరగక, జ్ఞాపకం ఉండవని మా పేర్లు రాసి ఉంచిన కర్రచెక్కలవి మా సీట్ల మీద ఉంచారు. అందరమూ ఐడెంటిఫికేషన్ కార్డ్సు ధరించేవాళ్లం.

"నాకు అలా అనిపించలేదు. నిజానికి ఇదంతా నాకు ఇదివరలో తెలిసినదే" అన్నాను.

"వెల్!" అంటూ అందరితోపాటూ ఆమె బైటికి నడిచింది. విద్యార్థులు వాళ్ల పేర్ల వరుస బట్టే కూర్చోవాలని నిర్దేశించడంతో నా స్థానం పక్కనే లీనా స్థానం ఉండడంతో ఆమె చేష్టలన్నీ నాకు స్పష్టంగా కనిపిస్తున్నాయి. రెండవరోజు లంచ్ తరువాత 'మధ్యాహ్నం ట్యుటోరియల్ చేస్తూ లీనాని గమనించసాగాను. ప్రోబ్లెమ్‌కి మూలం కనుక్కోలేక సతమతమవుతోంది. మధ్యాహ్నం మూడు గంటల ముప్పయి నిమిషాలయింది. నాలుగున్నరకి క్లాసు ముగుస్తుంది. క్లాసు అయిపోయేలోగా చేసిన దానిని యధాతథంగా ప్రొఫెసర్‌కు అందచేయాలి.

"ఈ లెక్క చేయడానికి నాకు మీరు సహాయం చేయగలరా? నాకేమీ కొరుకుడు పడడం లేదు" అంటూ తలదించుకుని రాసుకుంటున్న నా దగ్గరగా నిలుచుంది లీనా.

"ష్యూర్" అంటూ నిలబడి ఆమె పుస్తకంలోకి చూశాను.

లెక్క పూర్తి చేయడానికి ఆమడదూరంలో ఉంది. అది చూడగానే ఆమె స్టాండర్డ్ నాకు అర్థమైంది. లెక్క ఎలా చేయాలో వివరించి, ఆమె చేస్తుంటే సలహాలిచ్చాను. దాదాపు నాలుగున్నరకు ఇద్దరమూ ప్రొఫెసర్‌కి పేపర్లు అందించి బైటకి నడిచాము.

"థ్యాంక్స్ ఫర్ ది హెల్ప్. యు ఆర్ వెరీ స్మార్ట్" అంది లీనా నా పక్కనే నడుస్తూ.

"అదేమీ కాదు. నేను చెప్పానుగా, ఇది నాకు తెలిసిన సబ్జెక్ట్ అని" అన్నాను.

"మీకు సబ్జెక్ట్ తెలిసినా అతిశయం లేదు, చాలా మోడెస్ట్. మీరు నాకు సహాయం చేసి ఉండకపోతే ఈవేళ ఈ క్లాస్‌కి గుడ్‌బై చెప్పేసేదానిని. ఒక కప్పు టీ తాగుదామా?" అంది లీనా.

"టీ నాకు అంతగా నచ్చదు, అయినా పదండి" అంటూ ఆమెతో పాటు ఒక చిన్న రెస్టారెంట్‌కు వెళ్లాం.

"రెండు టీ, చక్కెర వేయకుండా తీసుకురా" అంటూ ఆర్డరిచ్చింది లీనా. అప్పుడు చూశాను ఆమెని పరీక్షగా. అయిదడుగుల అయిదంగుళాల పొడవుతో రివటలా ఉంది. కోల మొహం, పెద్ద కళ్లు, నారింజ గింజ బొట్టు, తెల్లని తెలుపు, ఉదయం వేసుకున్న మేకప్ చెదిరినా, సన్నని నడుము, అద్భుతమైన ఉపరిభాగం, పోనీటెయిల్, సల్వార్ కమీజ్ దుస్తులలో అందంగానే కనిపించింది లీనా.

"నా పేరు కుమార్, టాటా కంపెనీలో పనిచేస్తాను" అన్నాను నేను పరిచయం మొదలుపెడుతూ.

"ఐయామ్ లీనా, నేను ఎవరికీ పనిచేయను. ఐయామ్ ఇండిపెండెంట్" అని

నవ్వుతూ చేయి చాచింది. అంతవరకు ఎప్పుడూ ఏ ఆడపిల్లకీ షేక్‌హాండ్ ఇవ్వని నేను ఆమె చేయి అందుకున్నాను. మెత్తగా ఉంది. పాముజారి వెళ్లిపోయినట్లుగా ఆమె చేయి మెల్లగా నా చేతిలోంచి విడివడింది. పొడవాటి చేతులు, వేళ్ల గోళ్లకి ఎర్రని గోళ్ల రంగు. "ఈమె శరీరం మీద చాలా ఆసక్తి కనపరుస్తుంది" అనుకుంటుంటే వెయిటర్ టీ పట్టుకు వచ్చి టేబుల్ మీద ఉంచాడు. ఇద్దరి కప్పులలో ఒక్కొక్క చెమ్చా చక్కెర వేసి, నేను టీ తాగడానికి ఉత్సాహం చూపించకపోతే, "రుచి చూడండి, బాగుండకపోతే వదిలేయండి" అంది. టీ రుచి మాట ప్రత్యేకంగా అనుకోవడానికి ఏమీ లేకపోయినా, దాని సువాసన నచ్చింది నాకు. సగం టీ తాగి మిగతాది వదిలేశాను నేను.

"నేను మిమ్మల్ని మీ ఇంటి దగ్గర వదిలేయగలను, నాకు కారు ఉంది" అంటూ ఎంత వారిస్తున్నా వినకుండా తన ఫియట్ కారులో ఎక్కించుకుని నా ఫ్లాట్ దగ్గర దింపింది. బొంబాయి సంస్కృతి బాగా వంటపట్టిన లీనా, విశాఖపట్నంలో బుద్ధావతారంలా పెరిగిన నాకు ఒక వింత. ఆడవాళ్లలో ఆ చొరవతనం, అథారిటీ చూడని నాకు లీనా అంటే ఆశ్చర్యం పెరిగింది. ఆమె కూడా నా దగ్గరగా మసలడంతో మనస్సులో వింత కోరికలు మొగ్గ తొడిగేవి.

ఆరు వారాల కోర్సు పూర్తయింది. ప్రొఫెసర్ ఇచ్చిన సర్టిఫికెట్ అందుకుంది. ఆ ఆరువారాలలో ఆమెకి చదువులో బాగా సహాయపడ్డాను. కోర్సు పూర్తి చేసినా, నిజానికి ఆమెకి దానిలో ఉన్న పాఠాలలో అవగాహన తక్కువేననిపించింది. కాని ఆమెకి సర్టిఫికెట్ ముఖ్యం.

"రేపు ఎక్కడైనా కలుద్దామా? " అనడిగాను ఆఖరిరోజు బిల్డింగ్‌లోంచి బైటికి వచ్చినపుడు.

"ఎందుకు? " అని తిరుగు ప్రశ్న వేసింది. నిజానికి ఆమె వేసిన ప్రశ్నలో తప్పేమీ కనిపించకూడదు. కాని ఆమె వేసిన ప్రశ్నతీరు, దానిలో ఉన్న వాడి చూసి అవాక్కయ్యాను. తేరుకుని ఏదో అనబోతుంటే, "మనం ఎందుకు కలవడం? కోర్సు అయిపోయిందిగా? నాకు ఈ పెద్ద బిజినెస్ మేగ్నేట్‌తో పెళ్లవబోతోంది. అవసరమైన కోర్సులు అన్నీ పూర్తి చేశానని అతనికి ఫోన్ చేయాలి" అంటూ ఒక ఫొటో చూపించింది. ఫొటోలో ఉన్న ఆ వ్యక్తి పూర్తి సూట్‌లో చాలా అందంగా ఉన్నాడు. అతనితో పోలిస్తే నేను చాలా పేలవంగా ఉన్నాను అన్ని విధాలా.

"కంగ్రాచ్యులేషన్స్" అన్నాను ఇంకేమనాలో తెలియక.

"ఐ డోంట్ నో, మళ్లీ మనం కలుస్తామో లేదో. థాంక్స్" అంటూ, మూగబోయిన నన్ను పోనీ టెయిల్ ఊపుకుంటూ దాటి వెళ్లింది. ప్రతీ రోజూ నన్ను నా ఫ్లాట్ దగ్గర దింపిన లీనా, ఆ రోజు కనీసం ఫ్లాట్ దగ్గర దింపనా? అనైనా అడగలేదు. ఆ ఆరు వారాలు బలవంతంగా కారులో ఎక్కించుకుని తీసికెళ్లిన వ్యక్తి ఇహ నా అవసరం లేదనిపించాక కాబోలు అలా ప్రవర్తించింది. అది నన్ను దిగ్భ్రాంతికి గురిచేసింది. అప్పటినుంచీ "ఎందుకు? " అని ఏ స్త్రీ అయినా నన్ను ప్రశ్నిస్తే ఎలర్జీ కలుగుతుంది.

లీనా కోర్స్ పూర్తి చేయడానికి నన్ను వాడుకుంది. ఆమె నాకు దగ్గరగా తగులుతున్నట్లు నటించకుండా స్వచ్ఛంగా "నాకు కోర్స్‌లో సహాయం చేయగలవా? " అని అడిగితే నేను ఖచ్చితంగా సహాయం చేసేవాణ్ణి. కాని ఆమె తన అసహాయతను, చాతుర్యాన్ని ఎరగా పెట్టి నన్ను ఏదో ఊహా లోకంలోనికి తోసింది. దాదాపు

# లింకన్ చతురోక్తులు

అమెరికా 16వ అధ్యక్షుడైన అబ్రహాం లింకన్ చూసేందుకు ఏమంత అందగాడు కాదు. పొడుగ్గా, బక్క పలచగా, ఉంటాడాయన. హాస్యస్ఫూర్తిగల ఆయన చతురోక్తులలో కొన్ని..




## ఇంకోటుంటే ఇదెందుకు?

1858లో జరిగిన ఎన్నికల్లో లింకన్‌కు ఆయన ప్రత్యర్థి స్టీఫెన్ డగ్లస్‌కు నడుమ మేధావులు, ప్రజల సమక్షంలో వాడి వేడి చర్చలు జరిగేవి. అలాంటి చర్చావేదికపై డగ్లస్ ఓసారి లింకన్‌ను 'మీకు రెండు ముఖాలున్నాయి?' అని విమర్శించాడు.

వెంటనే లింకన్, 'నా దగ్గర రెండు మొహాలే ఉంటే ఇప్పుడున్న ఇలాంటి మొహాన్ని ఎందుకు తగిలించుకునేవాణ్ణి?' అని తిప్పికొట్టేసరికి డగ్లస్ సహా అంతా ఫక్కున నవ్వారు.

---

నలభై రోజులపాటు లంచ్, డిన్నర్‌లు కలిసి చేసి శని, ఆదివారాలు ఆమెకి పాఠాలలో సహాయపడ్డాక ఆఖరి రోజు ఎందుకు? " అనడిగింది.

"డామిట్! తన ప్లాన్‌లో నేను చదరంగం బల్ల మీదున్న బంటు వంటివాణ్ణి. షి హర్ట్ మి, షి ఈజ్ ఎ గుడ్ సైకాలజిస్ట్! ఆమె గురించి ఏమీ తెలియకుండా నేను ఏదో లోకంలో విహరించడం నా తప్పే. కాదనను. నన్ను ఎలా పల్టీ కొట్టించాలో ముందే ఊహించి అలా పల్టీ కొట్టించింది. ఇంటికి వెళ్ళి నా గురించి జ్ఞాపకానికి తెచ్చుకుని నవ్వుకుని ఉంటుంది. ఈ ఉదంతంలో కూడ ఒక ప్లస్ పాయింట్ ఉంది" అంటూ ఆగాడు కుమార్. కళ్ళు మూసుకుని లీనాని బహుశా జ్ఞాపకానికి తెచ్చుకుంటున్నాడేమో, ఆ జ్ఞాపకం బాధాకరంగా ఉంది కాబోలు, నుదుటన ముడుతలు కనిపించాయి జలజకి.

"దీనిలో ప్లస్ పాయింట్ ఉందా? " అనడగింది జలజ.

"యస్. నా ఊహలు బయటికి చెప్పలేదు. నేను నిన్ను ప్రేమిస్తున్నాను లాంటి వాక్యాలు నా నోటినుంచి వెలువడలేదు. పాలను తోడు పెడితే పెరుగు అవకుండా ఉన్న దశలోలా, ఇరవై నాలుగు - ఇరవై ఐదేళ్ళ వయస్సులో ప్రేమ అన్న పదానికి వ్యాఖ్య విచిత్రంగా ఉంటుంది. మనం ఆ దశ దాటి దానిని మరచిపోయి పెళ్ళిళ్ళు చేసుకుని కాపురాలు చేసినా, ఒక్కళ్ళూ ఉన్నప్పుడు, ఎవరూ మనల్ని గమనించడం లేదని నిర్ధారణ అయ్యాక, ఊరికే జీవిత చరిత్ర మెదడులో తిరగేస్తే అలనాటి తోడుకోని పెరుగులాంటి దశ జ్ఞాపకానికి వస్తుంది. ఆ పాతగతం ఓటమి అయినా, విజయం అయినా అవి గతంలో కరిగిపోయినా, దీని సిగ తరగ ఆ జ్ఞాపకం మనల్ని ఒక ఊపు ఊపుతుంది. "నీ మొహం ఎప్పుడైనా అద్దంలో చూసుకున్నావా? నీ తాహతెంత? లాంటి వాక్యాలు ఆమె వాడవలసిన అవసరం రాలేదు. అవన్నీ ఆమె హేండ్‌బేగ్‌లోంచి ఫొటో తీసి ఆ వాక్యం నాతో చెప్పినప్పుడు, నేను కుంగిపోయిన మాట పచ్చి నిజం. కాని ఆమె వెళ్లిపోయాక కొన్నాళ్ళు ఆమెను తలచుకుని జాలి పడ్డాను" అన్నాడు కుమార్.

"జాలా? అదేమిటి అలా అంటున్నావు? " అనడిగింది జలజ.

"నన్ను ఒక చిన్న విషయానికి ఎక్స్‌ప్లాయిట్ చేసింది. అనుకున్నది సాధించింది. అదీ ఆమె ధోరణి, ఆమె కేరక్టర్. ఇలాగే ఆమె ఇతర సందర్భాలలోనూ ఆ దారిన పయనిస్తుంది. ఏదో ఒకరోజు ఏ తాచుపాముతోనో చెలగాటమాడుతుంది. తరువాత పరిణామాలు దారుణంగా ఉండవచ్చు.

ఆమె అలా చేయడం వలన స్త్రీ పట్ల నా ఉద్దేశం చాలా కాలం అనవసరంగా వంక రపోయింది. స్త్రీలందరినీ అనుమానించే చెత్త ధోరణిని నాలో ప్రవేశపెట్టింది లీనా" అంటూ కుమార్ అరక్షణం ఆగాడు.

"ఆమె నాకు మళ్లీ కనిపించలేదు. కానీ లీనా మహారాష్ట్రలో చాలా ఎక్కువగా ఉప యోగించే పేరు. ఆ పేరు విన్నప్పుడు నాకు ఇబ్బంది కలిగేది. అందుకే ముక్కు పుడకలు ధరించే మీనాక్షులు ఉన్న మెద్రా స్‌కి ట్రాన్స్‌ఫర్ పెట్టుకుని వదిలేశాను" అన్నాడు కుమార్.

"నేను ఎందుకు? అని వేసిన ప్రశ్నకి నీ దగ్గర నుంచి ఇలాంటి రియాక్షన్. వస్తుం దనుకోలేదు" అంది జలజ.

"ఎందుకు? అన్న ప్రశ్న వేసిన ధోరణి, సందర్భం ఎందుకో నన్ను ఇబ్బంది పెట్టింది. లీనా నన్ను వదిలి వెళ్ళినపుడు వాడిన మాట అది. అప్పుడు నాకు ఇరవై ఐదేళ్ళు. బాధ భరించి తేరుకున్నాను. కాని ఇప్పుడు నేను జీవితాన్ని వెనక్కి తిరిగి చూడబోయే మజిలీకి చేరబోతున్నాను. షాక్‌లు తట్టుకునే కెపాసిటీ తగ్గిపో యింది. ఈ ప్రపంచంలో బంధాలు ఏవీ శాశ్వతం కావు. అది అందరికీ తెలిసినది. కాలచక్రం పరిగెడుతుంటే ఎలాంటివైనా నలిగిపోవడం ఖాయం. ఆ వయస్సులో ఆ షాక్‌కి తట్టుకోగలిగాను, ఇప్పుడు తట్టుకో లేను" అన్నాడు.

"నేను దానితో ఏకీభవించను. అప్పుడు నీలో ఉడుకు రక్తం పరిగెడుతూ ఉండేది. నిస్పృహని అరిగించుకునే సామర్థ్యం ఉంటుంది. కాని ఇప్పుడు అలా కాదు. రక్త వేగం ఇప్పుడు అంత ఉండదు. కాని ఏళ్ళు పైపడుతుంటే షాక్‌లు తట్టుకునే కెపాసిటీ పెరుగుతుంది. ఏదిఏమైనా కాకతాళీ యంగా అన్న వాక్యానికి ఇంత ఆలోచన అ నవసరం. ఈ టాపిక్ మీద చర్చ ఆపేద్దాం" అంది జలజ.

కుమార్ వెంటనే ఏమీ సమాధానమీయ లేదు.

"ఆపేద్దాం, కానీ మరొక్కటి చెప్పాలి"

"ఏమిటది? "

"అది జరిగిన రెండేళ్లకి హిందూ పేప ర్‌లో చికాగోలో లీనా హత్య చేయబడింది అన్న చిన్న వార్త పడింది. వివరాలులేవు". అన్నాడు కుమార్.

నోటిమీద చేయి ఉంచుకుని చిత్తరువల్లే ఉండిపోయింది జలజ.

"పీజాకి ఆర్డరిచ్చాను, ఏ క్షణమైనా రావచ్చు. హెచ్.ఒ.బీలో మంచి సినిమా ఉంది. నీ ఫేవరేట్ వీరుడు సిల్వస్టర్ స్టలోన్ ఉన్న సినిమా, బండగా ఉన్న కండల్ని ప్రదర్శించే వెధవ హీరో ఉన్న సినిమా చూద్దాం" అంటూ రాబోయే పీజా పెట్టుకోవడానికి వీలుగా టీపాయ్ మీదున్న కాగితాలని ఖాళీ చేశాడు కుమార్.

"వాడు నా ఫేవరేట్ అని వాడంటే నీకు జెలసీ" అంటూ సంభాషణని కొత్త దారి లోకి మళ్లించింది జలజ. కాలింగ్ బెల్ మోగగానే తలుపు తీసి పీజా అందుకుని, పీజాకి డబ్బు అందించింది జలజ.

"నేను సినిమా సాంతం చూడలేనేమో, తొమ్మిదింపావుకల్లా బయలుదేరి వెళ్ళిపో తాను" అంటూ పీజా మీద కారంపొడి చల్లి ఒక ముక్కని అందుకుంటూ కుమార్ పక్కని చతికిలపడింది జలజ.

"పీజాకి నువ్వు డబ్బు ఇవ్వడం ఏమీ బాగాలేదు. ఎంత ఇచ్చేవో చెప్పు" అంటూ పర్స్ తీయబోయేడు కుమార్.

"నువ్వే ఎప్పుడూ ఇస్తావు. ఒక్కసార యినా నేను ఇవ్వకపోతే నాకు బాగుం డదు" అంటూ కారంగా ఉన్న పీజా నాలి కకి మంట పుట్టిస్తుంటే కోకాకోలా అందు కుంది జలజ. వేడి వేడి పీజా మీద దట్టంగా జల్లిన కారం పుట్టించిన మంటని

తట్టుకోలేకపోవడంతో నాలికమీద నుంచి ఊపిరిని వదులుతూ చల్లబరుచుకోడానికి జలజ పడుతున్న అవస్థని చూసి కుమార్‌కి నవ్వు వచ్చింది. పరీక్షగా జలజనే గమనిస్తుంటే,

"ఐయామ్ సారీ" అంటూ లేచి ఒక కోకోకోలా కేన్‌ని కుమార్‌కి అందించింది. జలజ పరుగులాపి సర్దుకున్నాక, "నువ్వు నా ఫ్లాట్‌లో ఉన్నంతసేపు నా శరీరానికి వ్యాయామం అన్నదే ఉండదు. నన్ను ఏ పనీ చేసుకోనివ్వకుండా అన్ని పనులు నువ్వే చేసేస్తావు. నువ్వు రాకపోతే నేనే మౌతాను? " అన్నాడు కుమార్ మెచ్చుకోలుగా.

"ఇదీ ఒక ఎక్సర్‌సైజేనా" అంటూ ముక్కులు ఎగపీల్చి ఒక నవ్వు నవ్వింది జలజ. అది నవ్వు కాదది! అదేదో సామెత చెప్పినట్లు మందహాసం కంటే ఎక్కువ, పళ్ళు విప్పి నవ్వడంకంటే తక్కువలో ఉంటుంది. తృప్తి లభ్యమైనపుడు, హాయిని ప్రదర్శించే నవ్వది! యథాప్రకారం జలజవేపు కుమార్ చూస్తుంటే, "టెలివిజన్ ఆన్ చెయ్. ఏదో మంచి సినిమా వస్తుంది అన్నావుగా" అంటూ పీజా ముక్కని మళ్ళీ కొరికింది జలజ. కుమార్‌లో ఏమీ చలనం లేకపోవడం చూసి, రిమోట్ అందుకుని టెలివిజన్‌ని తనే ఆన్ చేసింది జలజ.

కాస్సేపు సినిమా నడిచేక కమర్షియల్స్ వచ్చాయి.

"నేను రాజమండ్రి వెళ్ళి మా అమ్మాయిని చూసి వద్దామనుకుంటున్నాను. సరోజని చూసి దాదాపు మూడేళ్ళుపైనే అయింది" అంది జలజ.

జలజ, కుమార్‌లు కూర్చున్న సోఫాకి ఎదురుగా ఉన్న ఫర్నేస్‌లో వెలుగుతో మండుతున్న సహజవాయువు గదిలో ఉష్ణోగ్రతను శరీరానికి అనుకూలమైన ఇరవై రెండు డిగ్రీలు సెల్సియస్‌లో ఉంచుతోంది. ఫర్నేస్ లోంచి వెలువడుతున్న బంగారం రంగు వెలుతురు జలజ మొహంమీద పడి నాట్యం చేస్తుంటే, నలభై ఎనిమిదవ అంతస్తులో ఉన్న ఫ్లాట్ గాజు అద్దాల మీద ఇతర ఫ్లాట్లనుంచి వచ్చిన వెలుతురు, దూరం ప్రయాణంచేసి, గాజుల అద్దాలలోంచి జారపడలేక ఇబ్బంది పడ్డాక జలజ మొహం మీద వాలగానే ఉత్సాహంగా, వింతగా మెరుస్తోంది. ఫ్లాట్ ఎదురుగా ఉన్న హడ్సన్ నదిలో లాంచీలు కదిలి వెళ్తున్నాయి. చలికాలం పూర్తిగా మొదలవకపోయినా నిర్ణీత కాలానికి ముందరే గాలిలో తేమ ఎక్కువై చలి మొదలయింది. వింతగా మెరుస్తున్న జలజ మొహం వేపే చూస్తున్న కుమార్ జలజ మాటలకి ఉలిక్కిపడ్డాడు. కుమార్ మొహం వేపు తన మొహం తిప్పకుండా ఫర్నేస్ వేపే ఉంచి, రెండేళ్ళు ఈ చలిని భరించినా అది నాకు అలవాటు అవడం లేదు. ఇప్పుడు ఇండియా వెళ్తే ఒక సంవత్సరమైనా ఈ చలి బాధ తప్పుతుంది" అంది జలజ.

"అయితే ఎప్పుడు వెళదామనుకుంటున్నావు? వెళ్ళడానికే నిశ్చయమైతే నాకు తెలిసిన ఒక ట్రావెల్ ఏజెంట్‌ని సంప్రదిద్దాం. ముందు నిర్ణయం సంగతి ఆలోచించు" అన్నాడు కుమార్ పొడిగా. కుమార్ ఎంత శాంతంగా ఉండ ప్రయత్నించినా, అతని మాటలలోని నిరుత్సాహం, అలజడి, కంపనం పసికట్టిన జలజ కుమార్ వేపు తిరగకుండా, వచ్చే నెలలో ఎక్కువ సెలవులు ఉంటాయి. పాఠాలకు వచ్చే విద్యార్థుల సంఖ్య తక్కువగా ఉంటుంది. ఆ సమయంలో అయితే కొద్దిమంది విద్యార్థులకే ఇబ్బంది" అంది జలజ.

కుమార్ ఏమీ మాటలాడలేదు.

"వచ్చే నెల పదిహేను ఇరవై తారీకుల మధ్య రిజర్వేషన్ దొరికితే బాగుండును" అంటూ జలజ తనలో తను గొణుక్కునట్లు అంది.

కుమార్ దగ్గరగా ఉన్న ఎడ్రస్ పుస్తకం లోంచి ఒక టెలిఫోన్ నెంబర్ కాగితం మీద రాసుకుని దానికి ఫోన్‌చేసి, "రావ్ గారా? నేను కుమార్‌ని. మేన్ హేటన్ న్యూయార్క్ నుంచి మాట్లాడుతున్నాను. డిసెంబర్ పదిహేను - ఇరవై తారీఖుల మధ్య ఇండియా వెళ్ళడానికి ఒక టిక్కెట్ కావాలి. రెండు మూడు ఎయిర్‌పోర్ట్‌లు మారకుండా తిన్నగా హైదరాబాద్ తీసుకెళ్ళేలా చూడండి. ఏ సంగతీ నాకు ఒక అరగంటలో తెలియపరచండి. నా టెలిఫోన్ నెంబర్ మీకు తెలుసా? " అంటూ రిసీవర్ పెట్టాడు.

"ఎయిర్‌పోర్ట్‌లు మారి వెళ్ళగలను. తిన్నగా ఉన్న ఫ్లైట్స్ టిక్కెట్ల ఖరీదు ఎక్కువగా ఉంటుందేమో. రెండు గంటలు ఆలస్యంగా చేరినంత మాత్రాన మునిగిపోయేదేమీలేదు. అతనికి చెప్పు" అంది జలజ.

"కాని నువ్వు అనవసరంగా ఇబ్బందులకి గురవడం నాకిష్టంలేదు. ఫ్లైట్లు తిన్నగా వెళ్ళినపుడు ఆరేడు గంటలు భరించవచ్చు. కాని ఫ్లైట్లు ఆలస్యంగా నడిచి, తరువాత ఫ్లైట్ అందకపోతే కొన్ని ఎయిర్‌లైన్స్ వాళ్ళు ప్రయాణికుల గురించి సరైన జాగ్రత్తలు తీసుకోరు. పర్యవసానంగా ఇబ్బందులకి లోనవుతావు. శాంతిని, తృప్తిని డాలర్లు పెట్టి కొనుక్కోలేం. కనీసం ఈ డాలర్లు ప్రయాణాల్లో సుఖాన్ని కొనుక్కోవడానికైనా ఉపయోగపడకపోతే ఎలా? అయినా నేనేమీ నీ ప్రయాణాన్ని నిశ్చయపరచలేదు. ఈ ట్రావెల్ ఏజెంట్ నాకు బాగా పరిచయమైన వ్యక్తే. ఏఏ మార్గాలు ఉన్నాయో చెబుతాడు. ఒకరు చెప్పినది నీకు నచ్చుదన్న విషయం నాకు తెలుసు. వివరాలు సేకరించడమే నా వంతు, తరువాత నిశ్చయం నీది" అంటూ రిమోట్ అందుకుని వాల్యూమ్ తగ్గించాడు కుమార్.

"ఎన్నాళ్ళు ప్రయాణం? ఎప్పుడు తిరిగి వస్తావు? " లాంటి ప్రశ్నలు కుమార్‌కి వేయాలని ఉంది. కాని జలజకి ఇతరులు తన గురించి ప్రశ్నించడం రుచించదు. విచిత్రం ఏమిటంటే, ఇతరుల గురించి తను తెలుసుకోవాలని ఏవేవో ప్రశ్నలు వేస్తుంది అని తెలిసినా కుమార్ ఆ ధైర్యం చేయలేదు.

దాదాపు పదిహేను నిమిషాల తరువాత టెలిఫోన్ మోగింది. రిసీవర్ ఎత్తి విని, జలజ వేపు తిరిగి "నీ తిరుగు ప్రయాణం తారీఖులు కావాలిట" అన్నాడు కుమార్.

నెల్లాళ్ళ తరువాత ఏ తేదీన వీలవుతుందో చూడమనండి. కనీసం ఒక నెల కావాలి" అంది జలజ. ఆ సంగతి ట్రావెల్ ఏజెంట్‌కి చెప్పి రిసీవర్ పెట్టేశాడు కుమార్.

ఇండియా వెళ్ళే ఉద్దేశం ఉందని, అయితే అక్కడ ఎన్నాళ్లు ఉంటానో నిశ్చయించుకోలేదని, కుమార్‌కి చెబుదామని ఉన్నా, తనంతట తాను ఏ భావాన్నీ, ఉద్దేశాలని బైటకి వెలిబుచ్చే అలవాటులేక, కుమార్ అడిగితే చెబుదామని ఊరకుండిపోయింది జలజ.

"నెల్లాళ్ళు మీ అమ్మాయి దగ్గరే గడుపుతారా? లేక ఇంకెక్కడికైనా వెళ్ళాల్సిన పని ఉందా? " అనడిగాడు కుమార్.

"అదేదో సామెత చెప్పినట్లు, నేవెళ్ళడం ఇంకా నిశ్చయమవకముందే దాని గురించి ఎలా ఆలోచించగలను? చూద్దాం" జలజ మాటలలో ఉన్న వేడి గ్రహించి, హతాశుడయి, ఇంకేమీ ప్రశ్నించడానికి మనస్కరించక మౌనంగా ఉండిపోయాడు కుమార్.

జలజ వెళ్ళి అరగంటయింది. ఇంకా

**కొత్తపాళి...**

**ప్రపంచమొక**
**పెద్దబాలశిక్ష**
**ప్రజలందరూ!**
**పసివిద్యార్థులే!**

—ప్రాణహిత, ఖానాపూర్

నిద్రపోయే టైం కాలేదు. టెలివిజన్‌లో ఆసక్తికరమైన ప్రోగ్రాంలు ఏమీ రాకపోవడంతో దాన్ని ఆపుచేసి దగ్గరగా ఉన్న పుస్తకం అందుకున్నాడు కుమార్. కళ్ళు యాంత్రికంగా చదువుతున్నా చదివిన దానిని మెదడు ఆకళింపు చేసుకోవడం లేదు. గడియారం రాత్రి పదిగంటలు చూపిస్తోంది. గదిలో ఉన్న వాతావరణం ఉక్కిరిబిక్కిరి చేస్తోంటే ఒక్కసారి బైటకి వెళ్ళి చల్లని గాలి పీల్చాలనిపించి, దుస్తులు మార్చుకుని ఎలివేటర్‌లో కిందికి దిగాడు కుమార్. ఎలివేటర్ తలుపులు తెరచుకుని బైటకి రాగానే ఎప్పుడూ జలజని పొగిడే కొన్సియర్ కనిపించి కళ్ళతోనే ఆశ్చర్యం ప్రకటిస్తూ, "బైట చల్లగా ఉంది. అదీకాక ఈ సమయంలో మీరు ఒంటరిగా బైటకి వెళ్ళడం అంత మంచిది కాదేమో" అన్నాడు. అమెరికాలో ఒకరికి ఇంకొకరు ఉచిత సలహాలు ఇవ్వడం చాలా తక్కువని అందరికీ తెలిసిన విషయమే.

"ఐయామ్ సారీ, నేను 'జాగ్రత్త' అని చెప్పాను, అంతే" అన్నాడు కొన్సియర్.

"దట్సాల్ రైట్, థాంక్స్ ఎనీవే" అంటూ రివాల్వింగ్ డోర్ మూసివేసి ఉండడంతో లోపల నుంచి మాత్రమే బైటకి తెరచుకునే తలుపులోంచి బయటకి వచ్చేడు కుమార్.

చల్లని గాలి ఒక్కసారి కుమార్‌ని బలంగా తాకింది. చేతులతో చెవులని కప్పుకుంటూ, "జలజ ఈ చలిగాలిని భరిస్తూ రెండు బ్లాక్‌లు నడిచి సబ్‌వే స్టేషన్ చేరుకోవడానికి ఎంత అవస్థ పడిందో!" అనుకున్నాడు కుమార్.

"అయినా అక్కడ ఆమె గురించి నిరీక్షించేవాళ్ళు లేనపుడు ఇంత చలిలో ఇంటికి వెళ్ళవలసిన అవసరం ఏమిటి?" అనుకుంటూ కృత్రిమమైన కాళ్ళతో బరువుగా నాలుగు అడుగులు వేశాడు. యథాప్రకారం రోడ్లమీద కార్ల ప్రవాహం ఉన్నా, పేవ్‌మెంట్ మీద నడిచే పాదచారుల సంఖ్య చాలా తక్కువగా ఉంది. దుకాణాలు మూసివేయడంతో వాటిలోంచి బైట పడే వెలుతురు తగ్గింది. రెస్టారెంట్లలోంచి కోట్లు కప్పుకుంటూ బైటకి వచ్చిన కొందరు పార్క్‌చేసి ఉన్న కార్ల దిశలోనో, లేదా సబ్‌వే స్టేషన్‌వేపో హుటాహుటిన కదిలి వెళ్తున్నారు. కొందరు పేవ్‌మెంట్ అంచున నిలబడి ఖాళీగా ఉన్న టాక్సీల కోసం చేతుల్ని ఊపుతున్నారు. ఎదురు పేవ్‌మెంట్ మీద దేహదారుఢ్యం గల ముగ్గురు వ్యక్తులు తననే గమనిస్తున్నారనిపించగానే కుమార్‌కి మెడమీద వెంట్రుకలు నిక్కపొడుచుకున్నాయి. తను రెండు బ్లాక్‌లే కాకుండా సబ్‌వే స్టేషన్ దాటానని గ్రహించి నడక ఆపి ఠక్కున వెనక్కి తిరిగాడు. ఒక్కసారి వెనక్కి తిరగడంతో కుమార్ వెనుకనే నడుస్తున్న వ్యక్తి అతణ్ణి ఢీకొని, "షిట్! వాట్ మేన్?!" అంటూ రవ్వంత ఆగ్రహం ప్రకటించి దాటి ముందరికి వెళ్ళాడు. ఒక్కసారి కుమార్ రక్తం వేడి చల్లారి, చుట్టూ ఉన్న పరిసరాలని గమనించి రవ్వంత వేగంగా నడిచి తనున్న బిల్డింగ్ దగ్గర ఆగాడు. అతన్ని చూసి లోపల ఉన్న కొన్సియర్ బజ్జర్ నొక్కడంతో తలుపు తెరుచుకుంది.

లోపలికి వచ్చిన కుమార్‌తో, "చలిగా ఉంది కదా? గుడ్‌నైట్" అన్నాడు.

పరుపు మీదకి చేరిన కుమార్‌కి ఆవలిం

తలైతే వస్తున్నాయి. కాని నిద్ర రావడం లేదు. జలజతో పరిచయం పెరిగాక, క్రమేణా ఆమెతో గడిపే కాలం ఎక్కువయింది. ఒంటరి జీవితపుగాడిలో తిరుగుతున్న తనని, తన జీవితాన్ని యాదృచ్ఛికంగా తటస్థపడి ఆ గాడిలోంచి తప్పించింది జలజ. దాదాపు మూడేళ్ళుగా ఒక కొత్త పోకడకి అలవాటుపడ్డాడు తను. ఉన్నట్టుండి, చటుక్కున జలజ ఇండియాకి వెళ్తాననడంతో, తన జీవన క్రమంలో మార్పు వస్తుంది. తను తిరిగి ఆ పాత గాడిలో పడిపోతాడేమో! ఆనందంగా రోజులు కదలివెళ్తుంటే ఇలాంటి సన్నివేశం ఎదురుపడుతుందన్న ఆలోచన తనకి రాలేదు. ఈ హఠాత్పరిణామం తనలో అలజడిని సృష్టిస్తోంది. ఆమె ఇండియా వెళ్తానంటేనే తను ఇలా ఫీల్ అవుతుంటే జలజ వెళ్ళేరోజు వచ్చి ఆమె వెళ్ళిపోతే తను ఎలా భరిస్తాడు అనుకుంటూ కణతలు నొక్కుకున్నాడు కుమార్.




రెండు సంవత్సరాలుగా సబ్‌వే ఉపయోగించిన తను ఎప్పుడూ దారితప్ప లేదు. కాని ఈవేళ తను ఎక్కవలసిన రైలు ఎక్కకుండా పరాకుగా ఇంకో రైలు ఎక్కిన తను తరువాత సబ్‌వే స్టేషన్‌లో దిగి సరైన రైలు పట్టుకుని ఇల్లు చేరడానికి నలభై ఐదు నిమిషాలు పట్టింది. ఆలస్యంగా ఫ్లాట్‌కి వెళ్ళిన కొడుకు, కోడలు ఇంకా ఫ్లాట్‌కి తిరిగి రాకపోవడంతో ఖాళీగా ఉన్న ఫ్లాట్‌లోకి ప్రవేశించి, గబగబా పరుపు పరచుకుని బాత్రూంలోకి వెళ్లింది. జలజ పళ్ళు తోముకుని బైటకి వచ్చి ఇల్లు చేరానని కుమార్‌కి చెబుదామని ఫోన్ చేసింది. ఫోన్ ఎవ్వరూ ఎత్తకపోవడంతో ఆలోచనలో పడింది.

"ఇంత రాత్రప్పుడు ఎక్కడికి వెళ్ళేడబ్బా?" అనుకుంటూ ఫోన్ పెట్టేసింది. అరగంట గడిచేలోగా నాలుగుసార్లు ఫోన్ చేశాక కాని కుమార్ దొరకలేదు.

"ఇంత రాత్రప్పుడు ఏమయ్యావు? కంగారుపడ్డాను" అంది జలజ అలజడిని అణుచుకుంటూ.

"రాత్రిపూట సబ్‌వేలో ఒంటరిగా ప్రయాణం చేసే నీ గురించి నేను కంగారు పడాలి కాని నా గురించి నీకు కంగారు ఎందుకు? అలా రెండడుగులు బైటకి వేసి వచ్చేను" అన్నాడు కుమార్.

"సరే, రేపు మాటలాడుకుందాం" అంటూ ఫోన్‌ని క్రెడిల్ మీద ఉంచి పరుపుమీదకి చేరింది జలజ.

సబ్‌వేలో ప్రయాణం చేస్తూ తప్పిపోయి ఆలస్యంగా ఇంటికి రావడంతో కొడుకు, కోడలు ఏమనుకుంటారో అన్న భయంవల్ల జనించిన గుండెదడ, ఆయాసం మెల్లిగా తగ్గుతున్న సమయంలోనే కుమార్ ఫోన్ ఎత్తకపోవడంతో తిరిగి గుండెదడ ఉధృతమైంది. అది తగ్గడానికి కనీసం అరగంటయినా పడుతుంది, అంతవరకు తనకి నిద్రపట్టదు. అనుకుంటూ నేలమీద వేసుకున్న స్లీపింగ్ బేగ్‌మీద అటు ఇటూ కదులుతూ ఆలోచనలో పడింది.

భర్త రామం పోయిన రెండు సంవత్సరాల తరువాత కాని తను మామూలు మనిషి అవలేదు. ఏ పనీ చేయడానికి ఉత్సాహం లేక, ఏ వ్యాపకం మీదా ఆసక్తి

## అంద విహీనుడి కోసం కానుక

**లిం**కన్ తన ఆకారం, రూపురేఖలపై ఎప్పుడూ జోకులేస్తుండేవాడు. అలా చెప్పిన జోకు ఇది:

ఓ రోజు ఒక వ్యక్తి లింకన్‌కు ఓ చాకును బహూకరించాడట. లింకన్ ఆశ్చర్యపోతూ 'అబ్బే ఈ చాకు నాది కాదండి' అని బదులిచ్చాడట. అప్పుడా వ్యక్తి, 'నాకంటే వికారంగా కనిపించే మనిషికి దీన్ని బహుమతిగా ఇవ్వాలని కొన్నేళ్ల నుంచి దీన్ని చేతపట్టుకుని తిరుగుతున్నాను. ఇవ్వాల్టికి మీరు దొరికారు' అన్నాడట.



ఏర్పడక, నిస్ప్రాణంగా గతాన్ని తలచుకుంటూ మౌనంగా రోదిస్తూ రోజులు గడిపింది తను. ఆ దశలో రెండు వారాలు సరోజ దగ్గర, నెల్లాళ్ళు కొడుకు దగ్గర గడపడానికి తను ఎంతో కష్టపడాల్సి వచ్చింది. ఎక్కడా ఇమడలేక, ఒంటరిదైన తను ఒంటరితనాన్ని వాంఛించింది. కారణాలు ఏమైనా సరోజకు చక్కగా ఇల్లు నడిపే చాకచక్యం అలవడలేదు. పుట్టింటికి వచ్చినపుడు ఏ రోజు పూచికపుల్ల పని చేసేది కాదు. చిన్నపుడు తన పనులు తానే చేసుకోవాలని సరోజకి హితవులు చెబుతుంటే "మరేం ఫరవాలేదు, దానంతటదే దానికి పని అలవడుతుందనో" లేక "మీ అమ్మకి ఇల్లు నీట్‌గా ఉంచే చాదస్తం ఎక్కువ" అనో రామం సరోజని సమర్థించేవాడు. దాంతో సరోజకి పని అబ్బలేదు. మొక్కై వంగనిది మానై వంగుతుందా? అన్న సామెతలా పెళ్ళయ్యేక సరోజకు పని రాక, చేసుకునే చాకచక్యం తెలియక తెగ సతమతమవుతుంటే తనకి నిద్ర సరిగ్గా పట్టేది కాదు. తను సరోజని ఎంతకని సరిదిద్దగలదు? ఎన్నాళ్ళని సరిదిద్దగలదు? తను శాశ్వతంగా సరోజ దగ్గర ఉండిపోలేదు కదా? అయినా ఎంతకాలం? శాశ్వతంగా ఈ భూమి మీద ఉండిపోవడానికి యమధర్మరాజు అనుమతించడు కదా! కొడుకు, కోడలు ఇద్దరూ పనిమంతులే. తమ పనులను తమకి వచ్చినట్లు చేసుకోగలిగేవారే. తమకి నచ్చడమే వాళ్ళకి ముఖ్యం, వాళ్ల ఎదుట వ్యక్తుల గురించి ఆలోచించే అలవాటు కోల్పోయినవాళ్ళు. కొడుకుకి తనంటే ప్రేమే కాని అది వ్యక్తపరచడం కాని, దానికి ప్రాముఖ్యం ఉందని కాని అనిపించదు. అది వాళ్ళ ప్రాధాన్యపు పట్టీలో చాలా దిగువన ఉంటుంది. "ఎవరి గురించి వాళ్ళు చూసుకోవాలి" అన్న దృక్పథం నరనరాల్లో జీర్ణించుకుపోయింది వాళ్ళిద్దరికీ.

"తను, రామం అలా అనుకుని ఉంటే సారథి ఈనాడు, ఈ స్థానంలో ఉండగలిగేవాడా? " నిట్టూర్చింది జలజ.

★ ★ ★

"వచ్చే ఆదివారమే నీ ఇండియా ప్రయాణం. అన్ని రిజర్వేషన్లు పూర్తయ్యాయి. తిరిగి రావడం ఐదు వారాల తరువాత. ఇక్కడ ఆదివారం రాత్రి కెనడా ఎయిర్‌పోర్టులో బయలుదేరి, లండన్‌లో ఒక గంట ఆగాక అదే విమానం నిన్ను బొంబాయికి తీసుకెళ్తుంది. బైటికి రాకుండా ట్రాన్సిట్ లాండ్‌లో మూడు గంటలు నిరీక్షించాక మరో విమానంలో హైద్రాబాద్ చేరుతావు. ఇక్కడ నీ సూట్ కేస్ చెక్ చేస్తే, అది మళ్ళీ హైదరాబాద్‌లో తీసుకోవడమే" అంటూ టిక్కెట్, రిజర్వేషన్‌కు సంబంధించిన కాగితాలను కుమార్ జలజకి అందిచ్చేడు.

"థాంక్స్" అంటూ కాగితాలను అందు

కుంటూ కుమార్ వేపు చూసింది. బయటికి శాంతంగా, గంభీరంగా ఉన్నట్టు అనిపించినా కుమార్ లోలోపల ఉన్న అలజడిని ఊహించిన జలజ దాని గురించి ఏమీ మాటలాడలేదు.

"మూడు సంవత్సరాల తరువాత ఇండియా వెళ్తున్నాను. నాకంటూ ఉద్యోగం లేదు కాబట్టి నేనేవో బహుమతులు తెస్తానని ఎవ్వరూ ఆశించరు. ఐనప్పటికీ అరవై-డెబ్బై డాలర్లు మాత్రమే ఖర్చుపెట్టి ఏవో సామానులు కొంటాను. రేపు జేక్సన్ హైట్స్‌కి వెళదామా? " అనడిగింది జలజ.

"ష్యూర్! ఎన్ని గంటలకి? " అన్నాడు కుమార్.

"పదకొండుకి వెళ్దామా"

"నీ సామాన్లు కొనడానికి ఒక గంట కంటే ఎక్కువ అవసరం లేదు. పదకొండున్నరకు మనం బయలుదేరితే, సామాన్లు కొన్నాక, అక్కడే ఏదో రెస్టారెంట్‌లో బఫే తినేసి తిరిగి రావచ్చు. రేపు మంచు కురవకుండా ఉంటే బాగుండును" అన్నాడు కుమార్. ఉత్సాహం లేని కట్టె, కొట్టె, తెచ్చే ధోరణిలో పొడిపొడిగా ఉన్న కుమార్ మాటలు విన్నా జలజ ఏమీ వ్యాఖ్యానించలేదు.

"నువ్వు ఇండియా వెళ్తే నిన్ను చాలా కాలం చూడను. ఐ మిస్ యు" అని కుమార్ అంటాడేమో అని ఆశించిన జలజకి కుమార్ ఆ మాట అనకపోవడంతో "ఈ మనిషికి ఎక్స్‌ప్రెషన్ లేదు. భావాలను బైటకి చెప్పి ఆప్యాయతను ప్రకటించే నైపుణ్యం లేదు" అనుకుంటూ, "ఈ మూడేళ్ళలో సరోజలో ఎంత మార్పు వచ్చిందో" అన్న అంశాల మీదకి మనసు మళ్ళించింది.

"నేను ఇండియా వెళ్తే ఐ మిస్ యు" అని చెబుదామనిపించినా, 'నేను మొదట ఎందుకు చెప్పాలి? ' అనుకుని ఆగిపోయాడు కుమార్.

ఇచ్చిన కాగితాలని హ్యాండ్‌బ్యాగ్‌లో సర్దుకుని "తొందరగా డిన్నర్ తినేద్దాం. ఇంటికి వెళ్ళి సూట్‌కేస్ సర్దుకోవాలి" అంది జలజ.

"సరే!" అన్నాడు కుమార్.

"ఇంకా ప్రయాణానికి ఎనిమిది రోజులు ఉంది కదా, ఈవేళ నుంచీ సర్దవలసిన తొందర ఏమిటి? యధాప్రకారం డిన్నర్ తిని వెళ్లవచ్చు" అనకుండా 'సరే' అన్న ముక్తసరి మాట విన్నాక జలజ మూడ్ ముభావంగా మారింది. కుమార్ సరిగా తినడంలేదని గమనించినా, పట్టించుకోకుండా తొందరగా భోజనం ముగించింది జలజ.

★ ★ ★

"నువ్వు షాపింగ్‌కి పనికిరావు. ఏది అడిగినా నీ ఇష్టం అంటూ సలహా ఇవ్వవు" అంది జలజ, రెస్టారెంట్‌లో బఫేలో ఉంచిన పదార్థాలను ప్లేట్‌లో వడ్డించుకుంటూ. దానికి ఏం సమాధానమివ్వాలో తెలియక మౌనం వహించాడు కుమార్. జలజకి చిర్రెత్తుకొచ్చింది.

"నవ్వు బాబూ నవ్వు. నవ్వు ఆరోగ్యానికి మంచిదంటారు" అంది జలజ.

"అహా! అలాగా? " అంటూ చిరునవ్వు నవ్వేడు. ప్లేట్లు పట్టుకుని ఒక టేబుల్ దగ్గరకు వచ్చి కూర్చున్నాక "నాకు తెలియదా నీ గురించి, నేను సలహా ఇవ్వలేను. బట్టలు, నగలు, సెలక్షన్ అస్సలే రాదు. ఇందాక నువ్వు రెండే రెండు చీరలు చూపించి, "ఏది బాగుంది? " అనడిగేవు. నేను "ఆ గచ్చకాయరంగు చీర బాగుంది" అన్నాను. నువ్వు రెండవది తీసుకున్నావు. అలాగే పెర్‌ఫ్యూమ్ కొనేటప్పుడూ నీకు సమ్మతమైనదే తీసుకున్నావు. మరి అలాంటప్పుడు నన్ను అడ

గడమెందుకు? నా సలహాకి విలువ ఇవ్వవని కాదు. కాని నా సలహా అడిగాక, నే చెప్పేదాని గురించి పట్టించుకోకుండా నీకు ఏది నచ్చుతుందో అదే తీసుకుంటావు. ఇది మొదటిసారి కాదు, చాలా సార్లు జరిగింది" అన్నాడు కుమార్.

కుమార్ వేపు చివాలున చూసింది జలజ.

మౌనంగా లంచ్ తినడం పూర్తిచేసి రెస్టారెంట్ లోంచి బైటికి వస్తుంటే చలిగాలులతో మంచు కురవడం మొదలయింది. సబ్ వే స్టేషన్ అరకిలోమీటర్ కన్నా దగ్గరే ఉన్నా, చేతిలో సామాన్లతో నడక ఇద్దరికీ ఇబ్బందిగా ఉంది. నూరు అడుగులు నడిచాక, రోడ్డు దాటుతుంటే అడ్డంగా వస్తున్న కారుని గమనించి తొందరగా అడుగు వేయబోతూ కాలుజారి కింద పడబోయింది జలజ. పక్కనే నడుస్తున్న కుమార్ జలజని పడకుండా పట్టుకున్నాడు. అంత చలిలోనూ శరీరంలో వేడి ఎక్కినట్లనిపించింది. "థ్యాంక్స్, నువ్వు పట్టుకోకపోయి ఉంటే, కిందపడి ఏదో ఒకటి విరిగితే నా ఇండియా ప్రయాణం గోవింద అయ్యేది" అంటూ నవ్వింది జలజ.

ఇద్దరి మధ్యా ఉన్న గంభీర వాతావరణం పటాపంచలయింది.

"నేను లేనూ? నిన్ను పడనిస్తానా? "



అని నవ్వుతూ జలజ చేతిలోంచి మరో ప్యాకెట్ అందుకున్నాడు కుమార్.

"నువ్వు ఒక్కర్తివీ ఈ సామాన్లన్నింటినీ మోసుకెళ్లలేవు. నేను నీ ఫ్లాట్ వరకు వచ్చి దిగబెడతాను" అంటూ జలజను సారథి బిల్డింగ్ ముందర వదిలి వెళ్ళాడు కుమార్.

"నేను అనవసరంగా కోపగించుకున్నాను" అనుకుంటూ కుమార్ వెళ్ళిన వేపే చూస్తూ ఎలివేటర్ బటన్ నొక్కింది జలజ.

★ ★ ★

"అమ్మా ఇదిగో వేపపువ్వు" అంటూ పని మనిషి వేపపువ్వును జలజ చేతికి అందిచ్చింది. సన్నగా తరిగిన మామిడి ముక్కలు, బెల్లం పాకానికి వేపపువ్వుని



జత చేసింది జలజ.

"చూడు, రుచి ఎలా ఉందో చెప్పు" అంటూ జలజ ఒక చెమ్చాడు ఉగాది పచ్చడిని పనిమనిషి అరచేతిలో వేసింది.

"చాలా చేదుగా ఉంది" అంటూ పచ్చడిని తిన్న పనిమనిషి నాలికని బైటకి పెట్టింది. షెల్ఫ్ తలుపు తెరచి రెండు చెమ్చాల తేనెని పచ్చడిలో వేసి, కలిపి ఉగాది పచ్చడిని టేబిల్ మీద ఉంచి కుర్చీలో సాగిలపడింది జలజ.

సెలవురోజు కావడంతో ఎవ్వరూ ఇంకా మంచాల నుంచి కిందకి దిగలేదు. ఇల్లంతా నిర్మానుష్యంగా ఉన్నట్లు నిశ్శబ్దంగా ఉంది. ఏం చేయాలో తెలియక జలజ ఆలోచనలో పడింది.

"చాలా చేదుగా ఉంది" అన్న పనిమనిషి మాట జ్ఞాపకానికి వచ్చింది.

తను ఇండియా వచ్చాక ఇది ఐదో ఉగాది! గత ఐదేళ్ళలో తన జీవితం, ఉగాది పచ్చడిలో విభిన్న రుచులలా, మంచి చెడులతో కలగాపులంగా గడిచింది. మోతాదుకి మించి చేదుపాలు ఎక్కువ ఉన్న రోజులే చాలా ఉన్నాయి అనిపించింది జలజకి. ఆలోచన మళ్ళీ గతంలోకి దౌడు తీసింది.

తను ఇండియా చేరగానే సరోజకి గర్భసంచీలో ఉన్న అడ్డు తొలగించడానికి ఆపరేషన్ జరిగింది. అలాంటి పరిస్థితులలో సరోజకి తన సహాయం అవసరమవడంతో ఆ జనవరిలో, నెల్లాళ్ళ తరువాత అమెరికా తిరిగి వెళ్దామనుకున్నది వీలవలేదు. ప్రయాణం రెండు నెలలు వాయిదా పడింది. ఆ సంగతే కుమార్‌కి రాసి, సరోజ పూర్తిగా కోలుకోగానే తిరిగి వస్తానని తెలియపరిచింది. సరోజ కోలుకుని పరిస్థితి మెరుగయ్యాక ప్రయాణం గురించి ఆలోచిస్తుంటే, సరోజకి వేవిళ్ళు మొదలయ్యాయి. చాలా కాలంగా బిడ్డల కోసం ఎదురుచూసిన సరోజ ఆనందం ఇంతా అంతా కాదు. కాని డాక్టరే "మూడు నెలలు ఈమెకి బెడ్‌రెస్ట్ అవసరం. లేకపోతే గర్భం విచ్ఛిన్నం అయ్యే అవకాశం ఉంది" అనడంతో తను ఉలిక్కిపడింది. సాధారణ పరిస్థితులలోనే ఇంటి పనులు చేసుకోలేని సరోజకి, ఏంతిన్నా ఇమడక వాంతులు అయి నీరసంగా ఉంటూ, "బెడ్ రెస్ట్" కావాలి అన్న డాక్టర్ హితవు విన్నాక, కూతురికి తన సహాయం అని వార్యం అనుకుని గ్రహించి అమెరికా ప్రయాణం వాయిదా వేసింది రెండవ సారి. సరోజలాగే తనూ ఆతృతగా బిడ్డ కోసం ఎదురుచూసింది. సరోజకి ఇబ్బంది కలగకుండా పనులు చేసిపెడుతూ, ఇంటి పనులు చక్కపెట్టడంలో నిమగ్నమైన తనకి తీరుబడి దొరకలేదు. రోజులు గడిచాయి. తీరుబడి అవగానే కుమార్‌కు అన్నీ వివరంగా రాద్దామనుకుంటుంటే, అర్థాంతరంగా కుమార్ ఇండియా వచ్చి ఇంటి తలుపు తట్టాడు.

"ఎవరు కావాలి?" అని అడిగిన పార్వతీశం ప్రశ్నకి "జలజగారు ఉన్నారా?" అన్న కుమార్ గొంతు విని నివ్వెరపోయింది. తన చెవులను తనే నమ్మలేకపోతుంటే, పార్వతీశం లోపలికి వచ్చి

"జలజా! నీకోసం ఎవరో వచ్చారు" అని చెప్పి తనని ఆశ్చర్యంలోంచి బైటకి లాగేడు. అస్తవ్యస్తంగా ఉన్న చీర, జుత్తు, అంతకన్నా అస్తవ్యస్తమై ఉన్న ఆందోళనకరమైన మనస్సుతో లేచి నిలబడి ముందు గదిలోకి వచ్చి కుమార్‌ని చూసింది.

"హలో, ఎలా ఉన్నారు?" అనడిగాడు కుమార్ కుర్చీలోంచి లేచి నిలబడి.

"కూర్చోండి" అంటూ కుమార్ ఎదురుగా కుర్చీలో కూర్చుంది తను. గుమ్మం దగ్గర నిలబడి ఈ ఆగంతకుడు ఎవరా? అని ఆశ్చర్యంగా చూస్తున్న పార్వతీశంతో "ఈయన కుమార్, ప్రభాకర్, సారధిలకి స్నేహితుడు. అమెరికాలో ఉంటారు. ఈయన మా అమ్మాయి సరోజకి మావగారు. నాకు పెదనాన్నగారి కుమారుడు అవడంతో అన్నయ్య" అంటూ బెరుకుగా పరిచయం చేసింది. అన్నయ్య ఎదురుగా కుమార్ వేపు చూసే ధైర్యం లేక ఇబ్బంది పడుతుంటే, "జలజా కాఫీ పట్టుకురా" అంటూ పార్వతీశం కుమార్ ఎదురుగా కూర్చోవడంతో, మౌనంగా లేచి వంటగది వేపు నడిచింది తను.

కుమార్ తనని చూడడానికి రావడంతో లోలోన ఉత్సాహం, ఆనందం కలిగింది. ఇంటి పనులలో ఇమిడిపోయి అలసిపోయిన తనకి ఒక రకమైన తృప్తి కలిగింది. అంతర్లీనంగా హాయి మళ్ళీ రాజుకుంది. కాని అది చాలా తక్కువ కాలమే! అతడు

రెండు, మూడుసార్లు తనని చూడడానికి రావడం బంధువుల గుంపులో సంచలనాన్ని సృష్టించింది. ఊహాగానాలు ఉద్భవించాయి. అనుమానాలు అవతరించాయి. కుమార్‌తో బైటికి వెళ్ళలేక, ఇంట్లో ఉన్నప్పుడు అతనితో మాట్లాడలేక ఉక్కిరిబిక్కిరి అయింది తను. కుమార్ వచ్చినపుడు అందరి దృష్టి అతనిమీద ఉండడంతో తను ఇబ్బంది పడింది. కుమార్ ఎవరు? ఎందుకు తనని ఇన్నిసార్లు చూడడానికి వచ్చాడు? తన మీద కుమార్‌కి ఎందుకు అంతాసక్తి? అతనితో తన పరిచయం ఎలాంటిది? లాంటి ప్రశ్నల పర్యవసానం సరోజ కాపురంలో కనపడసాగింది. సరోజ మౌనంగా చిర్రుబుర్రులను భారంగా భరిస్తుంటే కుమార్‌ని దూరంగా ఉంచడానికి ప్రయత్నం చేద్దామనుకుంది. ఒకపక్క తాసులో కుమార్ స్నేహం, రెండవవైపు తాసులో సరోజ కాపురం తూచితే కుమార్ స్నేహం ఉన్న తాసు చాలా తేలికగా ఉన్నట్లనిపించింది. ఆ సంగతే మెల్లిగా కుమార్‌తో చెప్పబోతే, అతను వినిపించుకోడేమో అని అనుమానించి ఘాటుగా చెప్పింది తను.

కుమార్‌తో స్నేహం ఇండియాలో సాధ్యం కాదు. తను అమెరికా వెళ్ళి శాశ్వతంగా ఉండిపోవడం ఆలోచనరీత్యా సాధ్యమైనా తనకి, కుమార్‌కి ఉన్న స్నేహం గురించి తెలిసిన ఇక్కడ సమాజం, బంధుజనం సరోజ కాపురాన్ని విషపూరితం చేస్తుంది. అలా చేయగల బలం వారికి ఉంది. సరోజ సమర్థురాలైతే ఫరవాలేదు, కాని ఆమెలో చాకచక్యం లేదు. సరోజ భవిష్యత్తు కంటే కుమార్‌తో తన స్నేహం ముఖ్యంకాదు. అది ఆనందంతో చదివి తిప్పేసిన పాత పేజీ! ఫిబ్రవరి మాసాంతంలో మొదలవుతున్న వేడికి తట్టుకోలేక ఒడలిపోతున పూలతీగ లాంటిది తన ఇప్పటి జీవితం. గ్రీష్మ రుతువులో మండే

> ## కొత్తగాలి...
>
> **అందుకుంటే**
> **అంగుళం దూరంలోనే**
> **అందుకోలేకపోతే**
> **ఆమడదూరంలోఉంది అదృష్టం**
>
> *–కలియుగం హుమాయున్ సంఘీర్,*
> *గోపాల్ పేట*

ఎండల భగభగలకు తట్టుకోలేని పూలతీగలా, కుమార్‌తో స్నేహం సమాజం ఎండలకి తట్టుకుని బతకలేదు. కనీసం సరోజ ఆనందంగా ఉంటే చాలు! శేష జీవితం అంతా తనకీ మౌన మధనం తప్పదు అనుకుంటూ ఒక రకమైన నిర్లిప్తతతో రోజులు వెళ్ళదీసింది. గతం జ్ఞాపకానికి రావడానికి ప్రయత్నిస్తుంటే దానిని అణచి పెట్టింది. కాని ఈవేళ అది ఎందుకో వీలవడంలేదు. ప్రభాకర్ ఇండియా వస్తున్నాడన్న వార్త, నిశ్చలంగా ఉన్న నీటిలో రాయిపడితే విస్తరిస్తున్న అలలుగా తన ఆలోచనలు విస్తరిల్లాయి. తిరిగి అల్లకల్లోలమైంది మనస్సు.

ప్రభాకర్ ఇండియా రాబోతున్నాడని సారథి ఫోన్ చేసిన దగ్గర నుంచి తనలో తీవ్ర సంచలనం మొదలైంది. ప్రభాకర్ తనని కలవడానికి వస్తాడా? అతను రాకపోతే తను హైద్రాబాద్ వెళ్ళి అతనిని చూసి వస్తుందా? అతను వచ్చి తనతో మాట్లాడితే బాగుండును. ప్రభాకర్ రావడం గురించి తనెందుకు ఇంత కలవరపడుతూ ఆలోచిస్తోంది. ప్రభాకర్ తనకి దూరపు బంధువు. అంతకన్నా ఏమీ కాదు. మరి అతని రాక గురించి ఎందుకు

ఈ ఆరాటం?

ప్రభాకర్! కుమార్‌ని తన జీవితంలోనికి అనుకోకుండా ప్రవేశపెట్టిన వ్యక్తి. రాజార వివర్మ పెయింటింగ్ తెమ్మని తనని కోరి, తద్వారా కుమార్‌ని తన జీవిత నాటకంలో రంగప్రవేశం చేయించాడు. ఆనాడు తనకి రవివర్మ పెయింటింగ్ దొరకకపోయినా బాగుండేదేమో. తన జీవితం గత ఏడెనిమిదేళ్ళుగా ఒడిదుడుకులకి లోనయ్యేది కాదేమో. అమ్మో! ఎలాంటి ఒడిదుడుకులో! అకాలంలో రామం మరణించడంతో మొదలంటూ నరికిన చెట్టులా పడిపోయి అత్యంత దుర్భరంగా రోజులు వెళ్ళదీస్తుంటే కుమార్‌తో పరిచయం అయింది. నిస్త్రాణంగా ఉన్న తన జీవితం, ఒక్కసారి నీళ్ళు, ఎరువూ జల్లి పెంచిన లతలా కొత్త కొత్త ఆకుల్ని వేసుకుంటూ బిలబిలా విస్తరిల్లింది, పూవులు విరగబూసింది. దాదాపు మూడు సంవత్సరాలు చాలా ఆనందంగా గడిచాయి. కాదు, జపాన్ దేశంలో పరిగెత్తే బుల్లెట్ రైలు వేగమంత వేగంతో పరిగెత్తాయి. అయితే బుల్లెట్ ట్రెయిన్ కూడా కూడలి దగ్గరికి వచ్చేసరికి ఒకే ఒక మార్గంలో పయనించగలదు. ఒకేసారి రెండు మార్గాలలో పయనించలేదు కదా! అమెరికాలో సారథి దగ్గర మూడేళ్ళు గడిపాక కుమార్‌తో స్నేహం గాఢమయ్యాక, ఇండియా తిరిగి రావడంతో జీవితపు పుస్తకంలో మరో కొత్త ప్రకరణం మొదలైంది. ఆ బుల్లెట్ రైలు నుంచి దిగక తప్పలేదు. ఇండియా తిరిగి రాకుండా ఉంటే జీవితం ఎలా నడిచేది. అని తను ఇప్పుడు ఊహించడంలో అర్థంలేదు.

'సారథీ, ప్రభాకర్ ఇండియా వస్తున్నాడని ఎందుకు తెలియపరచావు?' అనుకుంటూ అటూ ఇటూ పచార్లు చేసింది జలజ.

★ ★ ★

ప్రభాకర్ వచ్చి వెళ్ళాడు. పని కట్టుకుని హైదరాబాద్ నుంచి తనని చూడడానికి వచ్చిన అతడితో అరగంటకంటే ఎక్కువ గడపలేకపోయింది. ఇంటిలో అందరికీ ప్రభాకర్ తెలిసినవాడు కావడంతో అతను ఉన్నంతసేపూ అందరూ అతడి చుట్టూ చేరి కబుర్లలో నిమగ్నులయ్యారు. ఆఖర్న ప్రభాకర్ లేచి వెళ్తానంటే ఇతరులు అభ్యంతరం పెట్టడానికి కాని, తామూ వస్తామని అనడానికి కాని ఆస్కారం ఇవ్వకుండా, "నిన్ను ఆటో ఎక్కించి వస్తాను, పద" అని చెప్పి అతనితో బైటకి నడిచింది జలజ. ప్రభాకర్‌తో ఒంటరిగా మాట్లాడడానికి బైటికైతే వచ్చింది కాని, అతనితో సంభాషణ ఎలా మొదలు పెట్టాలో తెలియక గింజుకుంది. కాని తేరుకుని "నీ ఫ్రెండ్ కుమార్ ఇంకా న్యూయార్క్‌లోనే ఉన్నాడా? " అనడిగింది జలజ.

"లేదు. సంవత్సరన్నర క్రితం న్యూయార్క్ నుంచి అట్లాంటా, జార్జియాకి వెళ్ళిపోయాడు" అన్నాడు ప్రభాకర్.

"అదేమిటి, అతనికి న్యూయార్క్ అంటే చాలా ఇష్టం అనుకుంటా" అంది జలజ.

"కావచ్చు, కాని అతనే ట్రాన్స్‌ఫర్ కావాలని రిక్వెస్ట్ చేసుకుని న్యూయార్క్ వదిలేశాడు" అన్నాడు ప్రభాకర్.

"అవును చాలా కలుపుగోలు మనిషి. హుషారైనవాడు" అంది జలజ.

"పాజిటివ్ ఆలోచనాపరుడు. కాని కొన్నాళ్ళ క్రితం ఇక్కడికి వచ్చి వెళ్ళాక ఏమైందో ఏమో, అతని ధోరణిలో మార్పు వచ్చింది. గాలి తీసిన బెలూన్‌లా, చైతన్య రహితంగా మారిపోయాడు. ఒక్కసారిగా శరీరంలోంచి జీవం ఇగిరిపోయినట్లు నాకు అనిపించింది. అతనిలో అంత మార్పు వస్తుందనుకోలేదు. ఎవరైనా చెబితేనే నమ్మేవాడిని కాను కాని నేను స్వయంగా చూశాక ఆ నిజం గ్రహించాను.

పాపం ఏమైందో! నాతో అతను ఏమీ చర్చించలేదుకాని ఏదో పెద్ద దెబ్బే తగిలి ఉండాలి" అన్నాడు ప్రభాకర్. జలజ ఏమీ మాట్లాడలేదు వెంటనే.

కాస్సేపాగి, "నేను న్యూయార్క్‌లో ఉన్నపుడు అతడి రికమండేషన్ వల్లే నాకు ఒక ప్రైవేట్ స్కూల్లో వయొలిన్ పాఠాలు చెప్పే అవకాశం వచ్చింది. అదే నా మొదటి, ఆఖరి ఉద్యోగం. మూడువేల డాలర్లు ఆదా చేశాను తెలుసా? " అంది జలజ. కుమార్ గురించి ఎక్కువగా ప్రభాకర్‌తో చర్చించడం మంచిదో, కాదో తెలియక కుమార్ సహాయం చేసిన సంగతి కాకతాళీయంగా ప్రస్తావించింది అలా.

"ఆహా, అలాగా? అయితే నీకు కుమార్ బాగానే తెలుసునన్నమాట" అన్నాడు ప్రభాకర్ ఆ ప్రశ్నకి సమాధానం ఇవ్వకుండా.

"అతను కనిపిస్తే నేను అడిగానని చెప్పు" అంటూ ఖాళీగా వస్తున్న ఆటో రిక్షాని ఆపింది జలజ.

"మళ్ళీ సారథి దగ్గరికి వస్తే చూడడానికి వస్తావుగా. మరి నేవెళ్తాను బై" అంటూ ఆటోరిక్షా ఎక్కాడు ప్రభాకర్.

కుమార్ గురించి ఇతర విషయాలు ఏమైనా తెలుస్తాయేమోననుకున్న జలజకి ప్రభాకర్ ఏమీ చెప్పకపోవడంతో నిరాశ ఆవహించింది. కనుమరుగువుతున్న ఆటో రిక్షా వేపే చూస్తూ నిట్టూర్చి ఇంటివేపు తిరిగింది జలజ.

కుమార్ గురించి తనకింకా ఎందుకు ఆలోచనలు వస్తున్నాయి. ఆ ప్రకరణం ఆనాడే, కుమార్ మాట్లాడకుండా లేచి వెళ్ళడంతో ముగిసింది. ఆ ప్రకరణంలో ఆరోజు ఆఖరి పేజీ. తను, మనవరాలితో బంధం పెంచుకుని ఒక దారంబడి వెళ్తోంది. దూరంగా కుమార్, సంవత్సరాల తరబడి కనిపించకుండా తను ఎన్నుకున్న మార్గంలో పయనిస్తున్నాడు. అతడి ఆరోగ్యం ఎలా ఉందో! ప్రభాకర్‌ని తను అడగాల్సింది, అనుకుంటూ కుమార్ మీదకి వెళ్తున్న ఆలోచనల్ని చెదరకొడదామని వ్యర్థ ప్రయత్నం చేస్తూ, 'ఏదో పనిలో పడితేకాని ఈ ఆలోచనల్ని ఆపలేను' అనుకుంటూ తొందరగా అడుగులు వేసి వంటింటిలోకి చేరింది జలజ. పనిలోపడి కుమార్ గురించి ఆలోచనల్ని దూరంగా ఉంచినా, రాత్రి పడుకోవడానికి మంచం మీదకి చేరేసరికి పాత జ్ఞాపకాలు తిరిగి మెదడుని తొలచనారంభించాయి. వాటిని కట్టడి చేసే శక్తిలేక, నిద్రమాత్రల సీసా అందుకుంది జలజ. కుమార్ గురించి వార్తలు తెలుస్తాయని, ప్రభాకర్ రాక కోసం ఎంతో ఆసక్తి, కలవరపాటుతో ఆరు వారాలు గడిపాక ప్రభాకర్ వచ్చి వెళ్ళినా కుమార్ గురించి ప్రత్యేకంగా ఏమీ తెలియక మనస్సు బరువెక్కిన జలజ మెదడును నిద్రమాత్ర బుజ్జగించి నిద్రబుచ్చింది.



**కొత్తగాలి...**

**బయటకు**
**చిన్నమొక్కే**
**ఆ మొక్కకు భూమిలో**
**సుస్థిర వేరువ్యవస్థ**

**–మహ్మద్ అబ్దుల్ అజీజ్,** విశాఖపట్టణం

★ ★ ★

ప్రభాకర్‌కు ఇండియా వెళ్ళే ఉద్దేశం ఉందని తెలిసిన దగ్గరనుండి కుమార్‌కి అతడితో మాట్లాడదామని ఉంది. కాని ఏం మాట్లాడటం? అన్న ప్రశ్న మెదడులో

## దీన్నైతే అందరికీ పంచొచ్చు

**లిం**కన్ అమెరికా అధ్యక్షుడైన తర్వాత ప్రతిరోజూ ఎంతోమంది అతని దగ్గరికి వచ్చి తమ బాధలు చెప్పుకుని సాయమ ర్థించేవారు. అడిగినవారందరికీ సాయం చేయడం ఎవరికీ కుదరదు కదా? ఓసారి తట్టుతో బాధపడుతున్న తనకొడుకు టాడ్‌కు సపరిచర్యలు చేస్తుంటే ఆ వైరస్ వ్యాధి ఆయనకు కూడా సోకింది. ఆ విష యాన్ని సందర్శకులతో ఆయన చెబుతూ 'ప్రస్తుతం అడిగిన ప్రతివారికీ ఎంతో కొంత ఇచ్చేందుకు నా దగ్గర ఇది ఉంది' చమత్కా రంగా అనేసరికి అంతా ఒకటే నవ్వులు.



తలెత్తగానే ఎగిసిన ఉత్సాహం కాస్తా చల్ల బడుతోంది. పది రోజులు తర్జన భర్జన చేసుకుని, ఒకరోజు ధైర్యం చేసి ప్రభాకర్‌కి ఫోన్ చేశాడు. ప్రభాకర్ ఇంట్లో లేకపోవ డంతో "హమ్మయ్య!" అనుకుని ఫోన్ పెట్టే సినా, జలజ గురించి సమాచారమేమీ లభించలేదే అని మెదడు అలజడి చేస్తుంటే దానిని అదిమి రోజుల్ని నెట్టుకొ స్తున్నాడు కుమార్.

చలికాలం ఆరంభమైంది. ఒకరోజు సాయంకాలం ఏడు గంటలకి రెండడు గులు బైటవేసి వద్దామని ఎలివేటర్‌లోంచి కిందకి దిగగానే, ఎప్పుడూ జలజని పొగిడే కొన్సియర్ ఎదురుపడి కుమార్ పక్కనే నడుస్తూ, "ఈమధ్య మేడమ్ కనిపించ లేదు. ఇండియా వెళ్లేరేమో! షి ఈజే లవ్లీ లేడీ" అన్నాడు.

"ఈమధ్య కాలంలో మిమ్మల్ని నేను చూడలేదు. ఉద్యోగం మానేసి వెళ్లిపోయా రనుకున్నాను" అంటూ కొన్సియర్ వేసిన ప్రశ్నకు సమాధానం ఇవ్వకుండా తిరుగు ప్రశ్నవేశాడు కుమార్.

"అవును. నాకు హార్ట్ ఎటాక్ వచ్చింది. మా పిల్లల దగ్గర కొన్నాళ్లు ఉండి తేరుకు నేసరికి చాలాకాలం పట్టింది. నౌ ఐ యామ్ ఆల్‌రైట్. మేనేజ్‌మెంట్ తిరిగి పనిలోనికి తీసుకుంటామంటే వచ్చి చేరాను" అని తను కనిపించకపోవడానికి కారణాన్ని వివరించాడు కొన్సియర్.

"ఐయామ్ సారీ. నాకు ఈ సంగతి తెలి యదు. మీరు కనిపించలేదని మాత్రం పసికట్టేను" అన్నాడు కుమార్.

"నేనేమీ ప్రముఖ వ్యక్తిని కాను, అందరూ జ్ఞాపకం పెట్టుకోవడానికి. నేను లేనని మీరు గమనించానన్నారు థాంక్స్. ఈ ప్రపంచంలో ఎవరి పరుగు, ధోరణి వాళ్ళదే" అంటూ ఒక పేలవమైన నవ్వు నవ్వి, "యు లుక్ గుడ్ కాని ఎక్స్‌క్యూజ్ మి ఇలా అంటున్నందుకు. మేడమ్ మీ పక్కన ఉన్నప్పుడు మీలో చూసిన ఉత్సాహం ఇప్పుడు బాగా కొరవడింది. ఇలా అన్నానని మీరేమీ అనుకోకండి, ఎక్స్ క్యూజ్‌మి, మీ వ్యక్తిగత విషయం మాట్లా డినందుకు" అంటూ బిల్డింగ్‌లోంచి బైటకి వెళ్లే తలుపు తెరిచేడు కొన్సియర్.

కుమార్ బైటకి అడుగువేస్తూ, "డోంట్ వర్రీ, దీనిలో క్షమాపణ అడగవలసినంత తప్పేమీ నువ్వు చేయలేదు" అన్నాడు.

"కావచ్చు కాని ఇక్కడ ఇతరుల విషయా లలో తలదూర్చరుకదా, హేవ్ ఎ నైస్ వాక్" అంటూ వెనక్కి తిరిగేడు కొన్సెయర్.

బిల్డింగ్‌లోంచి బైటకి రాగానే చలిగాలి మొహాన్ని సూదులతో గుచ్చినట్లు తగి లింది. మఫ్లర్‌ని గట్టిగా చుట్టుకుని, దానిని గ్లవ్స్‌తో అదిమి ఉంచి రెండు వీధులు నడి చేసరికి చేతివేళ్ళు వంకరలు తిరగడం మొదలుపెట్టేయి. నడకకోసం ముందరకి

వెళ్లే ప్రయత్నాన్ని విరమించి ఇంటివేపు వెనక్కి తిరిగాడు కుమార్. విపరీతమైన చల్లదనం నుంచి డెబ్బై రెండు డిగ్రీల ఫారన్‌హీట్ ఉష్ణోగ్రత నెలకొన్న ఫ్లాట్‌లోనికి రాగానే, గ్లవ్స్, మఫ్లర్ వేసుకున్న కోటు తీసేలోగా చెమటలు పట్టనారంభించాయి కుమార్‌కి. పది నిమిషాల్లో ఫ్లాట్‌లో ఉష్ణోగ్రతకి అలవాటుపడిన శరీరం శాంతించి, మెదడులో ఆలోచనల్ని రేకెత్తించింది.

"మేడమ్ ఈ మధ్య కనిపించలేదు" అన్న కొన్సియర్ మాటలు జ్ఞాపకానికి రాగా, 'ఈ మధ్య ఏమిటి చాలాకాలంగా కనిపించలేదు' అనుకున్నాడు కుమార్. తనను పొగిడే కొన్సియర్ అంటే ఇష్టం జలజకి. తను దానికి స్పందించిన తరహా చూసి జలజ ఎలా నవ్వేదో! ఎన్నాళ్ళయిందో జలజ నవ్వు చూసి.

మార్పు! అది మనకు నచ్చనిదైతే బాధాకరమే అవుతుంది. మనలో ఏదైనా వెలితి ఉంటే, దానిని పూడ్చే వ్యక్తి తటస్థపడి బంధం ఏర్పడితే ఆ మార్పు ఆనందదాయకం. ఆ మార్పుకు అలవాటుపడుతుంటే, ఏ కారణం చేతనైనా ఆ వ్యక్తికి దూరమై బంధం సడలితే, తిరిగి వెలితి బైటకి ఎగిసి అశాంతికి దారితీస్తుంది, అంటారు వేదాంతులు. తమలో లోపం ఉన్నా తిరిగి ఆ వెలితికి కారణమైన వ్యక్తిని నిందిస్తారు. జలజతో బంధం ఏర్పడక ముందు, తను ఒంటరిగా వెలితి లేని జీవితం వెళ్లదీసేవాడు. జలజ వలన తన జీవితం కొత్త మెరుగులు దిద్దుకుంది. ఆమె నిష్క్రమించాక ఆ మెరుగులు కరిగిపోయాయి. అంతే! ఇతరుల రాకపోకల వల్ల, వాళ్ల ప్రవర్తన వల్ల బాధ కలగకపోతే ఏ మార్పు మనమీద ప్రభావం చూపవంటారు విజ్ఞులు. జలజ తనలో వెలితి పూడ్చకపోతే, ఆమె వెళ్లాక తనలో అశాంతి ఎందుకు జనించింది? తనకు అనుకూలమైన దారిలో పయనిస్తోంది జలజ. ఆమెను ప్రాధేయపడికానీ, ఇతరత్రా ఆమెతో తన బంధాన్ని పునరుద్ధరించడు, పునరుద్ధరించలేడు. దూరంనుంచే, ఆమె జీవితం ప్రశాంతంగా గడవాలని కోరుకుంటాననుకుంటూ రిమోట్ కంట్రోల్ అందుకుని టి.వి.ని ఆన్‌చేసి కదులుతున్న బొమ్మలకేసి శూన్య దృక్కులతో చూడసాగేడు కుమార్.




"మీకు కేన్సర్ అన్నమాట నిజమే అయినా, అది అత్యంత ప్రాథమిక దశలో ఉందని మెమోగ్రామ్, ఇతర రిపోర్ట్‌లు చెబుతున్నాయి. కీమోథెరపీతో పూర్తిగా నయమవుతుందన్న నమ్మకం నాకుంది. భరోసా కూడా ఇవ్వగలను. కాని కీమోథెరపీ వైద్యం చేస్తున్నప్పుడు వికారం, వాంతులు అవడం, గీరగా ఉండడమే కాకుండా బాగా నీరసంగా ఉంటుంది. కొందరి విషయాల్లో మోతాదుకి మించి జుత్తు ఊడిపోవడం కూడా జరుగుతుంది. తిండిమీద ఆసక్తి సన్నగిల్లుతుంది. అయితే ఈ మార్పులన్నీ కేవలం తాత్కాలికమే. మీరు వైద్యానికి ఎంత త్వరగా వస్తే అంత మంచిది. మీరు ఇతరత్రా చాలా ఆరోగ్యంగా ఉన్నారు కాబట్టి ఏ కాంప్లికేషన్లు ఉండకూడదు" అన్నాడు డాక్టర్ రాయుడు జలజతో.

జలజ మాట్లాడకుండా అతడిని చూస్తూ, ప్రభాకర్ డాక్టర్ రాయుడు గురించి రాసిన వాక్యాలను జ్ఞాపకానికి తెచ్చుకుంది. "రాజమండ్రిలో చాలా హాస్పిటల్స్ ఉన్నాయి. అవన్నీ డబ్బులు గుంజి, రోగిని పిప్పి పిప్పి చేసేవే. రాజమండ్రి ఒక్కటే కాదు, అన్ని ఊర్లలోనూ అంతే అనుకో. దానవాయిపేటలో నాకు తెలిసిన ఒక మంచి డాక్టర్ ఉన్నాడు. అతని ఎడ్రస్ దిగువ రాస్తున్నాను. ఏదైనా అవసరమైతే ఆయనను సంప్రదించు. ఆయనని చూసి, "పీటర్ ఇంగ్లండ్" చొక్కా వేసుకోలేదే ఇతను డాక్టరేమిటి? అన్న అనుమానం నీకు రావచ్చు. నాకు వ్యక్తిగతంగా ఆయన వైద్య సామర్థ్యం తెలియదు. కాని అతను చేసే రోగనిర్ధారణ చాలా విశిష్టమైనదని నాకు నలుగురైదుగురు చెప్పారు. నాకు తెలిసిన ఇంకో డాక్టర్‌కి కూడా డాక్టర్ రాయుడు మీద సదభిప్రాయం ఉంది. వెళ్ళి చూడు" అని రాశాడు ప్రభాకర్.

అవును, ఇతను డాక్టర్‌లాగా లేడు. అధునాతనంగా లేని క్లినిక్‌లో రోగుల కోసం వేసిన కుర్చీలు పెళ్ళిళ్ల కోసం అద్దెకి లభించే కుర్చీల్లా ఉన్నాయి. కనీసం ఒక్క రోగి కూడా క్లినిక్‌లో లేడు. ఒకరకమైన మంద కొడితనం ఆవహించి ఉన్న డాక్టర్ రాయుడు కూర్చున్న గది గోడలమీద వెలవెలపోతున్న రాధాకృష్ణుల పటం వంకరగా వేలాడుతోంది. ఇంకో గోడమీద, "ముల్లు గుచ్చుకుందని బాధపడకు, గాజుపెంకు గుచ్చుకోలేదని సంతోషించు" లాంటి వేదాంతం కాని వేదాంతం రాసివున్న కాగితం గాలికి రెపరెపా కొట్టుకుని బలం క్షీణించి 'ఇహ నేకిందికి పడిపోతాను' అన్నట్లుగా ఉంది.

క్లినిక్‌లోనికి అడుగు పెట్టగానే "డాక్టర్ గారు ఉన్నారా? " అనడిగితే సమాధానం చెప్పడానికి ఓ బల్లమీద పదమూడు పధ్నాలుగేళ్ల వయస్సుగల కుర్రాడు కూర్చున్న తరహా, గదిలో నెలకొని ఉన్న స్తబ్ద వాతావరణం జలజలో ఏమీ ధైర్యం కలగచేయలేదు.

"లోపలికి వెళ్లండి" అన్నాడు కుర్రాడు ఏమీ పట్టనట్టు. లోపలికి ప్రవేశించిన జలజకి రాయుడి ఆకృతిగాని, దుస్తులుగాని ఉత్సాహాన్ని, ధైర్యాన్ని ఇవ్వలేదు.

డాక్టర్ రాయుడు, "బలంగా ఊపిరి పీల్చండి" అంటూ స్టెతస్కోప్‌ని వీపుమీద పెట్టి మాట్లాడినప్పుడు ఘాటైన సిగరెట్ వాసన తన్నుకు వచ్చింది. డాక్టర్ రాయుడు కనీసం రెండు ప్యాకెట్లు సిగరెట్లు కాలుస్తాడేమో! అతని శరీరం మీద నుంచి వచ్చిన సిగరెట్ కంపు గదంతా వ్యాపించి ఉంది. మూడు పాకెట్లు కాలుస్తాడేమో! అయినా అది తనకి అనవసరం అనుకుంది జలజ. డాక్టరై ఉండి, సిగరెట్లు ఆరోగ్యానికి హానికరమని తెలిసినా తాగుతున్నాడంటే అతడి సలహామీద తనకి నమ్మకం ఎలా కుదురుతుంది? అనుకుంటూ, "మీ ఫీజు? " అనడిగింది జలజ డాక్టర్ రాయుడు పరీక్ష పూర్తయ్యేక.

"ఏభై" అన్నాడు డాక్టర్ రాయుడు.

"అంతేనా? " అంటూ ఆశ్చర్యపడింది జలజ.

"నే ఇచ్చిన సలహాకి ఫీజు అంతే" అన్నాడు డాక్టర్ రాయుడు నవ్వుతూ.

"త్వరలో కనిపిస్తాను" అంటూ జలజ హ్యాండ్‌బ్యాగ్ అందుకుని డాక్టర్ గది లోంచి బైటకి వచ్చింది. గోళ్లు కొరకడంలో నిమగ్నుడై ఉన్న కుర్రాడు, గోళ్లు ఇంకా మిగిలి ఉన్నాయా? అనుకుంటూ చేతివేళ్ల గోళ్లను చూసుకుంటూ జలజ గురించి పట్టించుకోలేదు.

"త్వరలో కనిపిస్తాను" అంటే వైద్యానికి వస్తాననా? లేక రోగం గురించి ప్రశ్నలు వేయడానికి వస్తాననా? దానికి అర్థం

చతుర ప్రపంచం

# గుర్రాల కబేళాలు!

అమెరికాలో చాలామంది గుర్రాలని పెంచుకొంటారు. కారణం వాటిచేత పనిచేయించడం లేదా పెంపుడు జంతువులుగా ఉపయోగించుకోవడం. అమెరికాలో గుర్రపు మాంసం తినరు. కాని యూరప్‌లో నివసించే కొన్ని ఆసియా దేశాల ప్రజలు దాన్ని ఇష్టంగా తింటారు. దాంతో అమెరికన్ వ్యాపారస్థులు గుర్రం మాంసాన్ని ఆయా దేశాలకి ఎగుమతి చేయసాగారు. దాంతో సెనేటర్ జాన్‌ఎన్‌సైన్ వాటి రక్షణ కోసం పోరాడి ఓ బిల్లు వచ్చేలా చేశాడు. అమెరికాలోని ఆర్థిక వనరులు ఉపయోగించి గుర్రపు మాంసాన్ని విదేశాలకు ఎగుమతి చేసే వ్యాపారాన్ని ఆ బిల్లు నిషేధించింది. అగ్రికల్చర్ అప్రాప్రియేషన్స్ అనే ఈ బిల్లు పాసైనా పెద్దగా ఫలితం చేకూరలేదు. అమెరికన్ వ్యాపారస్థులు ఈ వ్యాపారంలోంచి తప్పుకున్నా విదేశీ సంస్థలు రంగప్రవేశం చేసాయి.

గుర్రపు మాంసం వ్యాపారస్థులు అమెరికా అంతటా జంతువులని వేలం వేసే ప్రదేశాలకి వెళ్ళి వీటిని కొంటారు. వాటి యజమానులకి ఈ జంతువులని మాంసం కోసం చంపుతారని కూడా తెలీదు. మరో చోట ఇవి సహజంగా మరణించేదాకా జీవిస్తాయనుకుని ఎక్కువ ధరకి పాడే ఆ వ్యాపారుస్థులకి తమ గుర్రాలని అమ్ముతారు.

గుర్రాల కష్టాలు వాటి యజమానుల నించి దూరమయ్యాక మెదలవుతాయి. వీటిని ట్రక్కుల్లో కిక్కిరిసేలా వుంచి, ఎక్కువ దూరం రవాణా చేస్తారు. దారిలో వాటికి ఆహారం, మంచి నీళ్ళు ఇవ్వరు. ట్రక్ లోపల అవి తలలు పైకెత్తేంత ఖాళీ కూడా వుండదు. చంపేముందు వాటిని ఓ వరసలో నిలబెడతారు. మేకలు, కోళ్ళల్లా కాక గుర్రాలకి ప్రమాదాలని గ్రహించే శక్తి వుంటుందని నిపుణులు చెబుతున్నారు. వాటిని చంపే విధానం కూడా కర్కశంగా వుంటుంది. 'కిల్ బాక్స్' అనే పెట్టెలోకి పంపి కరెంట్ షాక్‌తో చంపుతారు. వాటిలో కొన్ని వెంటనే చావక వణికిపోయి కింద పడిపోతాయి. అప్పుడు ఓ ప్రత్యేక తుపాకీతో నాలుగు అంగుళాల ఇనుపసూది వాటి తలలో దిగేలా కాలుస్తారు. అది గుచ్చుకోగానే వెంటనే మరణించవు కానీ స్పృహ తప్పుతాయి. కొన్ని స్పృహలోనే వుంటాయి. అప్పుడు వాటి కాళ్ళు కట్టేసి పైకి లేపి గొంతుకోసి చంపుతారు. తర్వాత వాటి మాంసాన్ని తీసి, పేక్‌చేసి డీప్‌ఫ్రీజ్ చేసి విదేశాలకి ఎగుమతి చేస్తారు.

అమెరికాలో గుర్రాలని చంపి ఇలా మాంసాన్ని ఎగుమతి చేసే కబేళాలు మూడు వున్నాయి. వాటి యజమానుల విదేశస్థులు. అక్కడ కుక్కల్లా, పిల్లుల్లా గుర్రాలని కూడా ప్రేమగా పెంచుకుంటారు. ముఖ్యంగా ఫ్లోరిడా, టెక్సాస్, కాలిఫోర్నియా రాష్ట్రాల్లోని ధనవంతులు తమ రాంచ్‌లలో గుర్రాలని పెంచుకుంటారు. అమెరికన్ చరిత్రలో గుర్రాలకి ఓ విశిష్టస్థానం వుంది. కౌబోయ్ సినిమాలు చూస్తే వాటి ప్రాముఖ్యత మనకి అర్థమవుతుంది.

రైలుబళ్ళు రాక మునుపు ప్రజలు గుర్రాలనే రవాణా సౌకర్యంగా వాడేవారు. వెల్స్‌ఫార్గో అనే అమెరికన్ బేంక్ లోగో 'బండిని తోలే ఆరుగుర్రాలు'. సెప్టెంబర్ 2005లో జాన్ ఎన్‌సైన్ ఆ బిల్లు తెచ్చేదాకా అమెరికన్స్‌లో ఎవరికీ గుర్రపు మాంసపు వ్యాపారం గురించి తెలీదు. కొంచెం తెలిసినా వేలల్లో వాటిని ఎవరు కొంటారో, వాటిగతి ఏమిటో తెలీదు.



ఏమిటి? ఈవిడ లౌక్యంగా మాటలాడు తుందా? " అనుకుంటూ సిగరెట్ పాకెట్ అందుకున్నాడు డాక్టర్ రాయుడు. ఖాళీ సిగరెట్ పాకెట్ చేతికి తగిలింది.

"గోపీ" అంటూ కుర్రవాడిని పిలిచి, సిగరెట్ పాకెట్ తీసుకురమ్మని పంపి ఆలోచనలో పడ్డాడు డాక్టర్ రాయుడు.

"మీకు కేన్సర్ మొదటి దశ" అన్నాడు డాక్టర్ రాయుడు ఒక గంట క్రితం.

కుమార్ మళ్లీ ఆమె ఆలోచనలోనికి వచ్చాడు.

ఒకరోజు తను కళ్లు నలుపుకోవడం కని పెట్టి "ఏమిటి కళ్లని అలా నలిపేస్తున్నారు? " అనడిగాడు కుమార్.

"కంటిలో ఏదో నలకపడి గుచ్చుకుంటున్నట్లనిపిస్తోంది, కంటి నుండి నీళ్లు వస్తున్నాయి" అంది తను.

దగ్గరగా వచ్చి "ఏదీ నన్ను చూడనీయండి" అంటూ రెండు చేతులతో కంటి రెప్పల్ని బాగా తెరచి, బలంగా కంటిలోకి గాలి ఊదాడు కుమార్. అర నిమిషంపాటు, ఆ బాధ తగ్గినట్లనిపించినా, నొప్పి మళ్లీ మొదలవడంతో మళ్లీ కళ్లు నులుముకోవడం మొదలుపెట్టింది తను.

"మీ కంటి రెప్పల కింద అంతా ఎర్రగా ఉంది. ఏదో ఇన్ఫెక్షన్‌లా అనిపిస్తోంది. కళ్ల డాక్టర్ దగ్గరికి వెళ్దాం" అన్నాడు కుమార్.

"నీకేం పిచ్చా? ఈమాత్రం దానికే డాక్టర్ దగ్గరకి ఎందుకు? టెలివిజన్‌లో ఎడ్వర్టయిజ్ చేసే 'క్లియర్ ఐస్' మందు చుక్కలు వేసుకుంటే రేపటికి తగ్గిపోతుంది. అదీకాక డాక్టర్ దగ్గరికి వెళ్లి చూపించుకోవడానికి నాకు హెల్త్ ఇన్స్యూరెన్స్ లేదు" అంది తను.

"హెల్త్ ఇన్స్యూరెన్స్ లేని నలభై మిలియన్ల అమెరికన్ పౌరులలో మీరొకరు. నేను తరచూ వెళ్లే ఫిజీషియన్ దగ్గరకి వెళ్దాం. అతనికి ఫోన్‌చేసి నిన్ను చూడగలడేమో కనుక్కుంటాను" అంటూ కుమార్ లేవబోయాడు.

"వద్దు, నేను రాను" అంది తను ఖచ్చితంగా. కుమార్ తనవేపే చూస్తుంటే, "నేను చెబుతున్నానుగా, ఇదేమీ ఇన్ఫెక్షన్ కాదు" అంది తను.

"మీరెంత చెప్పినా ఊరుకోవడానికి నాకు మనస్కరించడంలేదు. కాలికో, చేతికో అయితే ఫరవాలేదని నిర్లక్ష్యంగా ఊరుకోవచ్చు కాని కళ్లు! అమ్మో, వాటికేమైనా అయితే ఇంకేమైనా ఉందా? " అంటూ కుమార్ పడుతున్న ఆరాటాన్ని చూసి తను ఇంకేమీ మాట్లాడలేదు. కుమార్‌కి తెలిసిన ఫిజీషియన్ బిజీగా ఉండడంతో, అతను ప్రతిపాదించిన కళ్ల డాక్టర్‌ని చూడడానికి వెళ్లారు ఇద్దరూ.

ముందర నర్స్ వచ్చి, ఏవేవో ప్రశ్నలు వేసి, ఇన్స్యూరెన్స్ ఉందో, లేదో అని ఆరా తీసి "ఈ గదిలో కూర్చోండి డాక్టర్‌గారు వచ్చి చూస్తారు" అంటూ ఇద్దర్నీ ఒక అందమైన గదిలో కూర్చోపెట్టి వెళ్లింది. ఇరవై నిమిషాలు గడిచాక, టినోపాల్ ధారాళంగా వాడి ఉతికిన మల్లెపూవు రంగు ఓవరాల్‌తో డాక్టర్ లోపలికి వచ్చి,

"యూ లుక్ లవ్లీ ఎండ్ హెల్తీ, వాటీజ్ ది ప్రాబ్లెమ్? " అనడిగాడు తనని. తను కంటి గురించి వివరించి, "క్లియర్ ఐస్" కంటి చుక్కల్ని వాడుతున్నానని చెప్పింది.

"మీ కంటి రెప్పల మీదున్న వెంట్రుకలు కంటిలో గుచ్చుకోవడంవలనో, లేదా గుడ్డు వెనకాల నీళ్లు ఉండేచోట రవ్వంత ప్రెషర్ ఎక్కువయినా, లేక ఏదైనా ఎలర్జీ వల్ల ఇలా నీళ్లు వస్తాయి. మీరు వాడుతున్న కంటి చుక్కలకన్నా మంచి మందు నేనేమీ ఇవ్వలేను. హేవ్ ఎ నైస్‌డే. మీకు ఈ చీర బాగా నప్పింది" అంటూ కేవలం ఇరవై సెకన్లు తమతో గడిపి తుర్రుమన్నాడు.

బైటికి నడుస్తూ, కౌంటర్ దగ్గర కుమార్ ఫీజు కట్టేక పార్క్ చేసిన కారువేపు నడుస్తుంటే, "ఎంత ఫీజ్" అనడిగింది తను. "నూట ఇరవై డాలర్లు" అన్నాడు కుమార్.

"జలుబు వదిలిందా? మంచి శాస్తి అయింది" అంది తను.

తనవేపు విచిత్రంగా చూసి, "మరేం పరవాలేదు. నేను గమ్మున ఊరుకున్నాక, మీ కళ్లకి ఏదైనా అయితే నన్ను నేను క్షమించుకోలేను" అన్నాడు కుమార్.

కుమార్ ప్రదర్శించిన ఆసక్తికి, మనస్సులోనే తెగ మెచ్చుకుంది ఆరోజు.

"ఇతరత్రా మీరు ఆరోగ్యంగా ఉన్నారు కాబట్టి ఎలాంటి కాంప్లికేషన్లు ఉండకూడదు" అన్నాడు డాక్టర్ రాయుడు ఇందాక. అరవై ఏళ్లు చేరుకుంటున్న తనకి ఆరోగ్యం బాగానే ఉన్నప్పటికీ ప్రాబ్లెమ్స్ లేకపోవడమేమిటి? అయితే అవి గడ్డువి కావు. తన కంటే కుమార్ ఏడేళ్లు చిన్నవాడు, అంటే అతని వయస్సు ఇప్పుడు ఏభైమూడు. అతనికి ఏదైనా ఆరోగ్య సమస్యలు మొదలయ్యాయా? తన ఆరోగ్యం గురించి మొదలయిన ఆలోచన కుమార్ ఆరోగ్యం గురించి సాగుతోందెందుకు? పదే పదే అతని చుట్టూ తన మెదడు ఎందుకు పరిభ్రమిస్తోంది? అనుకుంటూ తల పట్టుకుంది జలజ.

"మన ఊళ్లో ఉన్న ఒక మంచి రేడియాలజిస్ట్ కావాలోయ్. నా దగ్గరికి ఒక పేషెంట్ వచ్చింది. బయాప్సీ రిపోర్టు బట్టి చూస్తే ఇప్పుడిప్పుడే కేన్సర్‌గా మారింది. కీమూ చేస్తే పూర్తిగా నయమవుతుంది" అన్నాడు. రాయుడు. క్రిస్టల్ గ్లాసులో వేసిన ఐస్‌క్యూబ్‌లమీద పోసిన షివాజ్ రీగల్ విస్కీ ఐస్‌కి ఉన్న చల్లదనాన్ని అరువు తెచ్చుకుని కిందకి దిగి చలితో ఒణుకుతోంది. కాస్సేపు విస్కీని చల్లపడనిచ్చి, వేయించిన జీడిపప్పు పలుకును తింటూ విస్కీ గ్లాసందుకున్నాడు

## కొత్తగాలి...

**అక్షరం**
**భావాలకు ఊపిరిపోస్తుంది**
**ఆయుధం**
**ఉన్న ఊపిరి తీస్తుంది**

*–తలకట్ల మహీపాల్‌రెడ్డి, హైదరాబాద్*

రాయుడు. పొగరు, ఉష్ణోగ్రత చల్లపడి షివాజ్ రీగల్ విస్కీ శరీరంలోకి ప్రవేశించగానే రాయుడిలో ఉత్సాహం వచ్చినట్లనిపించింది సుబ్బారావ్‌కి.

"అపోలో హాస్పిటల్‌కి వెళ్తే, అంతా వాళ్ళే చూసుకుంటారు" అన్నాడు సుబ్బారావు.

"వాళ్ళ దగ్గరికి వెళ్తే కేన్సర్ వ్యాధి నయమయినా, అవకపోయినా వాళ్ళ ఫీజు ఇచ్చుకోలేక ఆమె చనిపోతుంది" అన్నాడు రాయుడు జలజని జ్ఞాపకానికి తెచ్చుకుంటూ.

డా॥ రాయుడు, సుబ్బారావులు చిరకాల మిత్రులు. సుబ్బారావు ఇంజినీరింగ్ విభాగంలో డిగ్రీ తీసుకున్నాక హైదరాబాద్‌లో చాలాకాలం పనిచేసి, వాలంటరీ రిటైర్‌మెంట్, స్వంత ఊరయిన రాజమండ్రిలో స్థిరపడ్డాడు. రాయుడు రాజమండ్రి నివాసే.

అనూహ్యమైన పరిస్థితులలో మెడిసిన్ చదువు మధ్యలో ఆగి, కొన్నాళ్ళుపోయాక తిరిగి చదువు మొదలుపెట్టి ఆలస్యంగా డిగ్రీ తెచ్చుకోవడంతో చాలాకాలం వ్యర్థమయింది. డిగ్రీ పుచ్చుకున్నాక, డాక్టర్ రాయుడు ప్రాక్టీస్ పెంపొందించుకోవడానికి ఏమీ ప్రయత్నం చేయకపోవడంతో, క్లినిక్ నడక మందకొడిగా సాగింది. రాయుడికి రోగి ముఖ్యం, రోగనిర్ధారణ

ముఖ్యం, రోగ నివారణ అతిముఖ్యం. రోగి ధనవంతుడా, పేదవాడా అన్నది గణనలోనికి రాదు. నిజానికి రాయుడికి బీదలకి వైద్యం చేయడమంటేనే ఇష్టం. జీవితంలో సర్వసామాన్యమైన ఒడిదుడుకులను తట్టుకుని, ఒక రకమైన నిశ్చలత ఉన్న సుబ్బారావుకి, కల్లోలాలతో అతలాకుతలమై జీవితాన్ని నెట్టిన రాయుడు మధ్య గల స్నేహాన్ని కాలం, పరిస్థితులు ఏ మాత్రమూ సడలించలేదు.

"ఏదైనా తెలిసిన ప్రైవేట్ నర్సింగ్‌హోమ్‌లో రేడియేషన్ మెషీన్ ఉండి కీమోథెరపీ చేయడానికి సదుపాయం ఉంటే నేను వైద్యం చేయగలను. నేను ఇతర డాక్టర్లతో భుజం భుజం రాసుకోకుండా ఉందును కాబట్టి నాకా విషయాలు తెలియవు. నువ్వే వాకబు చేసి ఈ సమాచారం సేకరించాలోయ్" అన్నాడు రాయుడు.

"ఉన్నపళంగా నువ్వు అడిగిన సమాచారం నా దగ్గర లేదు. రేపు ఒకరిద్దరిని వాకబు చేస్తే తెలుస్తుంది. ఫోన్ చేద్దామంటే నీకు టెలిఫోన్ లేదు. సమాచారం లభిస్తే కబురు పంపుతాను, లేకపోతే రేపు సాయంకాలం నువ్వు వచ్చినప్పుడు చెబుతాను" అన్నాడు సుబ్బారావ్.

★ ★ ★

"నాకు తెలిసిన ఒక నర్సింగ్ హోమ్‌లో కావాలంటే మీకు ట్రీట్‌మెంట్ జరుగుతుంది. ఒకరోజు మీరు నర్సింగ్‌హోమ్‌లో ఉండిపోవాల్సి వస్తుంది. ఆ రోజు మీకు ఒక తోడు కావాలి" అంటూ సంభాషణని మొదలు పెట్టాడు డాక్టర్ రాయుడు.

జలజ ఏమీ సమాధానమీయకపోవడంతో ఆమెవేపు పరీక్షగా చూశాడు.

"ఈ ట్రీట్‌మెంట్ అవసరమంటారా? అదే నేను ఇంకా నిర్ణయించుకోలేదు. మీరు చెప్పినదే సరయినదన్న నమ్మకం ఏమిటి? అనవసరంగా శరీరంలోనికి మందులు ప్రవేశపెట్టడం నాకిష్టం లేదు. ఇది చేయించుకోకపోతే ఏమౌతుంది?" అనడిగింది జలజ.

"మీరు నా దగ్గరికి ఎందుకు వచ్చారు? మీ ఆరోగ్యం బాగులేదనిపించి. ఎందుకు బాగోలేదో కనుక్కొని నయం చేయించుకుందామనే కదా. నాకున్న వైద్య అవగాహన, నా అనుభవం బట్టి మీ ఆరోగ్య పరిస్థితి వివరించి, ఏం చేయాలో చెప్పాను. నే చేసిన రోగ నిర్ధారణ సరయినదన్న నమ్మకం ఏమిటి? అనడిగారు. ఇంకో డాక్టర్‌ని సంప్రదించవచ్చు. ఒకవేళ వాళ్లూ నేచేసినట్టే రోగ నిర్ధారణ చేస్తే మీరు మళ్ళీ ప్రశ్న వేస్తారా? మూడవ డాక్టర్, నాల్గవ డాక్టర్ దగ్గరకి వెళతారా? మీకు నచ్చినట్లు చెప్పే డాక్టర్ దొరికేవరకు తిరుగుతూ ఉండవచ్చు. డాక్టర్ మీద, అతని సామర్థ్యం మీద నమ్మకం అవసరం. సందేహ నివృత్తి కోసం, ఏదైనా పొరపాటు జరగకుండా ఖచ్చితంగా రోగం అదే అని తెలుసుకోవడానికి ఇంకో డాక్టర్ దగ్గరికి వెళ్ళి అడగవచ్చు. రెండవది, ఇది చేయించుకోకపోతే ఏమౌతుంది? అన్నదానికి ఏ డాక్టర్‌ని అడిగినా ఒక్కటే చెబుతాడు. రోగం నే చెప్పినదే అయితే క్రమేణా రొమ్ములో గడ్డ పెద్దదవుతుంది. రొమ్ము పూర్తిగా తీసేసి అప్పుడు క్యాన్సర్ నివారణకి నడుం కడతారు. అప్పటికి రోగం ఇతర అంగాలకి వ్యాపించకుండా ఉంటే ఫరవా లేదు కాని రోగం ఇతర అంగాలకి వ్యాపించివుంటే 'సెకండరీస్' కనపడతాయి. ఆ తరువాత అట్టే వ్యవధి ఉండదు. అందరికీ త్వరలో 'బై' 'బై'లు చెప్పేయవచ్చు. శరీరంలోకి మందులు అనవసరంగా ప్రవేశపెట్టడం నాకిష్టం లేదు అన్నారు. నేను కమర్షియల్ డాక్టర్‌ని కాను. మీ శరీరానికి ఏ మందు సరయినదనిపిస్తే ఆ మందులే ఇస్తాను. వైద్యానికి నా దగ్గరకి వచ్చి

రోగం ఏమిటో, దానికి ఏ వైద్యం చేయాలో, ఎలాంటి వైద్యం చేయాలో, అసలు వైద్యం అవసరమో కాదో అని అనుమానించే వాళ్ళకి నేను వైద్యం చేయలేను. అలాంటి వాళ్ళు తమకి తామే వైద్యం చేసుకోవడం మంచిదని నా వ్యక్తిగత అభిప్రాయం" అన్నాడు డాక్టర్ రాయుడు.

"జీవితంలో నేను చాలామందిని చూశాను. ఈ డాక్టర్లందరూ ట్రయల్ అండ్ ఎర్రర్ మీద వైద్యం మొదలుపెడతారు. నా శరీరం గురించి నాకు తెలిసినంత ఏ డాక్టర్‌కీ తెలియదు" అంది జలజ వాదనని పెంచుతూ.

"మీ శరీరం గురించి మీకు తెలిసినంత ఇంకెవరికీ తెలియదన్నది నూటికి నూరుపాళ్ళు నిజం. మీ శరీరంలో జరిగే, కనిపించే మానసిక, శారీరక మార్పులు వివరిస్తే, మీరు ఉదహరించిన కారణాల ఆధారంగా నిర్ధారణ కోసం సరి అయిన పరీక్షలు చేసి వాటి ఫలితాలని బట్టి రోగ నిర్ణయం చేస్తాడు డాక్టర్. మీ అంతట మీరు మీ రోగ నిర్ణయం చేయడానికి ఆధారం ఏమిటి? మీకున్న అనుభవమా? మీకు ఎలాంటి అనుభవం ఉంది? మీ స్నేహితులు, బంధువులు చెప్పిన సమాచారం బట్టి, వాళ్ళ రోగ నిర్ధారణని ఒక డాక్టర్ చేస్తే అది జ్ఞాపకం ఉంచుకుని ఇదీ అదే అని నిర్ణయానికి వస్తున్నారా? వాళ్ళ శరీరం మీ శరీరం ఒక్కలాగే రియాక్ట్ అయ్యాయన్న గ్యారంటీ ఏమిటి? బజారుకి వెళ్ళి ఒక పావుకిలో వంకాయలు కొంటారు. ఎనిమిది వంకాయలు తూగేయి. తరగడం మొదలుపెడితే, దానిలో నాలుగు వంకాయలలో పుచ్చులున్నాయి. మీరు ప్రపంచంలో ఉన్న వంకాయలలో సగం పుచ్చువి అన్న నిర్ధారణకి వస్తే అది సరయినదేనా? వైద్యులు పొరపాట్లు చేయరని నేను అనడం లేదు. ఇదిగో ఈ రెండువేల పేజీలున్న పుస్తకంలో జబ్బులు, వాటి చిహ్నాలు అవి వస్తే ఎలాంటి వైద్యం చేయాలి? ఏ మందులు ఇస్తే రోగికి ఎలాంటి రియాక్షన్ వస్తుందో ఉదహరించి ఉంది. చదవడం మొదలుపెడితే చాలా జబ్బులకి బైటకి కనపడే లక్షణాలు ఒకేలా ఉంటాయి. మీరు, మీ శరీరం గురించి తెలుసుననుకుని, మీ వైద్యాన్ని నిర్ణయించుకునే దానికన్నా వైద్యుడు చేసే నిర్ధారణకి ఆధారం ఎక్కువ. ఇవన్నీ ఎందుకు? మీరు ఇంకో వైద్యుడిని సంప్రదించండి" అన్నాడు రాయుడు. ఇంకేమీ మాట్లాడానికిలేదన్నట్లుగా సిగరెట్ తీసి వెలిగించాడు.

జలజ మౌనంగా లేచి నిలబడి బైటకి నడిచింది.

## 5



**గ**తం మరొకసారి రాయుడు ముందర నిలుచుంది. 'మరచిపో, మరచిపో' అని చీత్కారం చేసి కసిరినా, బ్రతిమిలాడి ఎంత ప్రయత్నించినా 'ఆ గతం' మెదడులో ఇరుక్కుపోయి మాయమవనంటోంది, చెరిగిపోనంటోంది. ఆనందం నిండిన గతం, వ్యధాపూరితమైన గతం, తృప్తినిచ్చిన గతం, అసంతృప్తి మిగిల్చిన గతం ఉగాది పచ్చడిలో రుచులలా శాశ్వతంగా జ్ఞాపకాల్లో ఉండిపోయింది. బాగా దట్టించి ఉందనుకుని వెలిగించిన

మతాబా అతి తక్కువ కాలం అత్యంత కాంతివంతంగా వెలిగి వెలుతురుని వెదజల్లి, చటుక్కున ఆరిపోయిన జీవిత మతాబా గతం, మాయమవనని మంకుపట్టుపట్టి మఠం వేసుకుని మస్తిష్కంలో తిష్టవేసింది.

అవి తను మెడిసిన్ నాల్గవ సంవత్సరం చదువుతున్న రోజులు. అక్టోబర్ మొదటి తారీకు సాయంకాలం చిరుచీకటిలో, భూమిలోనికి కృంగిపోతూ వెలుతురుని తనతో తీసుకెళ్ళగా మిగిలిన సంధ్య వెలుగులో రాయల్ ఎన్‌ఫీల్డ్ బుల్లెట్ మోటారు సైకిల్ మీద సినిమా హాల్ వీధిలోంచి వస్తున్నాడతను. అది గమనించకుండా ఓ పరికిణీ, జాకెట్ పిల్ల రోడ్డు మీద మోటార్ సైకిల్‌కి ఎదురుగా అడ్డం పడింది. మోటార్ సైకిల్ బహుశా పదిహేను - ఇరవై అడుగుల దూరంలో ఉండగా తను దానికి అడ్డంగా రాబోతున్నానని గ్రహించి కాబోలు రోడ్డు వారకి పరిగెత్తింది. ఆమెని రోడ్డు మధ్యగా చూసి ఆమెను ఢీకొట్టకుండా ఉండాలని మోటార్ సైకిల్‌ని, బ్రేక్‌వేస్తూ రోడ్డు వారకి మళ్ళించేడు. విధి! ఖర్మ యాధృచ్ఛికం! పేర్లు ఏవైనా, మోటార్ సైకిల్ ఆమె వేసుకున్న పైటని లాగేస్తూ ఆ పిల్లని కిందకి తోసేసింది. సినిమాలో ద్రౌపదీ వస్త్రాపహరణం సీన్‌లో దుశ్శాసనుడు ద్రౌపది వలువలు ఊడతీయ ప్రయత్నిస్తుంటే, తన శరీరాన్ని కప్పుకోవడానికి అవస్థ పడ్డట్టు, ఆ పిల్ల కింద పడిపోతూ కూడ తన గుండెలమీద రెండు చేతుల్ని అడ్డు పెట్టుకుంది. మోటార్ సైకిల్‌ను రోడ్డు వారగా నిలిపి, ఆమె కింద పడిఉన్నచోటుకి పరిగెత్తాడు తను. చిరిగిపోయిన పైటని ఆమెకి అందిచ్చేడు. ఇతరుల విషయాలు గురించి పట్టించుకోని ప్రజ, ఇలాంటి సన్నివేశాల్లో మాత్రం ఇతరుల గురించి పట్టించుకోవడానికి నడుం బిగించి ముందరకి దూకుతుంది. జనం అన్నిదిశల నుంచి వచ్చి, ఆమె చుట్టూ మూగి చూస్తున్నారు.

"ఏం స్పీడ్! నడిచే రోడ్డమీద అంత స్పీడెంటంట!" అన్నాడు ఒకడు.

"ఆ గుంట జాగ్రత్తగానే వెళ్తోందండి ఆయ్! మరి ఆయనండి! ఒకటే స్పీడండి ఆయ్" అంటూ గుబురు మీసాలని సాపు చేసుకుంటూ ప్రక్కనున్న వ్యక్తికి జరిగిన దానిని సమగ్రంగా వివరిస్తున్నాడు మరొకడు. ఇంకొకడు "ఆ ఆడకూతురికి ఏటైనాదో" అంటూ అబ్బురపడ్డాడు.

యాక్సిడెంట్ అయిన రెండు నిమిషాలలో రెండుగంటల సినిమాకి కావలసిన డైలాగులు సమకూర్చి సరఫరా చేయగల ఘనకీర్తి కాకినాడ వాస్తవ్యులదే అనిపించే వ్యాఖ్యానాలు, విసుర్లు పట్టించుకోకుండా "మీరందరూ కొంచెం దూరంగా జరగండి. ఆమెకి గాలి అవసరం" అంటూ ఆమె చేయి అందుకున్నాడతను. సర్రున విసురుగా లాగేసుకుంటూ పక్కకి ఒత్తిగిల్లడంతో ఆమెకి పెద్ద దెబ్బతగలలేదని, ఇతర చిన్నదెబ్బలు ఎక్కడైనా తగిలేయా? అని పరిశీలించడం మొదలుపెట్టాడతను. బొంగరంలా రెండు చుట్లు తిరిగి కిందపడినపుడు కాళ్ళు, మోచేతులు, కాస్తంత మేర చెక్కుకుని, దాని నుంచి వస్తున్న సన్నని రక్తపు జీర కనిపించగా, నీ ఇల్లు ఎక్కడ? ఓయ్ రిక్షా' అని పిలిచి ఆమెని ఎత్తుకుని ఖాళీగా ఉన్న రిక్షాలో కూర్చోపెట్టాడు.

ఆ పిల్ల సమాధానం చెప్పేలోగా, "దీని ఇల్లు నాకు తెలుసు" అన్నాడు రిక్షావాడు. అంత అమర్యాదగా అదీ రిక్షావాడు అలా మాటలాడుతుంటే విచిత్రమనిపించినా, తొందరగా ఆమెని ఇంటికి చేర్పించాలని రిక్షావెనుకగా మోటార్ సైకిల్ నడిపాడు తను. ఒక ఇంటి దగ్గర రిక్షా ఆగగా, ఆ పిల్లకి చేయూతనిచ్చి రిక్షాలోంచి దింపి,

ఆమెని లోపలికి చేర్చి, "చిన్న దెబ్బలే. గాయం శుభ్రంగా కడగండి. ఇంతలో నేను మందులు తెస్తాను" అంటూ మోటార్ సైకిల్ ఎక్కాడు. ఏటియస్ ఇంజక్షన్, ఇతర ఏంటీసెప్టిక్ సరంజామా తీసుకెళ్ళి, ఇంజక్షన్ ఇచ్చి గాయాలమీద ఆయింట్‌మెంట్ పూస్తుంటే, ఇరుగు పొరు గుల వాళ్లు, ఆ పిల్ల అక్క కాబోలు తనని విచిత్రంగా గమనిస్తున్నారు.

"ఇంక ఫరవాలేదు. రేపు కాస్త నొప్పిచే స్తుంది అంతే" అని తను బయలుదేరబో తుంటే, "మీరు డాక్టరా? " అనడిగింది ఆ పిల్ల ఎర్ర పైటని సవరించుకుంటూ.

"ఇంకా పూర్తవలేదు" అని సమాధానమి చ్చాడు తను.

"మీ పేరు? " అనడిగింది.

"రాయుడు, వెంకటరాయుడు" అని ఆమెవేపు తిరిగి, "నీ పేరు" అంటే "రోజీ" అంటూ సమాధానమిచ్చింది.

రోడ్డుమీదకి వచ్చి మోటార్ బైక్ కిక్ కొట్టి వెల్‌కమ్ హోటల్‌వేపు మోటార్ సైకిల్‌ని పోనిచ్చేడు.

★ ★ ★

ఫార్మకాలజీ పరీక్షకి తయారవుదామని పుస్తకం తెరచి చదవనారంభించాడు రాయుడు. వ్యాధి లక్షణాలు, నివారణకి ఉపయోగించే మందులు, ఆ వాడిన మందుల వలన కలిగే ఇబ్బందులు, ప్రభావం గురించి చదువుతుంటే "అరె! సాయంకాలం ఆ పిల్లకి ఏంటీబయాటిక్ వాడమని మందులు కొని ఇచ్చాను. కాని వాటి ప్రభావం వలన కడుపులో తిప్పడం, వాంతులయ్యే అవకాశం ఉందని చెప్పడం మరచిపోయాను" అనుకున్నాడు తను. చింపిరి జుత్తు కాదు కాని, జుత్తు సరిగ్గా లేదు. లైట్ల వెలుతురులో కనుగుడ్లని పెద్దవి చేసి భయంగా చూస్తూ మెరిసిన కళ్లు, చామనఛాయ, పిటపిటలాడుతున్న శరీర పొంకం కలిగివున్న రోజీ మనసులో మెదిలింది. "జ్వరం వచ్చి ఉంటుందా? " అనుకుంటూ రోజీ గురించి ఒక్క క్షణం ఆలోచించి ఫార్మకాలజీ పుస్తకంలోకి దృష్టి మరల్చేడు తను. అంతకుముందర రెండు రోజులు సరిగ్గా నిద్ర పట్టకపోవడంతో నిద్ర ముంచుకు వచ్చి కళ్లు మూతలుప డ్డాయి.

ఉదయం లేచినప్పటి నుంచి తనలో ఏదో పరాకుతనం విదితమౌతున్నా దానికి సరిఅయిన కారణం తెలియలేదు. అన్యమ నస్కంగా ఉండడంతో పరీక్ష సరిగ్గా రాయ లేకపోయాడు రాయుడు. సాయంకాలం ఆరుగంటలకు కాఫీ తాగి గదికి తిరిగి వస్తుంటే, ముందర రోజు జరిగిన ఏక్సి డెంట్ గుర్తొచ్చి మోటార్‌సైకిల్‌ని సినిమా హాల్ రోడ్డు మీదకి మళ్లించాడు. రోజీ ఇంటి దగ్గర మోటార్‌బైక్‌ని నిలుపుచేసి రోజీ ఇంటి తలుపు తట్టాడు. వీధిలోని జనం తనవేపే విచిత్రంగా చూస్తున్నారు. ఆ వీధిలో వినపడుతున్న భాష మోటుగా ఉంటున్నా తను ప్రత్యేకంగా పట్టించుకో లేదు. తలుపు తెరచిన రోజీ అక్క కాబోలు రవ్వంత విసుగుతో "ఎవరు కావాలి? ఎందుకు వచ్చేరు? " అనడిగింది. ఆమె అడిగిన ప్రశ్నలు, ఆమె చూపించిన కసిరే ధోరణి చూసి తన నోటంట మాట వెంటనే పెగలలేదు. "రోజీ" అన్నాడు.

"రోజీకి జ్వరం వచ్చింది. పడుకుని ఉంది. ఈవేళ ఏమీ లాభంలేదు" అందామె. తనకి పూర్తిగా అర్థమవలేదు.

"జ్వరం తగ్గడానికి మందులు తెచ్చేను. నాకు తెలుసు జ్వరం వస్తుందని. ఇవి ఆమెకి ఇవ్వండి. రోజుకి రెండు, నాలుగు రోజులు వేసుకోమనండి" అంటూ మందుల్ని అందించి వెనక్కి తిరిగాడు. లోపలి నుంచి రోజీ కాబోలు ఏదో అనబో తున్నా వినిపించుకోకుండా "ప్రతీవాడూ

**కొత్తగాలి...**

**కొల్లేరు నిండా**
**కొంగల అక్షరాలు**
**వలస**
**మహాకావ్యమంటే ఇదే**

*-ఎస్.ఆర్.భల్లం, తాడేపల్లిగూడెం*

ఏదో పనిపెట్టుకుని గుమ్మంలోంచి లోపలికి తొంగిచూడడమే" అంది రోజీ అక్క.

"ఛ! అనవసరంగా వచ్చాను" అనుకుంటూ ఇంటివేపు మళ్లాడు తను.

నాలుగు రోజులు గడిచేయి. ఆదివారం మోటార్‌సైకిల్ శుభ్రం చేయడం తనకి అలవాటు. శుభ్రం చేస్తుంటే మోటార్‌సైకిల్ ముందర చక్రం మడ్‌గార్డ్‌కి తగులుకున్న ఒక ఎర్ర గుడ్డపీలిక కనిపిస్తే దానిని బైటికి లాగేడు.

సినిమాహాల్ వీధిలో జరిగిన సంఘటన మరోసారి జ్ఞాపకానికి వచ్చింది. "ఎలా ఉందో ఆ పిల్ల? శాంతంగా, మొహంమీద ముసురుకున్న ముంగురులు పట్టించుకోని ఆ పిల్ల ఎలా ఉందో? ఆమె చేతికి ప్లాస్టర్ వేసి ఇంజక్షన్ ఇస్తుంటే, కళ్లు పెద్దవి చేసి చూసి, "మీరు డాక్టరా? " అనడిగింది మంచి ఉచ్ఛారణతో. కాని వెన్వెంటనే, ఏక్సిడెంట్ అయిన మరుసటిరోజు రోజీని చూడడానికి వెళ్లినప్పుడు ఆమె అక్క మాటలు తూటల్లా గుచ్చుకుని రోజీ ఆలోచనల్ని బైటకి నెట్టివేశాయి. కాని ఆశ్చర్యం, రోజీ ఆలోచనలు తనని వదల్లేదు!

సాయంకాలం ఆరు గంటలకి మోటార్‌సైకిల్ రోజీ ఇంటిముందర ఆగింది. వీధి తలుపు తెరచి ఉంది. ఇంటి లోపల కుర్చీలో పరికిణీ, జాకెట్‌తో పైట వేసుకోకుండా కూర్చుని తల దువ్వుకుంటున్న రోజీ కనిపించగానే లోపలికి ప్రవేశించి ఆమె దగ్గరగా నిలబడ్డాడు.

ఒక్కసారి కంగారుగా లేచి నిలబడి, "మీరా? " అంటూ పైటకోసం అటూ ఇటూ గాభరాగా చూసింది. ఆ చూపులో భయం, ఆశ్చర్యం, పిసరంత ఆనందం కూడా కనిపించింది తనకి. ముంగురులు ఒక క్రమంలో అందంగా ఆమె ఆదేశించినట్లు ఉన్నాయి. కనుగుడ్లు పెద్దవి గాకపోయినా ఆశ్చర్యంగా వాటిని పెద్దవి చేసింది. "జ్వరం పూర్తిగా తగ్గిందా? " అడిగాడు.

"తగ్గింది. కానీ మీరు అనవసరంగా ఇటు రాబాకండి. మా అక్కకి అరువు బేరాలంటే ఇష్టంలేదు" అంది రోజీ. అప్పుడు పూర్తిగా అర్థమైంది రోజీ వ్యవహారం, ఆమె వృత్తి గురించి. గతంలో ఇలాంటి వాటిగురించి వినడమేకానీ, అంత ప్రత్యక్షంగా తను అలాంటివి చూడలేదు. బైటకి రాబోతుంటే, "మీరు నా గురించి చాలా శ్రమపడ్డారు, అయినా మా అక్క మాట నేవినక తప్పదు" అంది రోజీ.

తను అక్క చేతిలో బందీనని, తనకి స్వతంత్రం లేదని, నా రాక తనకి అభ్యంతరం లేదని రోజీ తెలియపరిచింది. మెల్లిగా మెట్లుదిగి మోటార్‌సైకిల్ కిక్ కొట్టబోతూ వెనక్కి తిరిగి చూశాడు. సగం తెరిచిన తలుపు సందులోంచి రోజీ తననే గమనిస్తోంది. తొందరగా తను ఆ ఇంటిలోంచి బైటకి రావడం కనిపెట్టిన ఒకడు "ఇంతకన్నా మంచి సరుకు సూపిస్తాను, నాతో రండి" అంటూ పలకరించబోయాడు. అతడేమీ ఆసక్తి చూపించకపోవడంతో "దాని ఖరీదు, యాభై" అన్నాడు మళ్లీ. పురుగుని చూసినట్లు అతణ్ణి చూసి మోటార్‌సైకిల్ స్టార్టుచేసి వేగం పెంచి ఆ వీధిలోంచి బైటపడ్డాడు రాయుడు.

## తప్పేంటి?

ఓసారి లింకన్‌ను చూసేందుకు స్నేహితులు అతడి నివాసానికి వచ్చారు. ఆ సమయంలో ఆయన బూట్లకు పాలిష్ చేసుకుంటున్నాడు. అమెరికా అధ్యక్షుడు అలా చేయడం నచ్చని మిత్రులు, 'ఏమిటీ? మీ బూట్లకు మీరే పాలిష్ వేసుకుంటున్నారా?" అని ఆశ్చర్య పోతూ అడిగారు. దానికి లింకన్, 'ఔను, మీరు మీవాటికేకాక ఇంకెవరి వాటికైనా పాలిష్ చేస్తుంటారా?' అని నవ్వుతూ చురక వేశాడు.




రోజీ జ్ఞాపకం మధ్య వారం రోజులు గడిచాయి. మరో వారం గడిచేసరికి రోజీతో జరిగిన సంఘటన మరుగుపడుతున్న సమయంలో ఒకరోజు సెకండ్‌షో సినిమాకి వెళ్లాడు ఒక్కడూ. ఇంటర్వెల్‌లో లైట్లు వెలిగినప్పుడు రోజీ, ఆమెతోపాటు మరో ఇద్దరు అదే సినిమాహాల్‌లో కనిపించారు.

రోజీ వేషధారణలో మార్పు కనిపించింది. నీలంరంగు చీరకట్టి, జుత్తు పైకెత్తి తలలో పూలని తురిమింది. కళ్లకి కాటుక దట్టంగా పెట్టింది. తాంబూలం నమలడం వలన ఎర్రపడిన పెదిమలు ఒక్క నిమిషం తన కళ్లకి ఆనేయి. రోజీ దృష్టి అతడిమీద పడింది. తన అపోహే కావచ్చు కాని అరనిమిషం ఆమె కళ్లలో సిగ్గు, ఆనందం తను చూశాడు. పలకరింపుగా నవ్వింది. తనతో వచ్చిన ఇద్దరిలా కాకుండా సహజంగా నవ్వింది.

మరచిపోయాననుకుంటున్న సమయంలో తిరిగి ఆమె తనకంట పడడం కేవలం యాదృచ్ఛికమా? లేక విధి లిఖితమా? తను ఇలాంటివి నమ్మకపోయినా చిన్నప్పటి నుంచి తల్లిదండ్రులు, ఇతర పెద్దవాళ్లు ప్రతీ నిమిషానికీ 'కర్మ', 'కర్మ' 'పూర్వజన్మసుకృతం', 'ప్రాప్తం ఉండాలిరా', 'పెట్టి పుట్టాలిరా' లాంటి పదాలని పుష్కలంగా వాడడంతో పంజరంలో చిలకకి కూడా ఆ పదాలు అలవాటు అవుతాయి. మన మెదడు కూడా 'కండిషన్' అవుతుంది. ఏది ఏమైనా ఆమెని చూడగానే ఆనందం కలిగింది.

ఇంటర్వెల్‌లో లైట్లు ఉన్నంతసేపూ, రోజీ తనవేపు నాలుగైదుసార్లు చూసింది.

సినిమా ముగిసింది.

గేట్‌లోంచి బైటకి రాగానే, గేటు దగ్గరగా నిలబడి ఉన్న రోజీ! 'బాగున్నారా?' అనడిగింది. తనకి నోరు పెగలలేదు. హఠాత్ పరిణామం? "రండి మా ఇంటికి" అంది రోజీ. ఆ వాక్యం ఉచ్ఛరించడానికి తనెంతగింజుకుందో, తనని తాను ఎంత అసహ్యించుకుందో. ఆమెతో పరిచయం పెరిగాక తెలిసింది. తనలో ఉన్న ఉత్సాహం, సరిగ్గా కాలని కట్టెల మీద, కిరోసిన్ జల్లితే గెంతుకుంటూ మంటలు మీదకి లేచినట్లు మీదకి లేచింది. వారంరోజులుగా చదువుమీద దృష్టి సరిగ్గా లేకపోవడానికి కారణం చప్పున విశదమైంది. మాట్లాడకుండా రోజీని మోటార్ బైక్ మీద ఎక్కించుకుని ఆమె ఇంటికి చేరాడు. మోటార్ సైకిల్‌మీద తనని ఆనుకుని కూర్చున్న రోజీ పడిపోతుందేమోనని బైక్‌ని జాగ్రత్తగా నడిపాడు. మెత్తని ఆమె శరీరం స్పర్శ తనలో గగుర్పాటుని కలిగించి, కోరికలని రేకెత్తించినా తమాయించుకుని, ఒక గంటసేపు కబుర్లు చెప్పి, ఏభై రూపాయలు టేబిల్‌మీద వదిలి రూమ్‌కి చేరుకున్నాడు.

పరుపుమీద చేరిన రాయుడికి నిద్ర రాలేదు. కొంత యాసతో కూడిన ఆమె మాటలు వింటుండగా ఆమె తనకున్న జ్ఞానాన్ని ప్రదర్శించడానికి చేసిన ప్రయత్నం తనని ఆశ్చర్యపరిచింది.

డబ్బుకి శరీరాన్ని అప్పచెప్పే స్త్రీ ఆమె! డబ్బు ఇచ్చి శరీరాన్ని కొనుక్కునే వ్యక్తి తను! ఇద్దరి మధ్యా నడిచేది వ్యాపారం! కాని ఒక్క శరీరమే కాదు, తనకో వ్యక్తిత్వం ఉందంటూ తెలియపరచడానికి ఆమె ప్రయత్నించింది. ఆమెని శారీరకంగా కల వాలని తొందరపడలేదు ఆవేళ. పెద్ద ఆద ర్శాల గురించి తనకేమీ తెలియకపోయినా, ఎందుకో తను ఆమెని ఆక్రమించే ప్రయత్నం చేయలేదు. ఇప్పుడు వెనక్కి తిరిగిచూస్తే దానికి కారణం తెలియవ చ్చింది. శరీరం కంటే మనస్సుకి ఎక్కువ విలువ ఇచ్చే గుణం తనలో అంతర్లీనంగా ఉందని తనకి అప్పుడు తెలియలేదు.

“రేపొస్తారా మళ్లీ” అనడిగింది రోజీ. తను లేచి వెళ్ళబోయే ముందర, తనకి రెండంగుళాల దూరంలో నిలబడి ఉన్న రోజీవేపు చూసి “ఏమో!” అని ఇంటికి వచ్చేశాడు.

ఒక రకమైన మానసిక చలనం రాయుణ్ణి కుదిపింది ఆ రాత్రి. తరువాత రోజుల్లో రోజీ గురించి ఆలోచనలు ఎక్కు వయ్యాయి.

పది రోజులు అంతర్గత సంఘర్షణతో భారంగా గడిచాయి. కాని సంఘర్షణ ముందు వివేకం ఓడిపోవడంతో మోటార్ సైకిల్‌ని రోజీ ఇంటివేపు నడిపి, బైక్‌ని రోడ్డువారగా నిలబెట్టాడు. ఇంటిముందర మోటార్‌సైకిల్ ఆగిన శబ్దం వినగానే రోజీ తలుపు తెరుచుకుని బైటకి వచ్చింది. ఆమె కళ్ళలో మళ్ళీ వెలుగు, కాని శారీరకంగా చిక్కినట్లనిపించింది తన కళ్ళకి.

“ఏం రోజీ బాగున్నావా”? అని తను పలకరించాడు. తల ఊపుతూ, “లోపలికి రండి” అంటూ తలుపు పూర్తిగా తెరిచి ఒక వారగా నిలుచుంది. రోజీ గదిలోకి వెళ్తుంటే ఇతర స్త్రీలు చెవులు కొరుక్కుంటు న్నారు.

“ఇన్నాళ్ళకా మేం జ్ఞాపకానికి వచ్చాం?” అంటూ సంభాషణ మొదలుపెట్టింది రోజీ. తను కోరినట్లు నేరాలేదన్న నిష్ఠూరం, నిరాశ; తన ప్రభావం నామీద లేదనిపించి కాబోలు కలిగిన ఆవేదన, ఎక్కువ కోపం ప్రదర్శిస్తే శాశ్వతంగా నేను దూరమౌతానేమోనన్న భయం అన్ని కల గాపులగంగా కలిపి ఆమెచేత వేయించిన ప్రశ్న అది. రోజీ తరువాత రోజుల్లో వివ రించకపోతే అది తనకి తెలిసేది కాదు. తనకి తెలిసినదల్లా ఆమెని చూడగానే ఒక విధమైన హాయి కలిగింది. ఆమె మొహంలో కనిపించిన ఆనందం తనకి సంతృప్తిని ఇచ్చింది అంతే. ఏ మాత్రం సంకోచించకుండా జీవితంలో మొట్టమొద టిసారి ఆవేళ రాత్రి ఆమె శరీరంతో చెల గాటమాడేడు.

ఒకరోజు తను వెళ్ళేసరికి రోజీ ఇంటిలో గొడవ జరుగుతోంది. రోజీ అక్క ఆమెను ఎందుకో బలవంతం చేస్తోంది. ప్రతిఘటించలేక రోజీ ఏడుస్తున్న సమ యంలో రాయుడు అక్కడకి చేరాడు. రోజీ ఆర్జన తగ్గిపోయిందని, దాన్ని పెంచమని ఆమె అక్క రోజీని బలవంతపెడుతోంది.

పరిస్థితి అర్థమైంది రాయుడికి. “దీన్ని ఈ మురికికూపంలోంచి తీసుకువెళ్లు. కాని ఏడువేలు ఇచ్చి తీసుకెళ్ళు” అంది రోజీ అక్క. ఆమె సహోదరి కాదన్న సంగతి తనకి అప్పుడు తెలిసింది. ఒక స్నేహితుని దగ్గర ఏడువేలు అప్పు తెచ్చి రోజీ అక్కకి అందజేశాడు.

అలా మొదలైంది రోజీతో కాపురం, కాదు జీవితం. చదువుపై మనస్సు లగ్నం

కాకపోవడంతో ఆ సంవత్సరం పరీక్షకి వెళ్ళే అవకాశం పోయింది. తండ్రికి ఈ కబురు తెలిసి, "నీ ధోరణి, ప్రవర్తన, నడవడి మారకపోతే నీ చదువుకి నేను డబ్బు ఇవ్వలేను" అన్నాడు. తనేమీ సమాధానమీయకపోవడంతో, ఇంకేమీ చెప్పకుండా తండ్రి వెళ్ళిపోయాడు. సుబ్బారావు దగ్గర ఏభైవేలు అప్పు తెచ్చి లారీలలో సరుకు రవాణా చేసే వ్యాపారం ఆరంభించాడు.

"మనం పెళ్ళి చేసుకుందాం" అన్న రాయుడితో "ఆ పసుపుతాడు కట్టేసినంత మాత్రాన తేడా ఏమీ రాదు" అంది రోజీ.

రాజమండ్రికి మకాం మార్చి కొత్త జీవితం మొదలుపెట్టాడు. అదొక విచిత్రమైన జీవితం. లారీ వ్యాపారం బాగా సాగుతుండడంతో డబ్బుకి ఇబ్బంది పడలేదు, బంధువుల గురించి పట్టించుకోలేదు. మనం సంఘాన్ని వదిలితే మనల్ని సంఘం వదులుతుంది అని చలం అన్నట్లు బిజినెస్ పెంచడానికి పట్టే సమయాన్ని, రోజీతో గడపడానికి కావలసిన సమయాన్ని సరిగ్గా కుదించలేక ఇబ్బంది పడేవాడు. అయినా రోజులు హాయిగా వెళ్ళేయి. రోజీతో ఏడేళ్ళ జీవితంలో ఆరేళ్ళ కొడుకు. బిజినెస్ రీత్యా రాయుడు ఊర్లంబట తిరిగేవాడు, ఆలస్యంగా ఇంటికి వచ్చేవాడు.

ఎప్పుడు మొదలయిందీ ఇప్పుడు తన జ్ఞాపకానికి రావడంలేదు కాని అప్పుడప్పుడు రోజీకి మేనమామ అంటూ ఒకతను తరచూ ఇంటికి వచ్చేవాడు. అతని గురించి కాని, అతని రాక గురించి కాని తనేమీ పట్టించుకోలేదు. ఎందుకో అతడంటే తనకి మంచి అభిప్రాయం ఏర్పడలేదు. అతను రావడం మొదలుపెట్టినప్పటికి నుంచి రోజీ తనలో చిన్నవే అయినా, ఏవో తప్పులు పట్టడం మొదలుపెట్టింది.

తను, తను నడుపుతున్న వ్యాపారం గురించి రోజీకి క్షుణ్ణంగా వివరించాడు. తను తిరిగి అన్నీ సరిగ్గా నడుస్తున్నాయో లేదో చూసుకుంటే కాని వ్యాపారం సరిగ్గా సాగదని, రోడ్డుమీద పడతామని హెచ్చరించాడు. మౌనంగా వినేది రోజీ. రెండు రోజుల తరువాత మళ్ళీ రోజీలో విసుగు, అశాంతి దర్శనమిచ్చేవి. క్రమేణా ఆమెలో మార్పు, రాయుణ్ణి సాధించే ధోరణి పెరిగింది.

అతడు అప్పుడప్పుడు, శారీరక బాధల నుంచి విముక్తి కోసం మద్యం సేవించేవాడు. ఒకరోజు రాత్రి అతడు మైకంలో ఉండగా "నువ్వు ఏదో ఉద్ధరించేవాడిలా అక్కడి నుంచి తీసుకువచ్చావు. నామీద మీకు ప్రేమ లేదు" అంది.

ఆ స్థితిలో రాయుడుకు ఏం సమాధానమివ్వాలో స్ఫురించలేదు. మనస్సు వికలమవగా కళ్ళు మూసుకున్నాడు. విస్కీ అతణ్ణి నిద్రపుచ్చింది. మర్నాడు ఉదయమే లేచి పరుగులు పెడుతూ వ్యాపార నిమిత్తమై హైద్రాబాద్ వెళ్ళాడు. అతడు వెళ్ళే సమయానికి రోజీ ఇంకా నిద్రలో ఉంది. లేపి హైద్రాబాదు నుంచి తిరిగి రావడానికి నాలుగు ఐదు రోజులు పడుతుందని చెబుదామనిపించినా, గాఢ నిద్రలో ఉన్న రోజీని లేపడమెందుకని, చిన్న చీటి రాసి రైలుస్టేషన్ చేరుకున్నాడు.

అనుకున్న దానికన్నా ఎక్కువ టైమ్ పట్టడంతో రాజమండ్రికి వారం రోజుల తరువాత తిరిగి వచ్చాడు. ఇంటికి వేసి ఉన్న తాళంకప్ప రాయుడికి స్వాగతం పలికింది. ఏమై ఉంటుందా అని ఆశ్చర్యపడుతుంటే, పక్కింటి కుర్రాడు వచ్చి చేతికి తాళం అందిచ్చి, ఏదో అడగబోయేంతలో కనుమరుగయ్యాడు.

దారిలో పుచ్చుకున్న మద్యం మైకం వదిలింది రాయుడుకి. తలుపు తెరిచాడు. ఇంటిలో సామాన్లు ఉన్నాయి కానీ రోజీ



స్తువులు కానీ, కొడుకు కరుణ బట్టలు, ామాన్లు కానీ కనిపించలేదు. తల పట్టు ని హాలులో చతికిలపడి ఏమిటిదంతా? న్న ఆలోచనలో పడ్డాడు.

వెంటనే అతడికి ఏమీ అర్థమవలేదు. ీజీ ఏదైనా పనిమీద ఊరు వెళ్ళిందేమో అనుకుని స్థిమితపడ ప్రయత్నించినా, మనస్సు ఏదో కీడుని శంకించి, సోఫా లోంచి లేచి గదులలో మిగిలిన సామాన్ల నన్నింటినీ ప్రత్యేకంగా గమనించాడు.

ఇంటిలో రోజీ నివసించిందనడానికి నిద ర్శనాలు లేకుండా జాగ్రత్త పడినట్లు రోజీ, కరుణల వస్తువులు ఏవీ కనపడలేదు. ఒక్కసారిగా నీరసం పెరిగి తిరిగి కుర్చీలో సాగిలపడ్డాడు.

రాత్రి ఎనిమిది గంటలయిందప్పుడు.

రోజీ తనని వదిలివెళ్ళింది. తనతోపాటు కొడుకు కరుణని కూడా తీసికెళ్ళిందన్న నగ్నసత్యం మెదడులోకి ఇంకేసరికి మన సంతా మొద్దుబారింది.

రోజీ తనని విడిచి వెళ్ళిపోవడం అనూ హ్యమైన సంగతి. ఎందుకిలా జరిగింది? అంత తీవ్రమైన నిర్ణయం ఎందుకు తీసు కుంది? ఇందులో తన తప్పెంత?

ఆ మర్నాడు రోజీ ఎక్కడికి వెళ్ళిందో కనుక్కోవడానికి ప్రయత్నం చేసి పూర్తిగా విఫలుడయ్యాడు తను.

"నువ్వు నాకొద్దు" అన్న స్త్రీ కోసం వెత కడం కంటే చిత్రహింస మరొకటి లేదు" అన్నాడు వెనకటికెవరో.

"నువ్వు నాకొద్దు" అని చెప్పకుండా చెప్పి రోజీ వెళ్ళిపోయింది.

★ ★ ★

గబుక్కున తెలివి వచ్చి వాస్తవంలోనికి వచ్చేడు రాయుడు.

"ఏమిటి రాయుడూ అరగంట కళ్ళు మూసుకుని ఒక్కసారి కళ్ళు తెరిచావు, ఎక్కడికి పరిగెత్తింది నీ ఆలోచన? " అడి గాడు సుబ్బారావు, అతణ్నే తదేకంగా చూస్తూ.

"నీకు తెలుసు. కాకినాడ పేరు వినగానే నా గుండెల్లో గుచ్చుకుని అక్కడే ఉండిపో యిన గాజుపెంకు మంటల్ని చిందిస్తుం దని" అన్నాడు రాయుడు.

మౌనంగా, విచారంగా రాయుడువేపు చూశాడు సుబ్బారావు.

"ఎన్నాళ్ళని మథనపడతావు రాయుడూ? జీవితకాలం చాలా చిన్నది కొన్ని ప్రశ్నలకి సమాధానాలు లభించవు. సమాధానం తెలిసినా, అది తెలిసినంత మాత్రాన నీ గుండెలో మంట చల్లారదు! అంటూ సలహా ఇవ్వబోయేడు సుబ్బా రావు.

"అదే విచిత్రమోయ్. గత నలభై ఏళ్ళ నుంచి నువ్వు నాకు తెలుసు. నీతో మనసు విప్పి మాట్లాడినట్లు ఇంకెవరితో మాట్లాడలేను. గుండెల్లో భగభగ మండుతూ బైటపడి చల్లారలేని లావా అది! నువ్వు సలహా ఇచ్చినట్లు ప్రయత్నం చేస్తూనే ఉన్నాను. కాని అది ఆరటంలే దోయ్! జీవితం వెళ్ళిపోయింది. ఆ గడి చిన కాలం తిరిగిరాదు. రోజీ తనంతట తాను వచ్చినా, ఆమె అంటే ఇష్టమున్నా నా గుండెలో ఒక భాగం చప్పున విషాన్ని బైటకి కక్కేస్తుంది. అది దాచుకోలేదు. నా సంగతి వదిలేయ్. నీ సంగతి చెప్పు, అమె రికా నుంచి నీ భార్య వచ్చే లోపల ఇల్లంతా శుభ్రం చేసి ఉంచు" అంటూ టాపిక్ మార్చాడు రాయుడు.

★ ★ ★

మెల్లిగా తలుపు తోసుకుని, "మే ఐ కమిన్? " అంటూ గదిలోనికి వచ్చింది జలజ.

"రండి, రండి" అంటూ కూర్చోమని కుర్చీ చూపించేడు డాక్టర్ రాయుడు.

"మీరు డాక్టరై ఉండీ ఇంత ఎక్కువగా సిగరెట్లు తాగడం ఆశ్చర్యంగా ఉంది' అంటూ పొగ వాసన రాకుండా రుమాలు ముక్కు దగ్గర ఉంచుకుని కుర్చీలో కూర్చుంది జలజ.

"అది నా పర్సనల్ వ్యవహారం. అయి నప్పటికీ, మీరు చెప్పిన దాంట్లో ఔచిత్యం ఉంది. కాని కొన్ని వ్యసనాల్ని వదలలేం. కొన్ని జ్ఞాపకాల్ని తుడిచిపెట్టలేం. దానికేం గాని, ఏమిటి మీ నిర్ణయం? " అనడిగాడు

వారెవ్వా!



## కన్పించని గండభేరుండాలు

మోవా అనే ఈ భారీ పక్షులు ఒకప్పుడు న్యూజిలాండ్‌లో లక్షల సంఖ్యలో ఉండేవి. దాదాపు యాభైఏళ్లకు పైగా జీవిస్తాయని చెప్పుకునే ఈ పక్షులు నేడు అడ్రస్‌లేకుండా పోయాయి. వేగంగా పరుగెత్తలేకపోవడం, ఎగరలేకపోవడం, ప్రత్యేక రక్షణావయవాలు లేకపోవడం వీటి అంతర్ధానానికి కారణమని చెప్పవచ్చు. ఆ రోజుల్లో మూడువందలకు పైగా పక్షివధ శాలలు న్యూజిలాండ్‌లో ఉండేవని, ప్రజలు ప్రధానంగా వీటి వేటపైనే ఆధారపడి జీవించేవారని చరిత్ర చెబుతోంది.

రాయుడు.

"మీ సలహా పాటించి, మీ దగ్గర ట్రీట్‌మెంట్ తీసుకుంటాను. ఎప్పుడు రమ్మంటారు? "

"మీ ఎడ్రస్ గోపీకి ఇచ్చి వెళ్ళండి. అన్ని ఏర్పాట్లు చేశాక మీకు తెలియపరుస్తాను. నాలుగు, ఐదు రోజుల కంటే ఎక్కువ వ్యవధి ఉండదు. చిన్న ఆపరేషన్‌కి ఇరవై నిమిషాలు చాలు. కాని తరువాత కొన్ని రోజుల ఇబ్బంది అనిపిస్తుంది" అంటూ రాయుడు వివరించి, సిగరెట్ అందుకోబోయేడు. కాని జలజ చూసిన చూపు ఆ ప్రయత్నాన్ని విరమింపచేసింది.

"సరే, మీ కబురు గురించి నిరీక్షిస్తుంటాను. మరి మీ ఫీజు? " అడిగింది జలజ.

"పెద్ద ఖరీదు ఉండదు. ఆ విషయం గోపీ ద్వారా తెలియపరుస్తాను" అని ఇక చెప్పడానికి ఇంకేమీ లేదన్నట్లు సిగరెట్ వెలిగించాడు డాక్టర్ రాయుడు.

రుమాలుని ముక్కుమీద ఉంచుకుని, కుర్చీలోంచి లేచి బైటకి నడిచింది జలజ.




**మీ** ఒంట్లో ఎలా ఉంది? మత్తు ప్రభావం తగ్గేక నొప్పి ఉంటుంది. ఆ నొప్పి తగ్గడానికి పెయిన్‌కిల్లర్ మందు రాశాను" అంటూ మృదువుగా, రవ్వంత ఆతృత కనపరుస్తూ డాక్టర్ రాయుడు వేసిన ప్రశ్నలన్నీ విని, "థాంక్యూ, సర్జరీ అన్న తరువాత ఇలాంటివి తప్పవు. వ్యాధి ఎంత ముదిరింది? " అనడిగింది జలజ.

"ఇంకా రిపోర్ట్‌లు రాలేదు. అవి వచ్చాక కాని ఏమీ తెలియదు. కంగారు పడాల్సిందేమీ లేదు. మీరు మంచి ఆహారం తీసుకుంటే, మీ శరీరం దానంతట అదే కోలుకుంటుంది. కొందరిలో దీని ప్రభావం మానసికంగా ఉంటుంది. మీరు చాలా ధైర్యవంతులని నాకు అనిపించారు. జాగ్రత్తలు తీసుకున్నారు. మిగతాది తరువాత చూద్దాం. మీకు తోడు ఎవరైనా వచ్చారా? " అడిగాడు డాక్టర్ రాయుడు.

"ఇల్లంతా చక్కపెట్టి మా అమ్మాయి మధ్యాహ్నం వస్తుంది. ఈ వ్యాధి సంగతి నేను ఎవరికీ స్పష్టంగా చెప్పలేదు. మధ్యాహ్నం నేను భోజనం చెయ్యవచ్చా? " అడిగింది జలజ. ఒంటిగంట తరువాత భేషుగ్గా తినవచ్చు. సులభంగా జీర్ణమయ్యేవే ఈవేళ తినడం మంచిది.

"మంచి కాఫీ తెప్పిస్తాను తాగుతారా? తాగాలని ఉందా? " డాక్టర్ రాయుడు ప్రశ్నకు ఒక్కసారి జలజ మొహం వెలిగింది.

"కాఫీ బాగుండాలి" అంది.

పదిహేను నిమిషాల తరువాత కాఫీ చప్పరిస్తూ ఎక్కడ నుంచి తెప్పించారో కాని కాఫీ చాలా బాగుంది" అంది జలజ.

డాక్టర్ రాయుడు చిరునవ్వు నవ్వి గదిలోంచి వెళ్ళిపోతూ, సిగరెట్ ప్యాట్‌ని బైటకి తీయడం జలజ కంటపడింది. "మంచిది కాదని ఒప్పుకుని, డాక్టరై ఉండి ఈయన ఇన్ని సిగరెట్లు ఎలా తాగుతాడో? " అనుకుంది.

★ ★ ★

"మీరు ఈవేళ ఇంటికి వెళ్ళిపోవచ్చు. నెలకొకసారి వచ్చి ట్రీట్‌మెంట్ చేయించుకోవాలి. ఏ ఆంక్షలు లేకుండా అందరిలాగే

జీవితాన్ని గడపగలుగుతారు. అయితే ప్రతీరోజూ మీకు వ్యాయామం చాలా అవసరం" అంటూ ఆగాడు రాయుడు.

"ఇప్పుడైనా మీ ఫీజు చెబుతారా? "

"నర్సింగ్‌హోమ్, సర్జరీ ఛార్జీలని మీ దగ్గర వాళ్ళు వసూలు చేసే ఉంటారు. నా ఫీజు ఎనిమిది వందలు" అన్నాడు డాక్టర్ రాయుడు. ఒక్కసారి జలజలో ఆశ్చర్యం ముప్పిరికొంది. అది చూసి-

"పోనీ ఆరువందలు ఇవ్వండి చాలు" అన్నాడు డాక్టర్ రాయుడు.

"మీరు అడిగిన ఫీజు చాలా తక్కువ. ఇంకొకరైతే ఎంతో ఎక్కువ ఛార్జ్ చేసేవారు. ఎంత చేసేవారో నేను ఊహించలేను. ఎందుకు అంత తక్కువకే మీరు వైద్యం చేస్తున్నారు? " జలజ విస్మయంతో అడిగింది.

"నెలసరి ఖర్చులకి ఇలాంటి ఫీజు చాలు. డబ్బు తినడానికి ఉపయోగపడదు కదా! ఒంటరినీ" అంటూ డాక్టర్ రాయుడు నిష్క్రమించాడు.

బయటకి మొరటుగా ప్రవర్తించే ఈ డాక్టర్‌లో ఇలాంటి మంచి భావాలున్నాయా? " అంటూ ఆశ్చర్యపడింది జలజ.

'ఒంటరిని' అన్నాడు. ఎన్నాళ్ళ్టి ఒంటరితనం? అని చిన్న మెదడు వేస్తున్న ప్రశ్నలు కాస్సేపు విని, జలజ పెద్ద మెదడు 'నీ ప్రశ్నల్ని ఆపు' అంటూ వార్నింగ్ ఇచ్చి వాటిని కట్టడి చేసింది.

"ఏ జబ్బూ లేని మామూలు మనిషి మీరిప్పుడు. రాబోయే ఐదు సంవత్సరాలలో ఏ ప్రాబ్లెమూ తలెత్తకపోతే అది మరి తిరగపెట్టనట్లే అనుకోవచ్చు. నీరసం ఎక్కువగా ఉందా?

మీ శరీరాన్ని తనంత తాను కోలుకునేలా చేయాలి. బలమైన ఆహారం తీసుకుంటూ వ్యాయామం చేస్తూ ఒక రొటీన్‌కి అలవాటు పడితే మీ శరీరం దాని పూర్వపు పటిష్టతకి త్వరలో వచ్చేస్తుంది.

**కొత్తగాలి...**

**మంత్రి పదవి రావడం**
**గుడ్‌లక్**
**నిలబెట్టుకోకపోవడం**
**తుగ్లక్**

**-సంగంబండ జగన్నాథరెడ్డి, మహబూబ్‌నగర్**



ఇంకా మీరు చిన్నవారు. నీరసం తగ్గకపోతే ఈ మందులు వాడండి" అంటూ మందులు రాశాడు డాక్టర్ రాయుడు.
మూడు నెలల క్రితం శక్తి విహీనంగా ఉన్న తను ఈ మూడు నెలలలో బాగానే కోలుకుని తిరిగి సామాన్య జీవన స్రవంతిలో పడింది. వైద్యం చేసిన రాయుడికి తను రుణపడి ఉంది! అనుకుంటూ వాహ్యాళికి వెళ్ళి వస్తూ చీకటిలో దేనినో గుద్దేసింది. కాలి బోటనవేలుకి కలుక్కుమని ఏదో ముల్లు గుచ్చుకున్నట్లనిపించినా పట్టించుకోకుండా ఇంటికి చేరి కాళ్లని శుభ్రంగా కడుగుకుని దాని గురించి ఇంకేమీ పట్టించుకోలేదు.

మర్నాటి సాయంకాలానికి జ్వరం, బొటనవేలు వాపు కనిపించినా క్రోసిన్ మాత్రలు వేసుకుని తాత్కాలిక ఉపశమనం పొందింది. మరో రెండు రోజులు గడిచేసరికి కాలు అంతా సలుపు పెడుతుంటే, బాధని భరిస్తూ సాయంకాలం డాక్టర్ రాయుడి దగ్గరకి వెళ్లింది.

డిస్పెన్సరీకి తాళం వేయబోతున్న డాక్టరు రాయుడు తను రిక్షా దిగడం గమనించి, "ఏమైంది? " అంటూ డిస్పెన్సరీ తలుపు తెరిచాడు. కాలుని చూపించి జరిగినది చెప్పింది జలజ.

"తుప్పు పట్టినదేదో మీ కాలుకి గుచ్చు

కుంది. మీరు ఈ మధ్యకాలంలో ఏ.టి. యస్. తీసుకున్నట్లు లేదు. సెప్టిక్ అయింది. ఇంజక్షనిస్తాను, అలా పడు కోండి" అంటూ వెన్వెంటనే ఇంజక్షని చ్చాడు.

కళ్లు తెరిచి చూసేటప్పటికి ఎదురుగా సరోజ, మనవరాలు నందిని, అల్లుడు. అందరూ ఆదుర్దాగా తనవేపే చూస్తుం డంతో, "ఏమయింది?" అనడిగింది జలజ.

"మరేమీ లేదు, జ్వర తీవ్రత వలన మీరు తెలివిరాకుండా అలాగే ముప్పయి ఆరు గంటలు నిద్రపోయారు, అంతే" అంటూ డాక్టర్ రాయుడు నవ్వుతూ దగ్గ రకి వచ్చాడు.

జలజ నమ్మనట్లు మొహం పెట్టింది.

మొన్న సాయంకాలం నూట రెండు డిగ్రీల జ్వరంలో కుంటుకుంటూ రిక్షా దిగారు. మిమ్మల్ని బల్లమీద పడుకోబెట్టి ఇంజెక్షన్ ఇచ్చాను. అంతే మీరు నిద్రలో నికి జారిపోయారు. గోపీని పంపి మీ ఇంటికి కబురుపెట్టి, మీ కాలికయిన పుండుకి ఒక చిన్న చిల్లు పెట్టి శుభ్రంగా కడిగేసేను. ఇప్పుడు మీకు బాధ బాగా తగ్గి ఉండాలి" అన్నాడు డాక్టర్ రాయుడు.

"మరి నాకు తోడుగా ఇక్కడ ఎవరు పడుకున్నారు?" ఇంకా ఆశ్చర్యంగా తేరు కొని జలజ అడిగింది.

"నందినీకి జ్వరం. అందుకే నాకు. రాత్రి పడుకోటానికి వీలుపడలేదు.

"ఏమీ ఫరవాలేదు, నేనున్నానుగా" అని డాక్టర్ గారంటే ఆ భారాన్ని ఆయన మీద వదిలేశాం" అంది సరోజ.

"నేను ఒక గంటలో వస్తాను. అంతవ రకు ఎవరో ఒకరు ఇక్కడ ఉండండి. ఆవి డని ఇంటికి పంపడం గురించి నే వచ్చాక ఆలోచిద్దాం" అంటూ డాక్టర్ రాయుడు వెళ్లాడు.

ఆయనకు మనస్సులోనే జోహార్లు అర్పిం చింది జలజ.

★ ★ ★

ఈ రోజు కూడా మిమ్మల్ని అబ్జర్వేషన్‌కి ఉంచి, రేపు డిస్చార్జ్ చేస్తాను. లేదు వెళ్లి పోతానంటే జాగ్రత్తలు చెప్పి ఈవేళే మిమ్మల్ని విడుదల చేస్తాను" అంటూ బెడ్ దగ్గర నిలుచున్నాడు డాక్టర్ రాయుడు.

జలజ ఏదో చెప్పబోతుంటే, "ఇంకో రోజు రమ్మనక ఇక్కడే ఉంచండి. అను మానపడుతూ ఆమెని ఇంటికి తీసుకువె ళ్లడం నాకిష్టం లేదు" అంది సరోజ. అదే తన అభిమతమైనా, సరోజ తన తరపున వకాల్తా పుచ్చుకుని, తన ఉద్దేశాన్ని వ్యక్తప రచడం జలజకి నచ్చలేదు. "తన శరీరం, తన బాగోగులు నిర్ణయించుకోవలసినది తాను. తన మంచి కోరే సరోజ అలా అంది. కానీ ఎందుకో అది తనకు రుచిం చలేదు" అనుకుంది జలజ. ఆ మాటే సరోజ వెళ్లిపోయాక, డాక్టర్ రాయుడితో చెప్పింది.

మీరు నిద్రలో తెగ కలవరించారు. అట్నుంచి ఇటు తిరిగి ఒత్తిగిల్లేక రెండు నిమిషాలలో గాఢ నిద్రలోనికి ఒరిగి మళ్లీ కలవరింతలు. ఇంటికి వెళ్లాక మీ అమ్మాయి కలవరింతల గురించి ప్రశ్నిస్తే నేను ఆశ్చర్యపడను" అన్నాడు డాక్టరు రాయుడు సంభాషణని మొదలుపెడుతూ.

జలజ ఒక్కసారి బిగుసుకుపోయింది. ఏం కలవరించాను? ఈయనని అడగ డమా? కలలో కలవరింతలకి ప్రాధాన్యం అనవసరం అన్నట్లు, ఆ ప్రస్తావన నుంచి సంభాషణను ఇంకోవైపు మళ్లించడమా? కలవరింతలకి, కలలకి ప్రాధాన్యం లేదని ఈ డాక్టర్‌తో ఎలా వాదించగలను? అను కుంటూ జలజ ఆలోచనలో పడింది. డాక్టర్ రాయుడు తననే పరీక్షగా గమనిస్తు న్నట్లు రెండు నిమిషాల తరువాతగాని

గ్రహించలేదు.

"జ్వర తీవ్రతలో ఏవేవో మాటలు బైటికి వచ్చేస్తాయి" అంది ఇంకేమనాలో తెలియక.

"ఔనౌను. కాని చాలాసార్లు "కుమార్", "కుమార్" అంటూ పలవరించారు. ఎవరో అతను మీకు పరిచయమున్న వ్యక్తి అయి ఉండాలి" అన్నాడు డాక్టర్ రాయుడు.

"అన్నిసార్లు పలవరించానా? నిజంగా? మా అబ్బాయిని చూడడానికి న్యూయార్క్ వెళ్లినపుడు పరిచయం అంది. అతను ప్రభాకర్ అని మా బంధువుకి స్నేహితుడు" అంది జలజ ఇబ్బందిగా కదులుతూ.

"కుమార్, కుమార్, ప్రభాకర్ ఫ్రెండ్ న్యూయార్క్‌లో ఉంటాడు. యస్ అతణ్ణి దాదాపు ఇరవై ఏళ్ల క్రితం కలిశాను, మంచి స్పోర్ట్స్‌మన్" అన్నాడు డాక్టర్ రాయుడు.

"ఏక్సిడెంటయి, అతనికి రెండు కాళ్లు తీసేయాల్సి వచ్చింది"

"అరెరె! ఏమయింది? "

కలలో కుమార్ పేరు కలవరించడంలో ఎబ్బెట్టుతనం పోవడంతో జలజ, కుమార్‌తో తన పరిచయాన్ని చాలా మట్టుకు వివరించింది. కాని కుమార్ తనని చూడడానికి రాజమండ్రి వచ్చాడన్నది మాత్రం చెప్పలేదు.

"కుమార్‌ని మీరు ఈ మధ్య ఎప్పుడు చూశారు? అతను ఇంకా న్యూయార్క్‌లోనే ఉన్నాడా? "

"ఆయనని చూసి దాదాపు నాలుగు సంవత్సరాలు అవుతోంది. కుమార్ న్యూయార్క్‌లో ఉన్నాడో లేదో సరిగ్గా తెలియదు"

"అదేమిటి, అంత మంచి స్నేహాన్ని పెంపొందించుకున్న వ్యక్తి గురించి తెలియకపోవడం ఆశ్చర్యంగా ఉంది. జీవితంలో మంచి స్నేహాలు లభించడం కన్నా

## అరువు

బానిసవిధానంపై అమెరికాలోని ఉత్తర, దక్షిణ రాష్ట్రాల మధ్య అంతర్యుద్ధం జరుగుతున్నప్పుడు దాన్ని అణచడంలో జనరల్ మెక్‌క్లెల్లాన్ నాయకత్వంలో ప్రభుత్వ సైన్యం అలసత్వం ప్రదర్శిస్తోంది. యుద్ధాన్ని అనవసరంగా పొడిగిస్తున్నారనే అసంతృప్తికి గురైన సర్వసైన్యాధ్యక్షుడు లింకన్ అతడికి ఇలా లేఖ రాశాడు:



"మీరు సైన్యాన్ని ఉపయోగించుకోకుండా ఊరకనే ఉంటే, దానిని కొంతకాలంపాటు అరువుకు తెచ్చుకోవాలనుకుంటున్నాను

ఇట్లు, మీ గౌరవపాత్రుడు"

మించిన అదృష్టం ఇంకొకటి లేదు నా ఉద్దేశంలో. కొంత వయసు దాటాక స్నేహాలు కలవవు. దానికి ముఖ్యకారణం ఇగోల క్లాష్. మంచి స్నేహాలు చాలా అరుదు" అంటూ సందేహంగా ఆగాడు డాక్టర్ రాయుడు. జలజ ఏమీ సమాధానమివ్వలేదు.

"కొన్ని స్నేహాలు ఎన్ని సంవత్సరాలు గడిచినా వాడిపోకుండా ఉంటాయి" అన్నాడు డాక్టర్ రాయుడు కాస్సేపాగి. తన మాటలకు జలజ ఏం చెబుతుందా? అనుకుంటూ మౌనంగా నిరీక్షిస్తున్నాడు.

"ఇద్దరి వ్యక్తుల మధ్య ప్రేమ ఎందుకు ఉద్భవిస్తుందో చెప్పలేం అంటారు. అలాగే స్నేహాలు కూడా. ఇద్దరి మధ్య అయస్కాంతంలా చటుక్కున అంటుకుని, ఫెవికాల్ పెట్టి అంటించినట్లు నిలిచిపోతుంది. వాళ్ల మధ్య వేలమైళ్ళు దూరం ఉన్నా పక్కగదిలో ఉన్నట్లే అనిపిస్తుంది.



దీనిని ఏ శాస్త్రమూ వివరించలేదు. చాలా జీవితాలు మంచి ప్రేమకి, మంచి స్నేహితులకి నోచుకోకుండానే వెళ్ళిపోతాయి. మంచి ప్రేమ, స్నేహం అనుభవం కలిగిన వ్యక్తులు విశిష్ట వ్యక్తులు అని చెప్పడం అవివేకం. కాని అది ఆస్వాదించినవాళ్ళు అదృష్టవంతులు. అవి లభించినపుడు గట్టిగా వాటిని అదిమిపట్టుకోవాలి. పట్టువదిలితే అంతరిక్షంలో, హైడ్రోజన్ నిండిన బెలూన్‌లా ఎక్కడికో దూరతీరాలకి వెళ్ళి రాప్ అని పేలి ధ్వంసమవుతాయి" అంటూ విచారంలోనికి అడుగుపెట్టింది జలజ.

జలజ కంటిలో నీరు లీలగా కనిపించగానే ఏం మాట్లాడాల్లో తోచలేదు రాయుడికి. "స్నేహం గురించి ఇంత అర్థం చేసు



హక్కును తాను అందిపుచ్చుకుంటూ.

రోజీతో పరిచయం దగ్గరనుంచి ఆమె వెళ్ళిపోవడం వరకు చెప్పి, "ఒక సిగరెట్ కాల్చుకువస్తాను, లేకపోతే మిగతాది చెప్ప లేను" అంటూ బైటకి వెళ్ళేడు డాక్టర్ రాయుడు. పది నిమిషాల తరువాత తిరిగి వచ్చిన డాక్టర్ రాయుడు మళ్లీ మొదలుపె ట్టాడు.

"ఇంటిలో ఏమీ ఆనవాళ్ళు వదలకుండా జాగ్రత్తపడి నన్ను వదిలి ఎక్కడికి వెళ్ళిం దబ్బా? కరుణ ఎలా ఉన్నాడా! అని ఎంత తలబద్దలు కొట్టుకున్నా ఏమీ జవాబు దొర కలేదు. కాకినాడ వెళ్ళి సినిమాహాల్ వీధిలో వాకబు చేశాను. తొమ్మిదేళ్ళలో కాకినాడ, ఆ వీధులలో చాలా మార్పులు వచ్చాయి. రోజీకి తెలిసిన మనుష్యులు ఇద్దరు కనిపించారు, వాళ్ళకి రోజీ గురించి ఏమీ తెలియదన్నారు. రోజీకి మేనమామ నని చెప్పుకుంటూ అడపాతడపా ఇంటికి వచ్చిన వ్యక్తి జ్ఞాపకానికి వచ్చాడు. అతనిది మెడ్రాస్. రాయపురంలో ఉంటాడని ఒక సారి రోజీ చెప్పినది మదిలో మెదిలింది. మెడ్రాస్ చేరుకున్నాను. రాయపురం చిన్న వీధి కాదు. మెడ్రాస్ కాకినాడ కాదు. భూమి ఈనిన జనప్రవాహంలో నాలుగు చదరపు మైళ్ళ విస్తీర్ణంలో, కిక్కిరిసి ఇళ్ళలో నివసిస్తున్న జనాభాలో రోజీ గురించి, ఆమె మేనమామ అని చెప్పుకునే డేవిడ్ గురించి ఎక్కడ వెతకను? ఎలా వెతకను? ఉదయమే బాగా టిఫిన్ తిని, రెండు సిగరెట్ పేకెట్లు జేబులో పెట్టు కుని ఒక ముఖ్యమైన కూడలిలో ఒక కాకా దుకాణంలో కూర్చుని డేవిడ్‌కాని, రోజీకాని కనిపిస్తారేమోనని నా కళ్ళు ఆశగా వెతి కావి. ఒక జంక్షన్ నుంచి ఇంకో జంక్షన్‌కి మారుతూ పదిరోజులు గడిపాను. మరో క్కరోజు చూసి, రాజమండ్రి వెళ్ళిపోదామ

కున్న మీరు కుమార్‌ని ఎందుకు వదిలే శారు" అడిగేడు.

తోకతొక్కిన పాములా విస్తరిల్లి, "అది నా ఆంతరంగిక వ్యవహారం. అలాంటి ప్రశ్నలు వేసే హక్కుగాని, చనువు కాని మీకు లేదు. 'నేను ఒంటరిని' అన్నారు మీరు. ఎన్నాళ్ళుగా మీ ఈ ఒంటరితనం? ఈ ఒంటరితనానికి కారణమేమిటి? " అడి గింది జలజ ఆవేశంగా. అతడికి లేదన్న

## కొత్తగాలి...

**తీయనితలపుల**
**పిలుపులు**
**రాతిరిలో చెరగని జ్ఞాపకాల**
**స్మృతులు! భావనలు**

-ఎల్. ప్రఫుల్లచంద్ర, ధర్మవరం

నుకున్నాను. కాని ఆవేళ డేవిడ్ కనిపించాడు, పరిగెత్తి వెళ్ళి అతనిని పట్టుకున్నాను. నన్ను చూసి డేవిడ్ బిత్తరపోయాడు. తెప్పరిల్లి అరవబోయేడు.

"నిన్నేమీ చేయను, నాతో ఒక కప్పు కాఫీ తాగు" అంటూ సముదాయించి హోటల్‌కి తీసుకెళ్ళి రెండు కప్పుల కాఫీకి ఆర్డరిచ్చాను. ఒక్కసారి నాలో కొండంత బలం వచ్చింది.

డేవిడ్‌ని సగం కాఫీ తాగనిచ్చి "రోజీ ఎలావుంది? " అనడిగాను.

"ఏమో నాకేంతెలుసు? " అన్నాడతను బింకంగా.

ఆ తడబాటు చూసి రోజీ విషయం తనకు తెలుసు అని నిర్ధారించుకున్నాను.

"తెలియదూ? " అంటూ అతని వంక కొరకొరా చూసేసరికి పిట్టంత మనిషి గజగజ వణికిపోయాడు.

అందుకే మెల్లగా-

"ఇప్పుడు రోజీ ఇంటిలో లేదు, బైటికి వెళ్లింది. రేపు ఉదయం పది గంటలకి రా' ' అన్నాడు డేవిడ్, అడ్రస్ రాసిన కాగితం చేతికి అందిస్తూ.

ఆ అడ్రస్ సరి అయినదేనా? లేక తప్పించుకోవడానికి డేవిడ్ ఏదో ఒక అడ్రస్ రాసి ఇస్తున్నాడా? అన్న సందేహం వచ్చినా మౌనంగా ఆ కాగితాన్ని అందుకున్నాను.

మర్నాడు ఉదయం సరిగ్గా పది గంటలకి ఆ అడ్రస్‌కి చేరుకుని తలుపు తట్టాను. డేవిడ్ తలుపు తెరచి పక్కకి తప్పుకున్నాడు. ఇంటిలో అలికిడి లేదు. సోఫాలో కూర్చుంటూ డేవిడ్ వేపు చూశాను.

"స్నానం చేస్తోంది, ఒక పది నిమిషాలలో వస్తుంది" అంటూ లోపలికి వెళ్ళాడు. "స్నానం చేస్తోంది" అని అతను లోపలికి వెళ్ళడం నాకు నచ్చలేదు. పదిహేను నిమిషాలు గడిచేయి. సల్వార్ కమీజ్ దుస్తులతో హాలులోకి వచ్చింది రోజీ.

ఒక్కసారిగా లేచి ఆమెచేతిని అందుకోబోయాను. నాకు దూరంగా జరిగింది రోజీ. అత్యంత సుకుమారమైన రోజీ చేతులే నాకు తెలుసు, కాని నాడు రోజీ చేతుల్లో, చేతల్లో మృదుత్వానికి బదులు కరుకుదనం, మొరటుతనం కనిపించేయి. వెనక్కి జరిగి పరీక్షగా రోజీవేపు చూశాను. ఆ రోజీ నా రోజీలా లేదు. ఆమె వేసుకున్న బట్టలు, కళ్లలో నిరసన, కోపం నేనెరగనివి. నే రాలేదని నిరాశపడి, వచ్చాక ఆనందాన్ని కురిపించిన అలనాటి కళ్లకి, నన్ను చూడగానే విముఖతని, ఏహ్యాన్ని వెదజల్లుతున్న ఈ కళ్ళకి పోలికే లేదు. అనిపించింది. మోతాదుకు మించి కళ్లకి దట్టంగా కాటుక పట్టించింది. బుగ్గలమీద "రోజ్" పౌడర్ అద్దుకోవడంతో బుగ్గలు అసహజమైన మిలమిలని వెదజల్లుతున్నాయి. పెదిమలకి లిప్‌స్టిక్, చూపరులను ఆకట్టుకోవడానికి తయారయినట్లున్న దుస్తులు ధరించింది. మెడ కింద నీలపు రంగు, కమీజ్‌లోంచి తెల్లగా శరీరం దర్శనమిస్తోంది. నాకు ఎనిమిదేళ్లుగా తెలిసిన రోజీ, నా ఎదురుగా ఉన్న రోజీలో పోలికే లేదు. ఎందుకిలా తయారయింది? ఎక్కడికి వెళ్ళడానికి ఉద్యుక్తురాలయింది. నేను వస్తున్నానని తెలిసి కూడా ఇలా వింతగా ప్రవర్తిస్తోందేమిటి? లాంటి సవాలక్ష

ప్రశ్నలు నాలో ఉద్భవించాయి.

"ఏదైనా ముఖ్యమైన పనిమీద బైటికి వెళ్తున్నావా? నీతో మాట్లాడదామని వచ్చాను" అన్నాను.

"అవును, బైటికి వెళ్తున్నాను. నాతో మాట్లాడడానికి ఏమున్నాయి? నన్ను విసిగించకుండా వెళ్ళిపొండి. లేకపోతే గట్టిగా అరుస్తాను" అంది రోజీ.

"నే చెప్పే మాటలు విను" అని నేనంటుంటే విసుగ్గా చేతికున్న గడియారం వేపు చూసుకుంది.

"మళ్ళీ ఇటు రాకండి. డేవిడ్, టాక్సీ వచ్చిందా? " అంటూ వెళ్ళబోతుంటే దారికి అడ్డంగా నిలబడి అడ్డుకోబోయాను. నన్ను బలంగా, దృఢంగా పక్కకి నెట్టి వెళ్ళిపోయింది రోజీ.

"నువ్వు నాకు వద్దు" అని వెళ్ళిపోయిన స్త్రీకి చేరువవుదామనుకోవడం అంత పొరపాటు పని ఇంకొకటి ఈ ప్రపంచంలో లేదు అన్నది మళ్ళీ జ్ఞాపకానికి వచ్చింది. మర్నాడు మళ్ళీ ఆ ఇంటిని సమీపించేసరికి గడియకి వేసిన తాళం వెక్కిరించింది. ఆరాతీయగా, రోజీ రాత్రికి రాత్రే ఆ ఇల్లు ఖాళీ చేసిందని తెలిసింది.

జలజ ఏమీ మాట్లాడకుండా రాయుడిని గమనించసాగింది.

★ ★ ★

"రేపు మీరు ఇంటికి వెళ్ళిపోవచ్చు. మళ్లీ మీరు నన్ను వైద్యుడిగా సంప్రదించడానికి రాకండి. ఇప్పటివరకు చాలా ఆరోగ్యంగా ఉన్న మీకు ఈ వ్యాధి రావడం చాలా విచారకరం. అయితే మీరు ఆ వ్యాధిని త్వరగా కనుక్కున్నారు. అది ఆనందకరం' ' అన్నాడు డాక్టర్ రాయుడు.

"సరోజ నాకు కేరియర్ పంపింది. దానిలో ముగ్గురికి సరిపడేంత ఉంది. మనం కలిసి భోజనం చేద్దాం" అంది జలజ.

దాదాపు రోజూ "మందు" పుచ్చుకునే అలవాటు ఉందని, దాని వలన భోజనం కలిసి చేయడం కుదరదని చెప్పాలని ఉన్నా, జలజ అంటే గౌరవం పెరగడంతో, ఆహ్వానాన్ని తిరస్కరించలేక, "ఎనిమిదింటికి వస్తాను" అన్నాడు డాక్టర్ రాయుడు.

"నాతో భోజనానికి రావడంలో మీకు ఏదో ఇబ్బంది కలిగిందేమో. నాకేమీ అభ్యంతరం లేదు. మీకేదైనా అలవాటు ఉంటే అది కానిచ్చి రండి" అంది జలజ, సరిగ్గా ఎనిమిది గంటలకి వచ్చిన డాక్టర్ రాయుడితో.

"అబ్బెబ్బె! అదేమీ లేదు" అంటూ పళ్లెం అందుకుని దానిలో భోజనం వడ్డించుకున్నాడు డాక్టర్ రాయుడు. అరవై రెండు - అరవై మూడేళ్ళ డాక్టర్ రాయుడు సిగ్గుపడడం వింతగా ఉంది జలజకి. దాని గురించి ఏమీ వ్యాఖ్యానించకుండా తనూ పళ్లెంలో భోజనం వడ్డించుకుంది.

"మీరు పొరపాటు చేశారు. ఆమెని వెంబడించి తిరిగి మీరు మీ జీవితంలోకి ఆహ్వానించవలసింది" అంది జలజ.

"నేను చెప్పలేదా ఉచిత సలహా గురించి! సలహా ఇవ్వడం తేలికే. ఇతరులకి సలహా ఇచ్చే మనకి ఇంకొకరు సలహా ఇస్తే నచ్చదు. మీరు ఇచ్చిన ఈ సలహా గురించి ఆరోజే ఆలోచించాను రెండు సార్లు. నన్ను నేను చంపేసుకుని ప్రాధేయపడ్డాను. ఆమె కరగలేదు. నేను ఏదైనా భరించగలను కాని నిరసనని మాత్రం భరించలేను. అదీకాక ఆమె గురించి తెలియకుండా గడిచిపోయినకాలంలో ఆమె జీవితంలో ఇంకెవరైనా ప్రవేశించారేమో! ఆమె నా దగ్గరికి రావడానికి సుముఖంగా ఉందో? లేదో? ఆమెని వెతకడం అసాధ్యం కాదు. కాని అలా వెతకడం వలన మంచి జరుగుతుందో, చెడు జరుగుతుందో ఎవరికి తెలుసు? అందుకే తటప

## ప్రార్థన..?

ఇద్దరు మతసంస్థకు చెందిన మహిళలు అమెరికా అధ్యక్షుడు లింకన్, కాన్ ఫెడరసీ అధ్యక్షుడైన జఫర్‌సన్ డేవిస్ గురించి వాగ్వాదం చేసుకుంటున్నారు. అంతర్యుద్ధంలో జఫర్‌సన్ గెలుస్తాడని ఓ మహిళ అంది.

దానికి రెండో ఆమె, 'అది నువ్వెలా చెప్పగలవు? ' అంది.

'ఎందుకంటే జఫర్‌సన్ ప్రార్థన చేస్తాడు'

'లింకన్ కూడా ఆ మాత్రం ప్రార్థన చేస్తాడు కదా? '

'అది తెలుసు. కానీ అబ్రహాం లింకన్ కేవలం జోక్ చేస్తున్నాడని దేవుడు అనుకుంటాడు.'




టాయించాను" అన్నాడు డాక్టర్ రాయుడు.

"ఆమె కూడా మీలానే ఆలోచిస్తోందేమో. మీరు మరొక్క అడుగు ముందుకు వేయాల్సింది" అంది జలజ.

"ఆమె జీవితం గురించి నేను చాలా ముందడుగు వేశాను. నాకు ఎప్పుడూ ఒక అనుమానం వస్తూ ఉంటుంది. ఎప్పుడూ పురుషుడే ముందడుగు వేయాలా? అడుగువేసి భంగపడేది ఎప్పుడూ పురుషుడేనా? " అనడిగాడు రాయుడు తీవ్రంగా.

జలజ ఏమీ మాట్లాడలేదు.

పని కుర్రాడు గోపీ వచ్చి కేరియర్ గిన్నెలన్నింటినీ సర్దివెళ్లాడు. "గుడ్‌నైట్. ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. నేను అడిగిన ప్రశ్నకి త్వరలో ఒకరోజు మీ దగ్గర సమాధానం లభిస్తుందని ఆశిస్తాను" అంటూ జలజని ఆలోచనల్లోకి తోసి మెల్లగా అడుగులు వేసుకుంటూ బైటకి నడిచాడు డాక్టర్ రాయుడు.

ఒక్కసారి కుమార్ మనసులోకి వచ్చాడు. ఎవరి గురించో వ్యాఖ్యానించబోతుంటే "నువ్వు ఎంతమందిని పరిశీలించి ఈ నిర్ణయానికి వచ్చావు? మరికొంతమందిని గమనించాక నీ ఈ అవగాహన మారితే? అందుచేత నలుగురి ప్రవర్తన చూసి, దానిని ఆధారంగా ఐదవ వ్యక్తి నడవడి సరిగ్గా లేదన్న నిర్ధారణకి రావడంలో చిక్కులున్నాయి. ఐదవ వ్యక్తిని తప్పు పట్టడం అన్యాయం. ఆ ఐదవ వ్యక్తివి నువ్వే అయితే, ఆలోచించు నువ్వు ఎంత బాధపడతావో! మనిషి యంత్రం కాదు. అతని లేదా ఆమె ప్రవర్తన మనం ఊహించినట్లు మూసపోసినట్లు ఉండదు. ఇతరులని దుయ్యబట్టేటప్పుడు ఈ విషయం గుర్తుండాలి" అన్నాడు కుమార్ ఒకసారి.

తనకి ఒళ్లు మండింది. తనకంటే తక్కువ వయస్సు ఉన్న వ్యక్తి, చాలా సమయం నాలుగు గోడల మధ్యే గడిపే వ్యక్తి, ఏదో ప్రపంచం అంతా చుట్టి వచ్చినట్లు అంతా తెలిసినట్లు అలా మాట్లాడం ఏ మాత్రం నచ్చలేదు. బహుశా అది తన మొహంలో ప్రతిబింబించింది కాబోలు.

"ఈ మాటలు నిన్ను విమర్శించడం కాదు. ప్రపంచం తీరు గురించి చెప్పాను. అది నీ గురించి అని తప్పుగా అన్వయించుకోకు" అంటూ కుమార్ ఇచ్చిన వివరణ తనలో అలజడిని తగ్గించలేదు. మౌనంగా ఉండిపోయింది తను.

కుమార్ దూరమయ్యాక అతను చెప్పిన మాటలు జ్ఞాపకానికి వచ్చి, శాంతంగా ఆలోచిస్తే, అతడి ఉద్దేశాలతో ఏకీభవించకపోయినా, అతని మాటలలో ఉన్న నిజాయితీ తెలియవచ్చింది.

"కుమార్! ఎలా ఉన్నావు? ఎక్కడ ఉన్నావు? " అనుకుంటూ చెదిరిన మన

స్సుతో కుర్చీలో చేరగిలపడింది జలజ. మూడు సంవత్సరాలు ఎంతో సన్నిహితంగా ఏర్పడిన బంధం ఒక్కసారి పుటుక్కున తెగిపోయింది. అది జరిగి దాదాపు నాలుగేళ్లు కావస్తోంది. ఒడ్డున నడుస్తున్న అతనితో, నది మధ్య నావలో ఉన్న తను ఎలా కలిసి ప్రయాణం చేయగలదు? అదే చెబుదామనుకున్న రోజు ఇంకేవో చికాకులు, ఒత్తిడులకి తట్టుకోలేక, 'మీరు మీ దేశం వెళ్లిపోండి' అంది తను. మౌనంగా ఒక నిమిషం కూర్చుని, మెల్లగా లేచి తన కళ్లలోనికి ఒకసారి చూసి బరువైన కాళ్లని ఇంకా బరువుగా కదిలించుకుంటూ వెళ్లిపోయాడు కుమార్. తను అలా అనకుండా ఉండాల్సింది. కాని ఎలా? అన్నయ్య అతని రాకని విచిత్రంగా చూశాడు. కుమార్ రాక, ఇంటికి వచ్చి పదేపదే పలకరించడం, సరోజ కాపురంలో ఎలాంటి దుమారం లేపుతుందో అన్న పిచ్చి భయం తనని ఉక్కిరి బిక్కిరి చేసి, తనతో అలాంటి క్రూరమైన మాటల్ని మాట్లాడించింది.

వెనక్కి తీసుకోలేనిమాట! ఇద్దరి మధ్య ఉన్న బంధాన్ని ఛిన్నాభిన్నం చేసిన మాట అది. ఎదుటి వ్యక్తి ఆత్మగౌరవాన్ని కించపరిచి సమూలంగా నాశనం చేయగల శక్తి ఉన్న మాటలివి.

పాపం కుమార్! విలవిలలాడి ఉంటాడు ఆ మాటలకు.




అట్లాంటాకి వచ్చి రెండు సంవత్సరాలయినా కుమార్‌కి ఆ నగరం నచ్చలేదు. వాతావరణం దృష్ట్యా, వాతావరణ కాలుష్యం దృష్ట్యా, అట్లాంటా నగరం న్యూయార్క్ కంటే మంచిదని అందరూ చెబుతున్నా, కుమార్‌కి ఎందుకో న్యూయార్క్ లాంటి పట్టణం ఇంకేదీ ఉండదనిపిస్తుంది. మంచు కురవడం, ఏప్రిల్ వచ్చేసరికి చెట్లు చిగురించి, ముఖ్యంగా చెర్రీ బ్లోసమ్స్ వికసించడం కుమార్‌కి చాలా ఇష్టం. అదీకాక విభిన్న రకాల మనుష్యులు, వేషభాషలు, ఒకరి గురించి ఇంకొకరు పట్టించుకోని ధోరణి, పుష్కలంగా సహనం ఉన్న న్యూయార్క్, ఎవరిమానాన వాళ్ళని ఎవరికి ఇష్టమయినట్లు వాళ్ళని బతకనిచ్చే న్యూయార్క్ అంటే కుమార్‌కి వల్లమాలిన ఇష్టం. నదిలో కింద కదులుతూ బైటకి కనిపించని చేపపిల్లలా, న్యూయార్క్ నగరం అంటే ఇష్టపడడానికి జలజ ఒక అదృశ్య కారణం. ఆ నగరంలోనే ఆమెతో పరిచయం పెరిగి, గాఢ స్నేహంగా మారి మూడు సంవత్సరాలు పరిగెత్తాయన్న సత్యం కుమార్‌కి న్యూయార్క్ అంటే మక్కువని పెంచింది. కాని అదే న్యూయార్క్ తనకి చెప్పలేనంత విషాదాన్ని కూడ తెచ్చిపెట్టింది. ఆ విచారానికి కారణభూతురాలు కూడ జలజే! నిర్లిప్తతతో కూడిన ఒక రకమైన స్థిరత్వాన్ని ఆపాదించుకున్న తన జీవితంలోకి ప్రవేశించి, అలరించి, ఆహ్లాదపరచి మూడేళ్ళు అతి త్వరగా పరిగెత్తేలా చేసింది. కాని పరమాన్నం తిన్నాక, కషాయం రుచి చూపించినట్లు ఆమెతో మూడేళ్ళ సహవాసాన్ని ఒక్కసారి కత్తితో నరికినట్లు నరికింది. జలజకి గబుక్కున 'పరుషంగా మాటలు విసిరే నైజం ఉన్నప్పటికీ, అది తనకి అర్థమైనా ఆ మాటలు తనకి అశని పాతాల్లా తగిలాయి. తను దానికి సిద్ధంగా

> **కొత్తగాలి...**
>
> తెలంగాణా నాది
> రాయలసీమ మనది
> తెలుగునాడు ఎవరిది
> భావజాలం మారింది
>
> –వేలూరి కౌండిన్య, విజయవాడ

లేదు. తనకి నోటమాట రాలేదు. మొద్దు బారిన మెదడుతో మౌనంగా హోటల్‌కి తిరిగివచ్చి ఇంకెవరినీ కలవకుండా అమెరి కాకి తిరిగివచ్చాడు.

ఇండియా నుంచి తిరిగివచ్చాడన్న వార్త ఎవరికీ తెలియకుండా ఆరు నెలలు గడి పాడు. ఆ ఆరు నెలలు ఎలా గడిచాయో అన్నది తనకి ఇప్పటికీ ఆశ్చర్యమే. ఆఫీ సుకి వెళ్ళకుండా, ఇంట్లోనే ఉంటూ ఆఫీసు పనిచేస్తూ ఆరు నెలలు మగ్గిపోయి గడ పడం అబ్బ ఎంత దుర్భరమైనది.

ప్రభాకర్ కంటపడకుండా ఉంటే, అలా మరికొంతకాలం గడిచేదేమో. కాని ఒక రోజు యాదృచ్ఛికంగా సూపర్ మార్కె ట్‌లో తనని చూసి, 'ఏమిటి ఈ మధ్య ఒంట్లో నలతగా ఉందా? చాలా మార్పు వచ్చింది శారీరకంగా నీలో. కళ్ళు లోతుకు వెళ్ళేయి. వాటీజ్ ది మేటర్ మేన్? " అని తనని ప్రశ్నించేసరికి తనకి సిగ్గువేసింది. ప్రభాకర్ అలా నిశితంగా గమనిస్తూ తనని ప్రశ్నించడం నచ్చక అంతర్లీనంగా కోపం రగులుకుంది. అయినా ప్రభాకర్ మీద కోపం తెచ్చుకోవడమేమిటి? అను కుని ఏదో సమాధానమిద్దామనేలోగా "నేను తొందరలో ఉన్నాను. సాయంకాలం కాని శనివారంకాని వీలయితే, తీరుబడిగా ఉంటే ఫ్లాట్‌కి ఒకసారి రా, కబుర్లు చెప్పు కుందాం" అంటూ ప్రభాకర్ హుటా హుటిన నిష్క్రమించేసరికి తను ఊపిరి పీల్చుకున్నాడు. అబద్ధం చెప్పకుండా గండం గడిచినందుకు ఆనందపడ్డాడు.

ప్రభాకర్ ప్రశ్నకు తన దగ్గర సరయిన సమాధానం లేదు. ఏమని తన పరిస్థితిని అతడికి వివరించగలడు? ఇవ్వాళ అతనికి సమాధానం ఇవ్వకుండా తప్పించుకు న్నాడు. కాని రేపు? ఎల్లుండి? ప్రభాకర్ మనస్తత్వం తనకి తెలిసినదే. అతను ఊరుకునే రకం కాదు. అతనిని తప్పించు కునే మార్గం కనిపెట్టాలి అనుకుంటూ సామాన్లు ఉన్న కార్ట్‌ని కౌంటర్ వేపు తోశాడు. తను ఇండియానుంచి తిరిగి వచ్చాక జబ్బుపడ్డానని అపోహ పడ్డాడు. టైమ్ లేకపోవడం వలన అతనికి తనని మరీ నిలదీసే అవకాశం రాలేదు.

★ ★ ★

"ఎలా ఉంది మా మనవరాలు నంది నికి? ఏమిటి సమస్య? అంత నీరసంగా కనిపిస్తోందేమిటి? " అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది జలజ.

"మీరు ఏమీ కంగారు పడనవసరం లేదు. స్కూల్లోనో ఇంకెక్కడో తిన్న తిండి వల్ల వచ్చింది ఈ ప్రాబ్లెమ్. ఫుడ్ పాయి జనింగ్ వాంతి అయింది. ఇంజక్షని చ్చాను. ఇంకొక గంటలో ఆమె పరిస్థితి మెరుగవుతుంది. నేను వెళ్తాను. ఫోన్ చెయ్యండి అవసరమనిపిస్తే. ఇది నా క్లిని క్‌కు ఆనుకుని ఉన్న మెడికల్ దుకాణం నంబర్. వాళ్లు నన్ను పిలుస్తారు" అంటూ ఫోన్ నెంబర్ రాసిన చీటి ఇచ్చి బయలు దేరబోయాడు డాక్టర్ రాయుడు.

"దానికి తెలివి వచ్చేంతవరకు మీరు ఇక్కడే ఉండండి, ప్లీజ్" జలజ అర్థిం చింది.

"నా గురించి ఒక పేషెంట్ క్లినిక్‌కి వస్తాడు. ఒక గంట ఆలస్యమౌతుందని కబురు చేసి తిరిగి వస్తాను" అన్నాడు రాయుడు. రెండు గంటల తరువాత

నందిని సామాన్యస్థితికి వచ్చాక డాక్టర్ రాయుడు "నందిని కిప్పుడు ఏమీ ప్రాణాపాయం లేదు. మీరు ఎక్కువ కంగారు పడ్డారు" అని వెళ్ళబోయాడు.

"రేపు తీరుబడి ఉన్నపుడు ఒకసారి వచ్చి నందినిని చూడగలరా? " అడిగింది జలజ.

"అలాగే" అంటూ స్కూటర్ మీద కనుమరుగయ్యాడు డాక్టర్ రాయుడు.

మనవరాలికి ఎదురుగా కుర్చీలో కూర్చుని ఆలోచనల్లో పడింది జలజ. రాయుడు మంచి డాక్టర్! వైద్యం చేసేటప్పుడు రోగి, రోగి పరిస్థితి తప్ప ఇంకే విషయాలు ప్రాముఖ్యం కాదు అతనికి. ఆనాడు తనకి, ఈనాడు నందినికి ట్రీట్‌మెంట్ ఇచ్చేటప్పుడు ఒకే ఏకాగ్రత.

పిల్లలంటే రాయుడికి చాలా ప్రేమలా ఉంది. రాయుడికి ఒక కొడుకు కరుణ ఉన్నాడని చెప్పాడు. అతను ఇప్పుడు ఎక్కడ ఉన్నాడు? తల్లి దగ్గరా? అలాంటి తల్లి దగ్గర వదిలేయకుండా, తనతో ఎందుకు కొడుకుని తెచ్చుకోలేదు? ఈమారు కలిసినప్పుడు అడగాలి అనుకుంటూ ప్రశాంతంగా నిద్రపోతున్న మనవరాలి తలపై చేయివేసి జుత్తు నిమిరింది జలజ.

"మా అమ్మాయి మీకు ఈ రెండు వందల ఫీజ్ ఇమ్మంది. మీరు చటుక్కున వచ్చి ఆదుకుని నందిని ప్రాణం కాపాడినందుకు కృతజ్ఞతలు కూడా చెప్పమంది. ఒకసారి వచ్చి మిమ్మల్ని కలుస్తుంది త్వరలో" అంటూ డబ్బు ఇచ్చింది జలజ.

"నా ఫీజు రెండువందలు ఎక్కువేమో" అన్న డాక్టర్ రాయుడి అభ్యంతరాన్ని లెక్క చేయకుండా రెండు వందలని టేబుల్‌మీద ఉంచి వెళ్ళబోయింది జలజ.

"దీని గురించి శ్రమ తీసుకుని ప్రత్యేకంగా వచ్చారు. ఉండండి, కాఫీ తెప్పిస్తాను" అంటూ గోపీని పిలిచి రెండు కాఫీలు పట్టుకురమ్మన్నాడు డాక్టర్ రాయుడు.

"మీకు పిల్లలంటే చాలా ఇష్టంగా కనపడుతోంది. మీకు ఒక కొడుకున్నాడని చెప్పారు. ఇప్పుడు బాగా పెద్దవాడయి ఉంటాడు, ఎక్కడున్నాడో మీకు తెలుసా? " అడిగింది జలజ.

రాయుడు ఏం మాట్లాడలేదు. ఎదురుగా సిగరెట్ అంటే అసహ్యించుకునే జలజ ఉన్నా, దాని గురించి ఏమాత్రమూ పట్టించుకోకుండా సిగరెట్ వెలిగించాడు. ఆ సమయంలో డాక్టర్ రాయుడు చేతులు వణకడం స్పష్టంగా కనిపించి ఆశ్చర్యపడింది జలజ.

"తెలుసు అంటే తెలుసనే చెప్పాలి"

"ఎక్కడ ఉన్నాడు? "

"బూడిదైన మనిషి ఎక్కడ ఉన్నాడో మీరు చెప్పగలరా? "

జలజ ఒక్కసారి షాక్ తింది.

"ఐ యామ్ సారీ, ఎలా జరిగింది? "

"కరుణకి తొమ్మిదేళ్ళ వయస్సులో రోడ్డు మీద క్రికెట్ ఆడుకుంటున్నప్పుడు ఒక లారీ గుద్దేసి చంపేసింది. అది జరిగి చాలా కాలమైంది. అవును, అది జరగకుండా ఉంటే ఇప్పటికి ఇరవైనాలుగు - ఇరవైఐదేళ్ళ వయస్సులో నాకు సహాయంగా ఉండేవాడేమో" అన్నాడు డాక్టర్ రాయుడు.

గోపీ వచ్చి రెండు ఖాళీ కప్పులలోకి బయటనుంచి తెచ్చిన కాఫీని ఒంపి ఇచ్చి గదిలోంచి వెళ్ళిపోయాడు. జలజ నోటిమీద చేయి ఉంచుకుని ఏమి మాట్లాడాలో తెలియక, డాక్టర్ రాయుడికి ఏ రకంగా సానుభూతి తెలియపరచగలనా? అంటూ ఆలోచిస్తోంది.

"ఐ యామ్ సారీ" అని మాత్రం అనగలిగింది. ఒక నిమిషం గడిచేక, డాక్టర్

రాయుడు కాఫీ కప్పు వేపు చేయి చూపించి "కాఫీ తీసుకోండి, చల్లారిపోతుంది" అన్నాడు. జలజ కాఫీ కప్పు చేతిలోకి తీసుకుంది.

"మీరెందుకు సారీ చెప్పడం, మీరేం చేశారు? కరుణ చనిపోవడం దురదృష్టకరం. కాని అంతకన్నా దురదృష్టకరమేమిటంటే వాడు చనిపోయిన సంవత్సరం తరువాత ఆ వార్త నాకు అందడం. చనిపోయిన వ్యక్తిని నేనేమీ చేయలేను. కాని ఏమిటో ఒక్కసారి బూడిద చేసే ముందర చూస్తే, అతను చనిపోయాడన్న నమ్మకం నాకు కలిగేది. అప్పుడప్పుడు అతని చావు నిజమేనా? అన్న అర్థంలేని అనుమానం వస్తూ ఉంటుంది. పరిచయమున్న ఒక వ్యక్తి ద్వారా నాకు కబురు పంపిందిట, ఉత్తరం రాసిందిట. ఆ రోజుల్లో నేను ఠికానా లేకుండా బాగా తాగి రోజులు గడిపేవాణ్ణి. ఆ వార్త నాకు చేరేటప్పటికి ఒక సంవత్సరం దాటింది.

"మనుషులు చాలామంది క్రూరత్వం ప్రదర్శిస్తారు, తమకి అన్యాయం జరిగినట్లనిపించి. వాళ్ళు జీవితంలో ఎప్పుడూ క్షమించలేరు, క్షమించరు. ఇది అందరికీ తెలిసినదే. ఏ వ్యక్తి అయినా తనని తాను క్షమించుకోగలిగిననాడు, ఇతరులని క్షమిస్తాడు.

నామీద రోజీకి చెప్పలేనంత కోపం ఉందేమో, తనకి కావలసినట్లు జరగలేదని కసి అంతర్గతంగా పేరుకుని ఉండిపోయిందేమో! కాని అంత హింసించే విధంగా ప్రవర్తించవలసినంత అన్యాయం తనకి నేను ఏం చేశాను? రోజీ అంత క్రూరంగా ప్రవర్తించి ఉండకూడదు అనుకున్నాను. ప్రేమించిన వ్యక్తుల గురించి చెడుగా ఎలా ఊహించగలం? తను ఉత్తరం రాసే ఉంటుంది, కాని నాకది చేరలేదు. కరుణ బూడిదై చాలా కాలమైంది. దాని గురించి మథనపడి మనస్సుని హింసించుకోవడంలో ఔచిత్యం లేదని, జీవితంలో మరొక విషాదపు పుటని తిప్పేశాను" అని దిగాలుగా చూస్తున్న జలజతో,

"డోంట్ వర్రీ, విషాదం నాకు కొత్తేమీ కాదు. దానికి అలవాటుపడ్డాను. ఒక వ్యక్తి గురించి, లేక ఒక ఆదర్శం గురించి ప్రాణాలని అర్పించడం తేలిక. కాని అలాంటి వ్యక్తి లేదా అలాంటి ఆదర్శం కనిపించడమే చాలా కష్టం!" అన్నాడు డాక్టర్ రాయుడు.

ఆయన మొహం చూడలేక కళ్ళు మూసుకుంది జలజ.

రోజీ అనుకోకుండా జీవితంలో పెద్ద తప్పు చేసింది. రాయుడిని వదిలివెళ్ళడం మాట ఎలా ఉన్నా, దానికి రాయుడు చెప్పిన కారణాలలో ఎంత నిజమున్నా, లేకపోయినా, కొడుకు చనిపోయినపుడు తండ్రికి వార్త అందిందో లేదో అని ప్రత్యేకంగా జాగ్రత్త తీసుకోవలసిన బాధ్యత ఆమె మీద ఉంది అనిపించింది జలజకి. పుత్రశోకంలో ఉన్న ఆమె డేవిడ్ దగా చేస్తాడని ఊహించి ఉండదు. దీనికంతటికీ మూలమైన దోషి డేవిడ్. ఆవేశం తగ్గాక డాక్టర్ రాయుడు అది గ్రహించే కాబోలు రోజీ గురించి ఉన్న అపోహ తొలగించుకున్నాడు. ప్రేమించిన వ్యక్తుల గురించి చెడుగా ఎలా ఊహించగలం? అంటూ రోజీమీద మమకారాన్ని వ్యక్తపరిచాడు. రాయుడిది దొడ్డ మనస్సు! ప్రేమ, స్నేహం ఒకలాంటివే.

కుమార్ జలజ మనసులో మెదిలాడు. "స్నేహితుల గురించి చెడుగా ఎలా ఊహించగలం? " అనుకునే ఔదార్యం కుమార్‌లో ఉందా? ఏమో అనుకుంటూ జలజ కళ్ళు విప్పేసరికి రాయుడు కూర్చున్న కుర్చీ ఖాళీగా కనిపించింది.

**8**



ఆ గది మందంగా ఉన్న వెలుతురులో జీవరహితంగా ఉంది. సాయంకాలం ఐదు గంటలు అవగానే నాలుగు కుట్టుమిషన్ల మీద పనిచేసేవారు వెళ్ళిపోతారు. పని పూర్తయినా, పూర్తవకుండా సగంలో మిగిలిపోయినా వాళ్ళని ఐదుగంటలకు పంపేయడానికి ఒప్పుకుంది రోజీ. చీరలకు ఫాల్స్, జాకెట్లు, బట్టలకు చిన్న చిన్న మరమ్మతులు చేస్తారు ఆ నలుగురూ. డ్రెస్సులు కుట్టే పరిజ్ఞానం వాళ్ళలో ఎవరికీ లేకపోవడంతో కేవలం జాకెట్లు, ఫాల్స్ పనులే ఒప్పుకుంటుంది. పనివాళ్ళకి కమిషన్ లెక్కన డబ్బు ఇస్తుంది రోజీ. జాకెట్ కుట్టడానికి ఖాతాదారు దగ్గర నుంచి ఇరవై తీసుకుని దానిలో పన్నెండు రూపాయలు పనివాళ్ళకి ఇస్తుంది. అలాగే ఫాల్ కుట్టినందుకు కొంత తను ఉంచుకొని మిగతాది వాళ్ళకి ఇస్తుంది. మిషన్ మీద కూర్చున్న ప్రతి వ్యక్తి, పని ఉంటే రోజుకు నాలుగు జాకెట్లు కుడుతుంది. అంటే రోజు ఆదాయం ప్రతి పనిమనిషికి నలభై ఎనిమిది రూపాయలు. నెలకి పదకొండు -పన్నెండువందల ఆదాయం. తనకు కమిషన్‌గా దాదాపు మూడువేలు పైనే మిగులుతాయి. దానిలో బాంక్‌కి ఐదువందలు వడ్డీ కిందకు పోతుంది. ఎనిమిది వందలు గది అద్దె, ఎలక్ట్రిసిటీకి ఖర్చు పోను మిగతాది తనకి సరిపోతుంది. కుట్టుమిషన్లు ఉన్న గదికి వెనకాతల ఉన్న మరో చిన్న గదిలో ఏదో ఒకటి ఉడకేసుకుని రోజులు నెట్టేస్తుంది. ఐదేళ్ళక్రితం కాకినాడ వచ్చిన దగ్గరనుంచి జాకెట్లు కుట్టడానికి చార్జీ స్వల్పంగా పెరిగినా, ఆదాయంలో చెప్పుకోతగ్గ మార్పు రాలేదు. జీవితంకాని జీవితం వెళ్ళదీస్తోంది తను. పనివాళ్ళు వెళ్ళిపోయాక గదిని శుభ్రం చేస్తూ కిటికీలోంచి బైటకి చూసింది రోజీ.

వాన పడతానని బూడిదరంగు చీర కట్టుకుని, కొన్నిచోట్ల వెలవెలాపోయిన మేఘాలు, ఆకాశం కనిపించాయి రోజీకి. బైటకి వెళ్ళి కూరగాయలు తెచ్చుకుందామనుకున్న ఆమె, వానపడే ధోరణి గమనించి, "ఈవేళ ఆవకాయ, పెరుగుతో సరిపెట్టుకోవలసిందే" అనుకుంటూ, గది శుభ్రం చేసేసి కుర్చీలో కూర్చుంది.

ఆకలిగా లేదు కాని, వేడి టీ దానితో పాటు ఉల్లిపాయ పకోడీలు ఉంటే బాగుండును అనిపించినా, కుర్చీలోంచి లేచి టీ కాచుకోవడానికి ఉత్సాహం లేక అలాగే దిగాలుగా ఉండిపోయింది.

ఉల్లిపాయ పకోడీలతో వేడివేడి టీ అంటే చాలా ఇష్టం రాయుడికి.

దాదాపు రెండేళ్ళక్రితం అనుకోకుండా ఆపి ఉన్న కారు దగ్గర నిలబడి సిగరెట్ కాలుస్తున్న రాయుడిని చూసింది. కాని రాయుడు తనని చూడలేదు. చాలా చాలా ఏళ్ళక్రితం నాటి రాయుడికి, ఈ రాయుడికి మధ్య తేడా చాలా ఉంది. మల్లెపువ్వులా మడతలు లేని చొక్కా పేంట్ లోనికి దోపి సినిమా హీరోలా ఉండే అలనాటి ఆ రాయుడికి, నిర్లక్ష్యంగా ఉండి మడతలు పడి వేలాడుతున్న అరచేతుల చొక్కా, చొక్కాకి పొంతనలేని ప్యాంట్, పాత చెప్పులతో ఉన్న ఈ రాయుడికి పోలికేది? అస్తవ్యస్తంగా ఉన్న జుట్టు, వడలిన శరీరం, సిగరెట్లు తాగి తాగి మొరటుబారిన పెదిమలు... ఈనాటి రాయుడుని, ఒత్తుగా

ఎగురుతున్న జుత్తు, నిగనిగలాడుతున్న శరీరం, అత్యంత మృదువుగా కనిపించే అధరాలున్న అలనాటి రాయుడు చూస్తే, ఛీ! అని చీదరించుకుంటాడు. బైటకి కని పించకపోయినా మల్లయుద్ధంలో నేలకరి చిన వీరునిలా ఉన్న ఈ రాయుడిని చూస్తే అప్పటి రాయుడు "టీ తాగి ఉత్సాహం తెచ్చుకో" అంటూ ఐదు రూపా యల నోటుని నిర్లక్ష్యంగా విసిరేవాడివేనా! ఒక్కసారి వెళ్ళి పలకరిద్దామా? అనిపిం చినా, ఇద్దరి మధ్యా అగాధం, విస్తరించిన దూరం, కదిలివెళ్ళిన కాలం ఆ ప్రయ త్నాన్ని విరమింపజేశాయి.

ఇంతలో అతని స్నేహితులు కాబోలు, ఇద్దరు రావడంతో, కారు కదిలిపోయింది.

రాయుడి కారు కనుమరుగయ్యాక అతణ్ణి పలకరించలేకపోయానని ఎంత గింజుకుందో! రాయుడు ఎందుకు కాకినాడ వచ్చాడో? రేపు మళ్ళీ ఆ దారి వెంబట అదే సమయానికి వెళ్తే మళ్ళీ కనిపిస్తా డేమో! ఛ! లభించిన అవకాశాన్ని మీమాంసలోపడి వదులుకుని కనిపిస్తాడో లేదో తెలియని మర్నాడు గురించి ఆశలు అల్లుకుంటోంది. "ఆయాచితంగా లభించిన అదృష్టాన్ని విదిలించుకుని పారిపోయి ఆ చేజారిన రోజుల గురించి అలమటిస్తు న్నాను" అనుకుంటూ తెగమధనపడింది.

జీవితంలో విచిత్రాలు సంభవిస్తుం టాయి. దానికి మర్నాడు రాయుడు కని పించడమే ఒక నిదర్శనం. మర్నాడు తిరిగి ఆ దారిలోనే వచ్చి తనని పలకరిస్తాడని ఆశపడిందే కాని, నిజమవుతుందని అనుకో లేదు. అతను దగ్గరగా వస్తుంటే తను ఎంత కంగారుపడిందో! తనలో భయం ఎంత ముప్పిరిగొందో, గుండె ఎంత వేగంగా కొట్టుకుందో! కాకినాడ సినిమా హాల్ వీధిలో మోటార్‌సైకిల్ గుద్దేశాక, అతను తనని లేవనెత్తి రిక్షాలో కూర్చోపెట్టి నప్పుడు గుండె కొట్టుకునే వేగంకన్నా

## కొత్తగాలి...

**అమ్మానాన్న రూపాయి**
**మమ్మీడాడీ డాలర్**
**మారుతోంది కాలమా...?**
**మనమా...?**

—వి.గీతిక, తాడేపల్లిగూడెం

ఎక్కువ వేగంగా కొట్టుకుంది. తనని రాయుడు నిందిస్తాడేమోనని ఎంత తత్తర పాటు కలిగిందో! కాని రాయుడు అలా చేయకుండా రోజీ బాగున్నావా? నేనేమైనా తప్పు చేశానా? అనడగగానే గుండె వేగం తగ్గింది కానీ కత్తి గొంతులో దిగినట్లనిపిం చింది. తను కనపడగానే రాయుడు విరు చుకుపడి గతంలో జరిగిన పొరపాటన్నీ పునరావృతం చేస్తాడని, నానా తిట్లు తిడ తాడేమోనని అనుమానించిన దానికి పూర్తి విరుద్ధంగా సౌమ్యంగా, మృదువుగా నా వల్ల ఏమైనా పొరపాటు జరిగిందా అనడ గగానే ఆకు మీద పేరుకున్న మట్టిని తడి చేతితో తుడిచి శుభ్రం చేసినట్లు, తనలో అతనంటే ఉన్న భయం, దురభిప్రాయం మాయమయ్యాయి. కంటిలో నీరు తిరి గింది. ఒక పురుషుడు ఒక స్త్రీతో పబ్లిక్ రోడ్డుమీద మాట్లాడుతున్నప్పుడు స్త్రీ కంటిలో నీరు కనిపిస్తే ఆమెకి ఏదో అన్యాయం జరిగిపోతోందన్న ఊహతో, కల్పించుకోవడానికి చాలామంది ముంద రకి వచ్చి ఆరా తీస్తారు. అదే జరగబో తుంటే, తొందరగా సంభాషణ ముగించి సందులోకి హుటాహుటిన మళ్ళింది.

"జీవితం ఎలా గడుస్తోంది?" అనడి గాడు రాయుడు.

"ఏదో వెళ్ళిపోతోంది?" అన్న మాట ఆ ప్రశ్నకి సమాధానం కాకపోయినా అంత

కన్నా మంచి సమాధానం తన దగ్గర లేదు.

ఇరవై ఏళ్లకుపైగా అలజడులతో నిండిన జీవితం గురించి ఒక వాక్యంలో ఎవరైనా ఎలా పొందుపరచగలరు. చదువుకోని తనకి అది మరీ కష్టం. అంతకన్నా తను ఏమీ మాట్లాడలేకపోయింది వెంటనే.

శబ్దం చేసుకుంటూ వాన చినుకులు పడడం మొదలవడంతో, రోజీ ఆలోచనలు ఆగాయి. ఇహ ఈ వానలో బయటికి వెళ్లడం కుదరదని వంటింటిలోనికి వెళ్ళి టీ కాచుకు తెచ్చుకొని కిటికీలోంచి బయట పడుతున్న వానని, మురుగుకాలవలో పరిగెడుతున్న నీళ్ళని చూడసాగింది రోజీ. కాస్సేపటికి రోడ్లమీద ప్రవహించే నీటిలో మురుగు తగ్గింది.

రోజీ గత జీవితం మళ్ళీ పరిగెత్తుకు వచ్చి ముందర నిలుచుంది.

డేవిడ్ రంగప్రవేశం చేయకముందు రాయుడితో జీవితం చాలా ఆనందంగా గడిచేది. వ్యాపారం పెంచడానికి చేసే ప్రయత్నంలో ఒత్తిడి ఎక్కువగా ఉన్నా, రాయుడు అటూ ఇటూ పరుగులు పెడుతున్నా తనకేమీ అశాంతి కాని, అసౌకర్యం గాని కలగలేదు. సినిమాహాల్ వెనకాతల వీధిలో గడిపిన జీవితానికి రాయుడితో గడిపిన జీవితానికి పోలికే లేదు. కరుణ అని పేరు పెట్టుకున్న కొడుకంటే ఇద్దరికి అమితమైన ఇష్టం. వాడి మాటలు, చేష్టలతో దివ్యంగా రోజులు గడిచేయి. ఒక నిర్ణీత నియమబద్ధ జీవితానికి అలవాటవడంతో శరీరంలో సౌష్టవం పెరిగి తనకి కొత్త కళ వచ్చింది. అదే దశలో డేవిడ్ రాకపోకలు ఎక్కువయ్యాయి. రాయుడు వ్యాపారనిమిత్తం ఊర్లంబట తిరగడం ఎక్కువయింది. రాయుడు రాత్రికి ఇంటికి వస్తాడని, సరిగ్గా చేతకాకపోయినా, మంచి కూరలు చేసి అతని కోసం నిరీక్షిస్తే అతను రాకపోయేసరికి నిరాశ అలుముకునేది. అది క్రమేణా నిస్పృహ కింద, అసహనం కింద మారింది. ఇదంతా గమనిస్తున్న డేవిడ్, రాయుడి ప్రవర్తనను విమర్శిస్తూ ఆమెమీద సానుభూతి చూపించేవాడు. ఆమెలో ఉన్న అణువంత అశాంతిని, రాక్షస బొగ్గుని రగిల్చినట్లు రగిల్చి మంటని కొండంత చేశాడు. రాయుడి నడవడిలో తప్పులు ఎన్నడం మొదలు పెట్టింది.

"నువ్వు అతనికి అన్నివిధాలా ఉపయోగపడే బానిసవి తప్ప ఇంకేమీ కాదు. అద్దంలో నీ అందం సరిగ్గా చూసుకున్నావా? నిన్ను అతనేమిటి ఎవరైనా నెత్తిన పెట్టి పూజిస్తారు. నిన్ను అతను ఎక్కడికన్నా తిప్పేడా? స్నేహితుల ఇళ్ళకి కాని, బంధువులు ఇళ్ళకి కాని తీసుకెళ్ళాడా? నీ గత జీవితం వాళ్ళకి తెలిస్తే అతని పరువు పోతుందని భయపడుతున్నాడు. ఎన్నాళ్ళు ఈ నాలుగుగోడల మధ్య మగ్గిపోతావు? మంచో, చెడో అతను నిన్ను కొంత దూరం తీసుకువచ్చి నిన్ను ఇక్కడ బందీ చేశాడు. నీలో అందం ఉంది. నీ గుణగణాలకి గుర్తింపు ఇక్కడ ఎన్నాళ్ళు ఉన్నా లభించదు" అంటూ రాయుడు లేనపుడు వచ్చి తిష్టవేసి ఊదర గొట్టేవాడు డేవిడ్.

తన మాటలు ఆమెమీద పనిచేయడం మొదలు పెట్టేయని గ్రహించాడో ఏమో కాని క్రమేణా డేవిడ్ రాయుడి మీద విషం జల్లడం ఎక్కువ చేశాడు. అశాంతిని రేపి, దానికి ఆజ్యంపోసి రాయుడి నిజాయితీని శంకించే దశకి తీసుకురావడంతో డేవిడ్ మాటలు విని ఇంటిలో ఉన్న నగలు, డబ్బు తీసుకుని అతనితో మద్రాస్ చేరుకుంది.

చెప్పుడు మాటలు విని తప్పుదారుల వెంబట ఎండమావులకై పరిగెత్తి బోర్లపడే

వ్యక్తులకి తనొక నిదర్శనం. నిజమే రాయుడు పనిమీద ఊర్లు తిరిగేవాడు. అది వ్యాపారం కోసమని తనకి తెలుసు. ఐనప్పటికీ రాయుడు ఇంటికి దూరంగా ఉండడానికి ఇంకేవో కారణాలు ఆపాదించి తనలో అసూయని ప్రవేశపెట్టాడు డేవిడ్. తమమీద తమకే నమ్మకం లేని వ్యక్తులు ఎదుటవాళ్ళని అనుమానపూరితంగా చూస్తారు. మెదడులో మంచి మొలవడానికి మాసాలు కూడా చాలవు. కాని చెడు క్షణంలో మొలిచి విస్తరిస్తుంది. ఆ విస్తరించినది చెడు అని గ్రహించేలోగా తను గడప దాటింది.

"రాయుడు వచ్చి, మళ్ళీ తనతో తిరిగి రమ్మంటాడు, ఏవేవో వాగ్దానాలు చేస్తాడు. అవన్నీ నమ్మకు. వెనక్కి తిరిగి చూడకు. నీ భవిష్యత్తు అంతా ముందర ఉంది. అది బాగుచేసుకోవడమో లేక పాడుచేసుకోవడమో అంతా నీ చేతులలోనే ఉంది" అంటూ రాయుడిని అతని ఉదారత్వాన్ని కించపరుస్తూ, కావలసినంత శత్రుత్వాన్ని డేవిడ్ జనింపచేయడంతో రాయుడితో కర్కశంగా ప్రవర్తించింది. ఆత్మగౌరవం ఉన్న ఏ వ్యక్తీ నిరసన భరించలేడు, చీత్కారం అసలే సహించలేడు, రాయుడు వెళ్ళిపోయాడు. రాయుడు మళ్ళీ వచ్చి మరోసారి అడిగితే తను మారిపోతానేమో నన్న భయంతో ఆ అవకాశానికి తావివ్వకుండా రాత్రికి రాత్రే ఇల్లు మార్పించాడు డేవిడ్.

డేవిడ్‌కి ఆమెను ఒక సినిమాస్టార్ చేద్దామని కోరిక ఉండేది. అది జరిగితే, ఏజెంట్‌గా లేదా మేనేజర్‌గా డబ్బు చేతిలో పడుతుందన్న ఆశతో ఆమెను మద్రాసు తీసుకువచ్చాడు.

సినిమాలలో అవకాశం రావడానికి నటనతోపాటు శరీర సౌష్టవం, ముఖ వర్చస్సు ముఖ్యమైనా దానికంటే సినిమాలు తీయబోయే ప్రొడ్యూసర్లని, డైరెక్టర్లని ఆనందంగా ఉంచడం ముఖ్యమైనదని చప్పున తెలియవచ్చింది. ఉచ్చారణ, ఇంగ్లీషు పదాలు వాడడం, అత్యంత ముఖ్యమని తెలుగు తెలిసిన ఒక ఇంగ్లీషు టీచర్ దగ్గర పదిహేను రోజులు పాఠాలు చెప్పించాడు డేవిడ్. ఎంతో ఆర్భాటం చేసి ఫాన్సీ దుస్తులు ప్రత్యేక అలంకరణ చేయించి ఫొటోలు తీయించేవాడు. అవి పట్టుకుని డైరెక్టర్ల, ప్రొడ్యూసర్ల దగ్గరకి తీసుకెళ్ళి అందించాక రెండవ అంకం మొదలయ్యేది. ప్రొడ్యూసరో, డైరెక్టరో పిలిస్తే, వాళ్ల దగ్గరకి వెళ్లే అవకాశం వచ్చాక, టెస్ట్ అంటూ వాళ్లు తనకి ఫొటోలు, అవీ కొన్ని ఇబ్బందికరమైన భంగిమలలో తీసి మళ్లీ కబురు పంపిస్తామనేవారు. పిలుపు వచ్చి రెండవసారి వెళ్లినప్పుడు డేవిడ్ ఆమెను అక్కడ వదిలేక కనిపించేవాడు కాదు. "డైలాగులు చదువు" అంటూ పుస్తకం చేతికిచ్చి, భుజంమీద చేయి వేయడం మొదలుపెట్టి, బట్టలు ఊడదీసి చెలగాటమాడుకోవడంతో ముగిసేది. అలా నాలుగైదుసార్లు డైలాగులు చదివిన తరువాత సినిమాలో అతి చిన్న అవకాశం వచ్చేది.

ఆ దశలో తను పయనిస్తున్న జీవితం గురించి కరుణకి మెల్లగా అర్థమవసాగింది. దానివలనో, ఇంకే కారణంవలనో కరుణలో ముభావత్వం పెరిగి, బైటకి వెళ్తుంటే తనని ఒక విచిత్రమైన భావనతో

## కొత్తగాలి...

**నగరం నాలుగుచెరగులా**
**పోటెత్తే జనం ర్యాలీ**
**ఖర్మకాలితే పైకే...**
**శకటాలపైనుంచి రాలి!**

*–రమ్య, వారాసిగూడ, సికింద్రాబాద్*

చూసేవాడు. అది తనని కించపరిచేదిగా కనిపించడంతో, కరుణ అంటే మొహం చాటేయడం, తప్పించుకు తిరగడం ఎక్కువైంది. ఆదాయం తక్కువ, ఖర్చు ఎక్కువ అవడంతో తెచ్చుకున్న డబ్బు, ఒంటిమీదున్న నగలు మెల్లిగా కరగనారంభించాయి. డేవిడ్ సిగరెట్లకి, తాగుడికి తన దగ్గర డబ్బు అడిగి తీసుకెళ్లేవాడు. మూడేళ్లు గడిచేయి. మద్రాస్ వచ్చి తను సినిమా స్టార్ అవలేదు.

ఒక చిన్న పాత్ర కోసం స్టూడియోకి వచ్చి అక్కడ నిరీక్షిస్తున్న తనని డేవిడ్ వచ్చి ఇంటికి తీసుకువచ్చాడు. లారీకింద పడి అక్కడికక్కడే మరణించిన కరుణ దేహం చూసి తను కళ్లు తిరిగి పడిపోయింది. కరుణ చావుకి తన నిర్లక్ష్యమే కారణమన్న అనుమానం ఎక్కువై కుంగిపోయింది. చావుతోనే జీవిత పోరాటం అంతమవుతుంది. కరుణ చావుతో వాడి జీవితం అంతమయింది కాని తన జీవితం ముగియలేదు. ఆరు నెలలు గడిచాక డేవిడ్ మళ్లీ రంగంలోకి వచ్చి పాతపాటే మొదలుపెట్టాడు. మళ్లీ డైరక్టర్లు, ప్రొడ్యూసర్లే అనుకుని చెప్పుకుంటూ తిరిగే పెద్ద మనుష్యుల ఇళ్లకి పరుగులు మొదలయ్యాయి.

రెండు వందల పౌన్ల శరీరం కింద నూట ఇరవై పౌన్ల ఆమె శరీరం... కబంధహస్తాలలో తన చిన్న శరీరం పిండి కొట్టినట్లు నలిగిపోయి పొంకాన్ని పోగొట్టుకోవడం మొదలయింది. ఆ తరువాత ప్రొడ్యూసర్లు, డైరక్టర్ల నుంచి రెండవసారి పిలుపు వచ్చేది కాదు.

బ్రోకర్ ద్వారా చిల్లర వేషాలు వేసే స్థాయికి ఎదిగింది. అవన్నీ భరిస్తూ రోజులు ఎలాగోలాగ వెళ్తుంటే ఒకరోజు డేవిడ్ ఇంటికి వచ్చి, బాగా తాగి, ఆమె మీదపడి అత్యాచారం చేయడం భరించలేకపోయింది. ఆ రోజుతో ఆమె సహనం చచ్చిపోయింది.

చాలా కాలం క్రితం కాకినాడలో చీకటి బతుకు గడిపినప్పుడు ఆ వ్యాపారంలో ఇద్దరి మధ్య ఒక ఒప్పందం ఉండేది. ఇచ్చిన డబ్బుకి ప్రతిఫలంగా శరీరాన్ని ఒక నిర్ణీత కాలానికి ఒప్పచెప్పడం. కాని మదరాస్‌లో అలా కాదు. అరువు బేరంలా, "నీ శరీరాన్ని నన్ను వాడుకోనీ, అది నచ్చితే, నాకిష్టమైతే నీకు సినిమాలో ఛాన్స్ వచ్చే అవకాశం కల్పిస్తాను" అన్న ధోరణి సామాన్యం. "ఆ ఆశ" కోసం శరీరాన్ని అప్పగించింది చాలాసార్లు. ప్రతిఫలం రాని అరువు బేరాలే ఎక్కువ. ఆమెకిష్టమున్నా లేకపోయినా మొరటుగా ఎవరైనా ఆమె శరీరాన్ని ఆక్రమించుకున్నప్పుడు రాయుడు జ్ఞాపకం రాకుండా ఒక్కరోజు గడవలేదు.

కుడితిలో పడ్డ ఎలుకలాంటి తనను బయటికి తీస్తే, కాస్సేపాగి తిరిగి తను కుడితిలోకే గెంతింది. తనమీద తనకే అసహ్యం, తను అంత పొరపాటు ఎలా చేశానన్న ఆశ్చర్యం తరచూ ఆమెను బాధించేవి.

డేవిడ్ తనమీద అత్యాచారం చేశాక, పోలీసుల్ని పిలిచి అతణ్ణి పట్టించడంతో ఆమెకు చెడ్డ పేరు వచ్చింది. వచ్చే అతి కొన్ని అవకాశాలు ఇంకా తగ్గిపోయాయి. బతుకు ఇంకా హీనానికి జారకముందే మద్రాస్ విడిచిపెట్టి కాకినాడ వచ్చింది.

గత జీవితాన్ని కాకినాడ జీవితం ముసుగేసినట్లనిపించినా, గతం బాధిస్తూనే ఉంది. చేతిలో పైకంలేదు, కాని రాయుడు "నువ్వంటే నాకిష్టం" అంటూ ముద్దు పెట్టుకుని తన చేతికి తొడిగిన ఉంగరం ఉంది. దాన్ని అమ్మి, ఇంటికి ఎడ్వాన్స్, క్రమేణా అప్పు తీరుస్తానన్న ఒప్పందం మీద నాలుగు కుట్టుమిషన్లని అద్దెకి తెచ్చి

ఒక రకమైన జీవితానికి అలవాటు పడింది. ఊరికి మధ్యగా ఉన్నా, పాడుపడిపోయినట్లున్న దుకాణం ఎవరిలోనూ ఆసక్తిని రేకెత్తించకపోవడంతో జీవితం అవాంఛనీయ సంఘటనలను ఎదుర్కోకుండా వెళ్తోంది.

ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నో పట్టణాలున్నాయి. కాని ఇతర పట్టణాల గురించి ఆలోచించకుండా తను కాకినాడకే ఎందుకు వచ్చింది? ఎప్పటికైనా రాయుడు తిరిగి వస్తాడేమోనన్న ఆశ ఒక కారణమా? లేక తెలిసిన ఊరని కాకినాడకి వచ్చిందా? నిజానికి తనకి ఊరు కొత్త అయితేనే శ్రేయస్కరం. తను ఎక్కువ ఆలోచించకుండా కాకినాడ వచ్చింది. చాలా తీరుబడి ఉండడంతో మెదడుని పాత జ్ఞాపకాలు కొరికేస్తున్నాయి. రాయుడు రాజమండ్రిలో ప్రాక్టీస్ పెట్టాడని తెలిసింది. తను కాకినాడలో ఉన్నానని తెలిస్తే వచ్చేవాడా? కరుణ చనిపోయిన సమయంలో రాయుడు వచ్చి ఆ దుఃఖాన్ని తనతో పంచుకుంటాడనుకుంది. కాని రాయుడు రాలేదు. రాయుడికి కబురు అందితే వచ్చేవాడేమో. కానీ డేవిడ్ 'కబురు పంపించాను' అన్ని చెప్పడాన్ని నమ్మింది. నిజానికి డేవిడ్ వెంటనే రాయుడికి కబురు అందించే ప్రయత్నం చేయలేదని తరువాత తనకి తెలిసింది. రాయుడికి తనకి మధ్య వారధి కరుణ. కరుణ మరణంతో కాలువ ఆవల రాయుడు, ఈవైపు తను శాశ్వతంగా ఉండిపోయారు. అందుకే రాయుడు తనని పరామర్శించడానికి రాలేదు అనుకుని రోజులు నెట్టేస్తుంటే రాయుడు తిరిగి కనిపిస్తాడన్న ఊహ వాస్తవమైంది రెండేళ్ల క్రితం. రాయుడికి, తనకి మధ్య నడిచిన సంభాషణ, కేవలం ఐదునిమిషాలు మాత్రమే, ఆరేడు వాక్యాలు. తను తొందరగా నడిచి వీధి మలుపు తిరగకపోతే రాయుడు మరికా

### కొత్తగాలి...

కీచుమని అయాసపడుతూ
పరుగులెడుతోంది నూటెనిమిది
ట్రాఫిక్‌జామయితే చాలు
శీతలమృత్యుస్పర్శే...హతవిధీ!

—శశిధర్, సింహాచలం

స్సేపు మాట్లాడేవాడేమో. తనకి ధైర్యం చాలలేదు. రాయుడు గతం గురించి ప్రశ్నలు వేస్తాడేమోనన్న భయం తనచేత మొహాన్ని చాటేయించింది. రాయుడు మళ్లీ పెళ్లి చేసుకున్నాడా? అతనికి పిల్లలా? భార్య ఎంత అందంగా ఉంటుందో? ఛ! ఈ మగవాళ్లు ఇట్టే ప్రేమిస్తారు, అట్టే మరచిపోతారు అనుకుంటూ అసూయ ప్రజ్వరిల్లబోతుంటే రాయుడు పెళ్లి చేసుకుంటే ఏమిటి, చేసుకోకపోతే ఏమిటి? అని మెదడు మనస్సుని చీత్కరించింది. ఏమిటీ అర్థంలేని ఆరాటం? అనుకుంటూ గింజుకుంది. "వద్దు" అనుకుని అతనికి దూరంగా పారిపోయిన తనకి, తను వదిలివెళ్లాక అతని ప్రవర్తన, నడవడి ఎలా ఉంటే ఏమిటి? అయినా తన మనస్సు ఆగకుండా పరిపరి విధాలు ఆలోచిస్తోంది. ఆ మర్నాడు తిరిగి అదే సమయానికి అదే ప్రదేశానికి చేరి నిరీక్షించినా రాయుడి జాడలేదు. రెండు గంటలు అక్కడ నిలబడి మెల్లిగా కాళ్లీడ్చుకుంటూ ఇంటికి తిరిగి వచ్చింది నీరసంగా.

రాయుడు రాజమండ్రి దానవాయిపేటలో ప్రాక్టీస్ చేస్తున్నాడని తనకి తెలుసు. గంటన్నర ప్రయాణం. ఒకసారి వెళ్లి కలిస్తే? అన్న కోరిక బాగా రెచ్చిపోవడంతో, ఉండబట్టలేక రాజమండ్రి వెళ్ళి, వాకబుచేసి రాయుడి క్లినిక్ దగ్గరకి

వచ్చింది. ఒక మందుల దుకాణంలో పని చేసే వ్యక్తి చెప్పిన ఆనవాళ్ళు విన్న ఇల్లుని సమీపిస్తుంటే, చెప్పలేనంత గుండెదడ! చమట పెల్లుబికింది. క్లినిక్‌లోనికి ప్రవేశం చాక ఎలా ప్రవర్తించాలి? ఏం సంభాషణ మొదలుపెట్టాలి? "ఏం కావాలి నీకు? " అని రాయుడు అడిగితే తన దగ్గర సమాధానం లేదే, అమ్మో! చూద్దామని వచ్చానంటే "నాడు వద్దనుకుని వెళ్ళినదానివి, నేను వచ్చి ప్రాధేయపడినా విసిరికొట్టిన దానివి ఇప్పుడు ఎందుకు రావలసి వచ్చింది? " అనడిగితే తను బతకగలదా? తను రాయుడిని చూడడానికి రాజమండ్రి రావడం తప్పు. "రిక్షా వెనక్కి మళ్ళించు" అని చెప్పేలోగా రాయుడి క్లినిక్‌కి వేలాడుతున్న తాళంకప్ప కనిపించింది. ఒక్కసారి మెదడు తెరపిన పడినా, రెండవవైపు ఇంత దూరం వచ్చి రాయుడిని చూడడం సాధ్యపడలేదే అన్న నిస్పృహ తిరిగి అశాంతిని రేకెత్తించింది. ఆరోజు కాకినాడ తిరిగి వచ్చేక సాయంకాలం గడవడం చాలా కష్టమైంది. రాయుడిని తను ఇంకా ప్రేమిస్తోందా? ఆనాడు తనని సినిమా వీధి ఇంట్లోంచి బైటికి తీసుకువచ్చి కొత్త జీవితం అందించినందుకు రాయుడంటే కృతజ్ఞత, ఆరాధన, గౌరవం ఉండేవి. ఆ మురికి కూపంలోంచి బైట పడకముందు అతను వచ్చినపుడు ఆనందపడేది. అదేనా ప్రేమంటే? విడిపోయి ఒకరికొకరు దూరంగా, పట్టించుకోకుండా చాలాకాలం గడిపాక ఇప్పుడు మళ్ళీ రాయుడంటే తన మనసు ఎందుకు వెంపరలాడుతోంది? నిష్ఠూరపు మాటలు వాడకుండా కుశలమడిగి, గడిచినది మరిచిపోయానేమో అన్న భావాన్ని వ్యక్తపరచినందుకా? అలా ప్రవర్తించి తనంటే ద్వేషం, కోపం, అసహనం పోయాయని సూచించినందుకా? వాటితో పాటు తనంటే ఆసక్తి ఇంకా ఉందని చెబుతున్నాడా? తన ఆలోచనలు ఇంక విపరీతంగా లేని ఆశలవేపు ఎందుకు పరిగెడుతున్నాయి? రేపు ఎదురు చూడడానికి ఏమీలేని తను, రాయుడితో రేపు కలిసి ఉండవచ్చేమో. ఉంటే బాగుండుననే రీతిలో తన ఆలోచనలు కండిషన్ అవుతున్నాయా అనుకుంటూ అలాంటి దురాశలని నాశనం చేయబోయినా అవి చల్లబడ లేదు.

రేపటి సంగతి ఏమిటి? అన్న ప్రశ్నకి సమాధానం తెలియక, వాన తగ్గాక, రోడ్డు మీద పారుతున్న వాననీటిని చూస్తుండిపోయింది.

★ ★ ★

చాలా పుండ్లు తరచూ కెలక్కుండా ఉంటే కాలంతోపాటు మానిపోతాయి. అయితే రాచపుండు అలాంటిది కాదు. మందు ఇచ్చినా, రేడియమ్ ట్రీట్‌మెంట్ చేసినా, చాలా సందర్భాలలో అది మనిషి అంతం చూస్తే కాని వదలదు. రోజీ చేసిన పుండు సామాన్యమైనదని, కాలంతోపాటు మాసిపోతుందనుకునేవాడు రాయుడు కొన్నాళ్ళు. రోజీ గురించి ఏ విధమైన సంభాషణ వచ్చినా, ఎవరైనా ఆమెకి సంబంధించిన ప్రశ్నలు వేసినా పుండు రేగేది. కొన్నాళ్ళకి మళ్ళీ పుండు మానినట్లనిపించేది. కాని ఈ మధ్యకాలంలో, రోజీని కాకినాడ వెళ్ళినపుడు చూశాక, జలజ వేసిన ప్రశ్నల వర్షం వల్ల మొదట్లో సామాన్యమైన పుండుగా ఉన్నా అది రాచపుండుగా మారిందనిపిస్తోంది. ఆ మార్పు వచ్చి చాలా కాలమైందన్న అనుమానం బాగా పెరిగింది రాయుడికి. సంవత్సరాల పర్యంతం రోజీ ఆలోచనల్ని అవలీలగా ఆవలికి నెట్టిన తనకి గత జీవితంలోకి, వెనక్కి తిరిగి చూడడం ఎక్కువై ఆమెని పదే పదే జ్ఞాపకానికి తెచ్చుకుంటున్నాడా? ఆమెతో గడిపిన తీయని కాలాన్ని తరు

# వారెవ్వా!





## అతిపొడవైన చెట్టు

అమెరికాలోని మాంటిగ్‌మోరి అడవుల్లో ఉన్న ఈ రెడ్‌వుడ్ వృక్షరాజం ఎత్తు 366.5 అడుగులు. ప్రపంచంలోనే అతి పొడవైన చెట్టుగా 1998లోనే ఇది గిన్నిస్ బుక్‌కు ఎక్కేసింది.

వాత మిగిలిన చేదు అనుభవం నాశనం చేయలేకపోయిందని అందుకే తిరిగి అలాంటి తీయని రోజులకోసం మనస్సు వాంఛిస్తోందా?

"నువ్వు అయినదానికి, కానిదానికి తెగ ఆలోచిస్తావు, విశ్లేషిస్తావు" అంటాడు సుబ్బారావు తనతో తరచూ. మనలో వచ్చిన మార్పు, మనలో కనిపిస్తున్న మార్పు మనకంటే ఎదుట వ్యక్తులకీ బాగా కనిపిస్తుందన్నది నిజం. ఈ విషయంలో సుబ్బారావు పరిశీలనతో తను ఏకీభవిస్తాడు. సుబ్బారావులో ఉన్న సుగుణం ఏమిటంటే, నీలో ఎందుకు ఈ మార్పు వచ్చింది? అంటూ ప్రశ్నించి ఇబ్బంది పెట్టకుండా మౌనంగా విని, తను చెప్పిన దానిని మాత్రమే అర్థం చేసుకో ప్రయత్నిస్తాడు. తిరిగి రోజీ ప్రత్యక్షమై అలజడిని కలుగచేసిందని సుబ్బారావుకి తెలుసు. తనే చెప్పేడు రోజీని కలిసేనని. తరువాత ఒకే ఒక మాట, మరికాస్సేపు మాట్లాడి ఆమె బాగోగులు అడగాల్సింది" అన్నాడు. అవును, సుబ్బారావ్ చెప్పినట్లు తను సంభాషణ పొడిగించాల్సింది. కాని అది ఎలా సాధ్యం? కాకినాడ పట్టణం మధ్యలో మసీదు దగ్గర, ఆపకూడనిచోట కారు ఆపి ఆగకుండా నడిచివెళ్తున్న ఆమె వెనక పరిగెత్తగలడా? ఆమె దారికి అడ్డు పడగలడా? నడిరోడ్డుమీద సినిమా సీన్ తయారవుతుందని ఆగిపోయాడు తను. అలా కనపడి వెళ్ళిపోయిన రోజీ గురించి తిరిగి మెదడులో రొద ఆరంభమైంది. రోజీ పెళ్ళి చేసుకుందా? సినిమాలో చేరదామన్న వ్యామోహం ఆమెని మెద్రాస్ తీసుకెళ్ళాక, ఆ సుడిగుండంలోంచి బైట పడి చాలామంది గడిపే సంసార జీవితం మొదలుపెట్టడం సులభం కాదు. కాని రోజీకి ఆ పట్టుదల, ధైర్యం ఉన్నాయి. అయితే అలా జరిగిందా? అన్నది ఊహాగానం. జీవిత పుస్తకంలో తన పేజీని రోజీ ఎప్పుడో తిప్పేసింది. తిరిగి ఆ పాత పేజీకి వెళ్ళదు. తను ఆమె గురించి వాకబుచేసి హైరాన పడలేదు. మనస్సులో ఆమె అంటే రవ్వంత ఉత్సుకత ఉన్నా, మెద్రాస్‌లో ఆమె ప్రదర్శించిన తీరు చప్పున దానిని ఆర్పేసింది. రోజీని కలవడం అంటూ జరిగితే అది మళ్ళీ రెండేళ్ళ క్రితం రోడ్డుమీద ఎదురుపడ్డట్టే జరుగుతుంది. అంతకన్నా ఏమీ ఆస్కారం లేదు అనుకుంటూ మూడో సిగరెట్ వెలిగించాడు రాయుడు.

★ ★ ★

"నందినీ, మీ అమ్మమ్మ విమానం ఎక్కి మామయ్యని చూడడానికి అమెరికా వెళ్తోంది తెలుసా?" అంది సరోజ నందినితో.

"మళ్ళీ ఎప్పుడు తిరిగి వస్తుంది?"

"ఏమో, క్రితంసారి అమెరికా వెళ్ళినప్పుడు అక్కడ మూడు సంవత్సరాలు ఉండి వచ్చింది"

అడ్డంగా నందిని తల ఊపిందో ఏమో కాని, "నాన్నా నువ్వు చెప్పు, అమ్మమ్మ అన్నాళ్ళకి ఊరు వెళ్తుందా?" అంది నందిని.

"త్వరలోనే వచ్చేస్తుంది నందినీ. నువ్వు అనవసరంగా కంగారుపడకు" అంటూ నర్సింహం సర్ది చెప్పాడు కూతురికి. కాస్సేపయ్యాక-

"అత్తయ్య వెళ్తే నీకు పని బాగా ఎక్కువవుతుంది" అన్నాడు నర్సింహం భార్య సరోజతో.

"మరేమీ ఫరవాలేదు. కొన్నాళ్ళు మా అమ్మ సారథి దగ్గరికో ఇంకెక్కడికో వెళ్తే నందిని ఒక దారిలోనికి వస్తుంది. పనిమనిషికి జీతం పెంచి ఇంకొన్ని పనులు చేయించుకుంటాను. ప్రపంచంలో తల్లులు కూతుళ్ళ దగ్గరే శాశ్వతంగా ఉండిపోరుగా"

అంది సరోజ.

“హైదరాబాద్ వరకు వెళ్ళి అత్తయ్యని విమానం ఎక్కించి వస్తే బాగుంటుంది. కాని నువ్వు అనవసరం అన్నావు”

“ఎందుకూ అనవసర ప్రయాణం? మా పిన్ని, ఆమె పిల్లలు హైదరాబాద్‌లో ఉన్నారు. వాళ్ళే అంతా చూసుకుంటారు. మా అమ్మ అప్పుడే రెండుసార్లు ఒకర్తీ అమెరికా వెళ్ళి వచ్చిందన్నది మరచిపోయారా? తనకి అన్నీ తెలుసు. డాక్టర్ రాయుడు ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేశారు” అంది సరోజ.

“నందినికి ఆమె దగ్గర చేరువెక్కువ, బెంగపడుతుందేమో? ”

“కావచ్చు కాని పిల్లలు ఆటల్లోపడి ఇట్టే మరచిపోతారు. అదీకాక మా అమ్మ అక్కడ అట్టేకాలం ఉండలేదు”

“అదేం? ”

“ఇక్కడ పెత్తనం చెలాయించినట్లు అక్కడ పెత్తనం చెలాయిస్తే గిరిజ ఊరుకోదు. అలాంటిచోట ఆమె ఇమడలేదు. చూస్తూ ఉండండి” అంది సరోజ.

లోపల జరుగుతున్న సంభాషణ అంతా ముందర గదిలో నిద్రపోతున్నట్లు కళ్ళు మూసుకున్న జలజకి స్పష్టంగా వినిపిస్తోంది. గట్టిగా కళ్ళు మూసుకుంది జలజ.

★ ★ ★

“హైదరాబాద్‌లో నాకు కొన్ని పనులు ఉన్నాయి. అవి పూర్తి చేసుకుని మిమ్మల్ని విమానం ఎక్కిస్తానంటే మీరు వద్దన్నారు” అన్నాడు డాక్టర్ రాయుడు. గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో సామాన్లు ఎక్కించాక, బండి బయలుదేరడానికి సిద్ధంగా ఉంది. తను వెళ్తుంటే నందిని రాగాలు పెడుతుందని సరోజని నందినిని స్టేషన్‌కి రావద్దంది. నర్సింహం మాత్రం స్టేషన్‌కి వచ్చాడు.

“మా అమ్మాయి, మనవరాలి బాగోగులు అప్పుడప్పుడు చూస్తుంటారుగా” అంది జలజ రాయుడితో.

“భేషుగ్గా. మాలాంటివాళ్ళు వెళ్ళలేం. అమెరికా ట్రిప్ కొట్టిరండి. అందరి దగ్గరికీ వెళ్ళి సరదాగా గడపండి” అంటూ పరిహాసమాడాడు డాక్టర్ రాయుడు. కనుమరుగవుతున్న రాయుడిని చూస్తూ చేయి ఊపింది జలజ.

## 9



**తు**పాను ప్రభావంగా బైట గాలులు బలంగా వీస్తున్నాయి. మోటార్‌సైకిల్ రేస్‌లో మోటార్‌సైకిల్ నేలకి ఏటవాలుగా ఒంగినట్లు బలమైన గాలి ధాటికి ఓ మోస్తరు ఎత్తుఉన్న చెట్లు బాగా ఒరిగిపోయి కదులుతున్నాయి. దట్టంగా కురుస్తున్న వాన నిటారుగా కాకుండా వంకరగా కురుస్తోంది. ఒకరో, ఇద్దరో తప్ప రోడ్డు మీద పాదచారులు లేరు. దట్టమైన రెయిన్‌కోట్లు, ముసుగులాంటి తలని చుట్టి ఉన్న టోపీలు ఉన్నా, వానచినుకులు బలంగా మొహాలమీద తాకడంవలన కాబోలు, కళ్ళు చికిలిస్తూ, రెయిన్‌కోట్ ఎగిరిపోకుండా జాగ్రత్త పడుతూ నడుస్తున్నారు. గాలి తాకిడికి నడక సాధ్యపడక అప్పుడప్పుడు ఆగి, గాలి ఉధృతం రవ్వంత తగ్గగానే రెండడుగులు వేస్తున్న జనాభాని చూస్తుంటే చాలాకాలం క్రితం న్యూయార్క్‌లో జరిగిన సంఘటన జ్ఞాపకానికి వచ్చింది.

రాత్రి పదిగంటలకి తనూ, జలజ బ్రాడ్వేలో షో చూసి థియేటర్‌లోంచి బైటకి వచ్చారు. వాతావరణం బాగుండ దని టెలివిజన్ చూసినప్పుడు తెలిసినా, అంత దారుణంగా విషమిస్తుందని ఊహిం చలేదు. దళసరి ఉన్ని కోట్లు వేసుకున్నా బలంగా వీస్తున్న గాలి ఉష్ణోగ్రతని ఇంకా దిగజారుస్తోంది. ఉన్నట్టుండి మంచు రజ నులా కురవడం మొదలయింది. ఒకేసారి థియేటర్‌లోంచి దాదాపు మూడువందల మంది ప్రేక్షకులు బైటపడి టాక్సీల కోసం, తమ తమ వాహనాల కోసం పరుగులు తీస్తుంటే రోడ్డు, పేవ్‌మెంట్ తెగ రద్దీగా ఉన్నాయి. ఇనుపరజనులాంటి మంచు కార్లమీద, దుస్తులమీద పడి "ఉఫ్" "ఉఫ్" మని శబ్దం చేస్తుంటే జలజ ఇబ్బంది పడుతూ చేయిని మొహానికి అడ్డుపెట్టు కుని మంచు రజను మొహంమీద పడ కుండా చేతిని అటూ ఇటూ మారుస్తోంది. తను ఆమె వేసుకున్న మఫ్లర్‌ని ఊడతీసి, మంచుమొహంమీద పడకుండా కప్పి, బిల్డింగ్ అంచున నిలబెట్టి, "ఇక్కడే నిల బడి ఉండు, టాక్సీ తీసుకువస్తాను" అంటూ వీధి చివరకి నడిచి, పదినిమి షాలు తరువాత దాదాపు తడిసి ముద్దయి టాక్సీతో వచ్చాడు. ఫ్లాట్‌కి చేరాక తను తడిసిపోయేనని జలజ ఎంత రభస చేసిందో?

ఆ మూడేళ్ళలో అలాంటి జ్ఞాపకాలు ఎన్నో! కాని ఆఖరిసారి సంభాషణ వాట న్నింటినీ తుడిచిపెట్టి చేదును మాత్రమే మిగిల్చింది. చాలాకాలమైంది జలజని చూసి, ఎలా ఉందో! కూతురు, మనవరా లుతో హాయిగా, ఆనందంగా కాలం గడు పుతూ ఉంటుంది. ఆ మార్గాన్ని జలజ ఎన్నుకున్నది కాబట్టి, జీవితం సాఫీగా ఆశించినట్టు వెళ్తుండవచ్చు ఆమెకి తన ఉనికి, చాలా సమయం క్రితమే రైలు దాటి వెళ్ళిన చిన్న స్టేషన్‌లా మరుగున పడి ఉంటుంది. వార్తాపత్రికలు, ముఖ్య మైన వార్తల్ని మొదటి పేజీలో మొదలు పెట్టి, దాని గురించి కాస్తంతే రాసి, మిగ తాది ఆరవ పేజీలోనో, ఏడవ పేజీలోనో ప్రచురిస్తాయి. జలజతో పరిగెత్తిన ఆ మూడు సంవత్సరాలు తన జీవితంలో మొదటి పేజీలో ప్రచురించిన అసంపూర్తి వార్తలాంటిది. మిగతాది, తరువాయి భాగం మిగతా పేజీలలో ఉందేమోకాని ఆ పుటలు తనకి కనిపించడంలేదు.

గాజు కిటికీమీద బలంగా వీచిన గాలి తాకిడికి అయిన శబ్దం కుమార్‌ని మళ్ళీ వాస్తవంలోకి తెచ్చింది. కుర్చీలో కూర్చుని ప్రభాకర్ దగ్గరనుంచి వచ్చిన ఉత్తరం విప్పాడు కుమార్.

'న్యూజెర్సీలో ఇల్లు కొన్నాను. న్యూయార్క్ వదిలేశాను. కొత్త ఇంట్లోకి సామాన్లని ఈ నెల ఇరవైఆరో తారీకున చేరవేస్తున్నాను. అది జరిగిన వారంరోజు లకి అంటే మూడవ తారీకున ఒక చిన్న పార్టీలాంటిది పెట్టి "నేను న్యూజెర్సీలో ఉన్నానోచ్" అంటూ అందరికీ తెలియపరు స్తాను. నీకు వీలయితే రా. నీకు రావడా నికి రెండువందలు ఏభైడాలర్లు ఖర్చు అవు తాయి. రాలేకపోతే ఆ రెండువందల డాల ర్లకి చెక్‌పంపు, ఇంట్లో హంగులు అమర్చ డానికి పనికివస్తుంది. ఊరికే జోక్‌గా రాశాను, ఆ పనిమాత్రం చేయకు. నువ్వు వస్తావనే ఆశిస్తాను' అంటూ ఆప్యాయంగా పంపిన ప్రభాకర్ ఆహ్వానాన్ని మరొకసారి చదువుకున్నాడు కుమార్. ప్రభాకర్ తనకి మంచి మిత్రుడు. అతను కొత్తగా కొను క్కున్న ఇల్లు చూడడానికి వెళ్ళాలి అను కుంటూ కంప్యూటర్ ఆన్‌చేసి, న్యూజెర్సీ వెళ్ళి రావడం కోసం విమాన ప్రయాణానికి టిక్కెట్ కొనుక్కుని కంప్యూటర్ ఆఫ్ చేస్తుంటే జలజని మొదటిసారి అమెరి

కాలో చూసిన సంగతి జ్ఞాపకానికి వచ్చింది.

ప్రభాకర్‌ని ముఖాముఖి కలిసినపుడు జలజ గురించి వాకబు చేయాలి. ఎలా ఉందో? అనుకుంటూ బైట ఉధృతంగా ప డుతున్న వాన, గాలిని గమనించసాగాడు కుమార్.

★ ★ ★

సాయంత్రం నాలుగు గంటలే అయినా ఎక్కడా వెలుతురు జాడలేదు. ఆకాశం మీదనుంచి కురుస్తున్న దట్టమైన మంచు భూమిమీద వాలుతూ తన చుట్టూ ఉన్న వాతావరణానికి పాము కుబుసంలాంటి తెలుపుని ఆపాదిస్తోంది. మంచు కురుస్తుండడం వలన విమానం భూమిమీద దిగడానికి బాగా తక్కువ ఎత్తుకి వచ్చేంత వరకు న్యూయార్క్ పట్టణం కనిపించ లేదు, కిటికీలోంచి బైటకి చూస్తున్న జలజకి. రన్‌వేమీద దిగడానికి అవసరమయ్యే లేండింగ్ గేర్లు శబ్దంచేస్తూ బైటకి రావడం విన్న జలజకి ఇంత విపరీతమైన వాతావరణంలో పైలట్‌కి రన్‌వే సరిగ్గా కనిపించకపోతే ఏమౌతుందో! అనుకుంటూ ఆశ్చర్యంతో కూడిన భయాన్ని అదిమి పట్టుకునేలోగా చిన్న కుదుపుతో విమానం భూమి మీద వాలి, రన్‌వేమీద మెల్లిగా పరిగెడుతోంది.

"పార్క్ చేయడానికి నిర్దేశించిన గేట్ దగ్గరకి మనం ఇంకా రాలేదు. కూర్చోండి, మరొక్క ఐదునిమిషాలు ఓపిక పట్టండి. వెల్‌కమ్ టు కెన్నెడీ ఎయిర్‌పోర్ట్" అంటూ పైలట్ చెప్పినది విని, "అమ్మయ్యా!" అంటూ స్థిమితపడింది జలజ.

"తిండి పదార్థాలు, పళ్లు, విత్తనాలు, మొక్కలు లాంటివి ఏమైనా మీ పెట్టెలలో ఉన్నాయా?" అనడిగాడు కస్టమ్స్ అధికారి. "లేవు" అని సమాధానం ఇచ్చి గ్రీన్ ఛానల్ గేటులోంచి బైటపడి, సూట్‌కేస్, హేండ్‌బ్యాగ్ ఉన్న తోపుడు బండిని తోసుకుంటూ బైట నిరీక్షిస్తున్న ప్రజా సముద్రంలో సారథి కోసం జలజ కళ్ళు వెతికేయి.

"అమ్మా ఇటు" అంటూ సారథి దగ్గరగా వచ్చి ప్రేమపూర్వకంగా చూస్తూ లగేజీ ఉన్న తోపుడు బండీని అందుకున్నాడు. "హమ్మయ్య" అనుకుంది రెండవసారి జలజ. మెల్లిగా సారథిని అనుసరించింది.

ఇంటికి చేరాక-

"అమ్మా, వచ్చే శనివారం ప్రభాకర్ కొత్త ఇంట్లోకి గృహప్రవేశం చేయబోతున్నాడు. నువ్వు కూడా నాతో వస్తున్నావని అతనితో చెప్పాను. మరిచిపోకుండా నిన్ను తీసుకు రమ్మన్నాడు" అంటూ సారథి ఆవలించాడు.

"నేను వస్తాలే నీకు నిద్ర వస్తోంది. వెళ్ళి పడుకో. నేను కాస్సేపు టీవీ చూస్తాను" అంది జలజ.

★ ★ ★

ప్రభాకర్ ఇల్లు చాలా కోలాహలంగా ఉంది. పదహారు పదిహేడేళ్లు న్యూయార్క్ పరిసరాల్లో నివసించడంవలన ప్రభాకర్‌కి చాలా పరిచయాలు పెరిగాయి. అతను ఆహ్వానించిన వాళ్ళందరూ రావడంతో ఇంటినిండా జనమే. తనకి తెలిసిన వాళ్ళు ఎవరూ కనిపించక పోవడంతో ప్రభాకర్‌ని పలకరించి సోఫాలో కూర్చుంది జలజ. సారథి, గిరిజలకి పరిచయస్తులు కనిపించగానే వాళ్ళతో బాతాఖానీలో పడ్డారు. అటూ ఇటూ తిరుగుతున్న వాళ్లని గమనిస్తూ ఒక గంట గడిచేటప్పటికి జలజలో విసుగు మొదలైంది. అందరి మధ్య ఉన్నా ఒంటరితనం ఆవహించగా దానిని వదిలించుకోవడానికి బాత్రూం కోసం అటూ ఇటూ చూసింది. నాలుగు బెడ్రూంలు, మూడు బాత్రూంలు

ఉన్నా, ఇంటినిండా ఉన్న జనం సందడిలో ఎక్కడికి వెళ్ళాలో తెలియలేదు జలజకి. ప్రభాకర్ ఇంటికి గృహ ప్రవేశానికి వచ్చిన అతిథులు కొందరు మొదటి అంతస్తులో, మరికొందరు రెండవ అంతస్తులో సర్దు కొని కబుర్లు చెప్పకుంటూ అటూ ఇటూ తిరుగుతూ గదుల సైజు ఎంత, బట్టలు పెట్టుకోవడానికి కావలసినంత స్థలం లేదు. కార్పెట్ రంగు బాగుంది. కాని బాల్కనీలో మొక్కలు అట్టిపెట్టుకోలేదు. అంటూ ఇంటికి ఉన్న గుణగణాలని విశ్లేషి స్తున్నారు. రెండవ అంతస్తులో ఉన్న బాత్రూం దగ్గర ముగ్గురు నలుగురు తచ్చా డుతుంటే మెట్లు దిగి మొదటి అంతస్తు బాత్రూం దగ్గరికి వచ్చి తలుపు దగ్గర ఎవ్వరూ లేకపోవడం చూసి హమ్మయ్య అనుకుంది జలజ. బాత్రూం తలుపు దగ్గ రగా వేసి ఉంది. తలుపు తెరుద్దామని దానికున్న హేండిల్ తిప్పబోతుంటే అదే క్షణంలో బాత్రూంలో ఉన్న వ్యక్తి తలుపు తెరుచుకుని బయటికి వచ్చాడు.

ఆ వ్యక్తి కుమార్.

జలజలో ఆశ్చర్యం, సందేహం, ఆనందం, గిల్టీ ఫీలింగ్ అన్నీ కలగాపుల గంగా ఉద్భవించి, వాటిలో అవి దెబ్బలా డుకోవడంతో నోరు తెరచుకుని అలాగే ఉండిపోయింది. ఎదురుగా తలుపు తెరిచి నిలుచున్న కుమార్ పరిస్థితీ అలాగే ఉండ డంతో, అంత కోలాహలంగా ఉన్న ఇంట్లో ఐదు సెకన్ల పాటు నిశ్శబ్దం నెలకొన్నట్లు అనిపించింది వాళ్లిద్దరికీ.

"బాగున్నారా? " అనడిగిన కుమార్ ప్రశ్నకి తల ఊపి,

"మీరెలా ఉన్నారు? " అంటూ తిరుగు ప్రశ్నవేసింది జలజ.

"ఓ. కే" అన్నాడు కుమార్.

"ఇప్పుడే ఒక్క నిమిషంలో తిరిగి వస్తాను" అంటూ బాత్రూంలోనికి ప్రవే శించి బోల్ట్‌వేసి తల తిప్పగానే ఎదురుగా అద్దంలో కనిపించిన తన ప్రతిబింబాన్ని చూసి ఆశ్చర్యపడింది జలజ. నుదుట పట్టిన చమట, కంపిస్తున్న అధరాలు, రక్తం తన్నుకు వచ్చి ఎర్రపడ్డ మొహం అద్దంలో చూసి అది తనదేనా? అన్న అనుమానం కలిగింది జలజకి. నరనరా లకి అలజడిని కలగచేయడానికి కాబోలు మెదడు కావలసినంత అలజడిని జనిం పచేసి మొట్టమొదట మజిలీ మొహంమీద ఆగింది. బలమైన శ్వాసతో కదులుతున్న ఊపిరితిత్తులు, రక్తపుపోటు ఎక్కువై వేగంగా ఎక్కువ శబ్దంతో కొట్టుకుంటున్న గుండెదడ తగ్గి సామాన్యమవడానికి చాలా సేపు పట్టింది. ఐదు నిమిషాల తరువాత ఉద్వేగాన్ని అదుపులోకి తెచ్చుకుని తలుపు తెరచుకుని బైటికి వచ్చింది జలజ.

"సారీ ఆలస్యమైంది" అంది. బైట బాత్రూం దగ్గరే నిలుచున్న కుమార్‌తో.

"ఆశ్చర్యం మీలో మార్పు వచ్చింది. మనం ఇక్కడ కలుస్తామని నేనూ ఊహిం చలేదు. దాదాపు ఐదు సంవత్సరాలైం దేమో కదా? " అంది జలజ.

"అవును, నేనూ ఊహించలేదు కాని ఆశించాను" అన్నాడు కుమార్.

జలజ తనలోనూ అలాంటి ఆలోచనే ఉందని చెప్పలేదు. ఎందుకు చెప్పడం? చెప్పి బయటపడడం? అనవసరంగా ఎందుకు తొందరపడడం? అతని మాటల్లో ఎంత నిజాయతీ ఉంది? ఎలాంటి నిజాయతీ? అనుకున్నా జలజను "అలాంటి భావన తనకీ ఉందని" చెబితే కుమార్ సంతోషించేవాడేమో, నువ్వు ఎప్పుడూ ఇంతే" అంటూ మెదడులో ఒక భాగం పొడిచింది.

"నాకు ప్రభాకర్ కుటుంబం తప్ప ఇంకె వరూ తెలియదు. ప్రభాకర్, అతని భార్య రత్న చాలా బిజీగా ఉన్నారు. ఒంటరి

తనం ఫీల్ అవుతుంటే ఏం చేయాలో తెలియక బాత్రూం అన్వేషణలో పడ్డాను మీరు కనిపించేరు. వీళ్లలో చాలామందితో మీకు పరిచయం ఉండి ఉంటుంది" అంది జలజ.

"ఎక్కువ మంది కాకపోయినా, నలుగు రైదుగురు తెలుసు. ఎవ్వరితోను త్వరగా కలిసిపోయే అలవాటులేని నేనూ ఏదోలా ఫీలయ్యాను. థ్యాంక్ గుడ్‌నెస్ మీరు కనిపించారు. మీకు అభ్యంతరం లేకపోతే రెండు కుర్చీలు బాల్కనీలో వేస్తాను. కబుర్లు చెప్పుకోవచ్చు" అంటూ కుర్చీల కోసం వెళ్ళాడు కుమార్.

"ఎవరితోనూ తొందరగా కలవలేకపోవడం నీ బలం, అదే నీ బలహీనత కూడా కుమార్" అని యధాప్రకారం విశ్లేషణలో పడింది జలజ.

"ఐ యామ్ సారీ, గతాన్ని మరచిపొండి. పరిస్థితులు నాచేత ఆ మాట అనిపించాయి" అని వెంటనే అనాలని ఉన్నా, సారీ చెప్పడం తనకి చేతకాదు. సారీ చెబితే ఒక మెట్టు దిగజారినట్లే అని పాత ధోరణికి వచ్చి "ఇప్పుడేగా కలిశాం, అంతగా అవసరమనిపిస్తే తరువాత చెబుతాను" అనుకుంటూ కుమార్ తెస్తున్న రెండు కుర్చీలలో ఒక దానిని అందుకుని, కుమార్ వెంట బాల్కనీలోనికి నడిచింది జలజ.

"ఐ యామ్ సారీ, ఆఖరుసారి విచిత్రమైన విషాద పరిస్థితులలో విడిపోయాం" అన్నాడు కుమార్.

"అయ్యో! నేను సారీ చెప్పవలసింది" అని జలజ అనుకుంటుంటే, "మీరు ఈ దేశం వచ్చి ఎన్నాళ్ళయింది? " అనడిగాడు కుమార్.

"దాదాపు మూడు వారాలైంది"

"షార్ట్ ట్రిప్పా? లాంగ్ ట్రిప్పా? "

జలజ ఏమీ సమాధానమీయలేదు. "సారీ వేయకూడని ప్రశ్నలు వేస్తున్నానేమో" అన్నాడు కుమార్.

**కొత్తగాలి...**

**బుర్ఖాలోనైన**<br>
**బ్యూటీ కాంటెస్ట్‌లోనైన**<br>
**నేనొక వస్తువునే**<br>
**బుర్ఖాలో దాచిపెడతారు**<br>
**బ్యూటీ కాంటెస్ట్‌లో ప్రదర్శిస్తారు**

*–డాక్టర్ యార్లగడ్డ నిర్మల, హైదరాబాద్*

"అబ్బే అదేమీ కాదు. నా ప్రోగ్రాం గురించి నాకే ఏమీ తెలియదు ఇంకా. నేను దాని గురించి ఆలోచించలేదు. నాకు టూరిస్ట్ వీసా మాత్రమే ఉంది. ఇంకేమీ ఆలోచన లేకపోతే ఆరు నెలల్లో నేను ఈ దేశం విడిచిపెట్టే వెళ్లాలి. అక్కడ ఇప్పుడు, మా అమ్మాయికి నా అవసరం అంతలేదు. నేను అక్కడ లేకపోయినా, ఎవరికీ మార్పు కనిపించదు. అందుచేత నాకేమీ ప్రత్యేకమైన పరిధులు అంటూ ఏమీలేవు అయినా చూడాలి" అంది జలజ.

"నేను న్యూయార్క్ వదిలిపెట్టి రెండు సంవత్సరాలు కావస్తోంది. రేపు సాయంకాలం అట్లాంటాకి వెళ్లిపోతాను. మనం మళ్లీ కలుసుకునే అవకాశం ఉందో, లేదో" అన్నాడు కుమార్.

"అవును చెప్పలేం. మీరు న్యూయార్క్‌లో ఉంటే కలవడానికి వీలయ్యేది. మీరు ఒక కుర్రవాడిని పెంచుకో ప్రయత్నిస్తున్నారని విన్నాను, నిజమేనా? " అనడిగింది జలజ.

"అవును, జీవితంలో ఒక మార్పు ఉండాలి. బాధాకరమైన మార్పు ఎవరూ కావాలని కోరుకోరు. ఆర్ఫనేజ్‌లో ఉన్న ఒక కుర్రవాడిని తరచూ చూడడానికి

వెళ్తుంటాను. అతనికయ్యే ఖర్చు నేనే భరిస్తున్నాను. భార్యా భర్త ఉన్న కుటుంబానికి దత్తత ఇవ్వడానికి చాలా ఏజెన్సీలు ఇష్టపడతాయి. ఇద్దరు కాకుండా ఒకే పేరెంట్ ఉంటే దత్తత తెచ్చుకోవడం కష్టమే. అయినా అర్జీ పెట్టాను. దాని విషయం త్వరలో తెలుస్తుంది. నిన్ను నువ్వే సంబాళించుకోలేనప్పుడు ఇంకో వ్యక్తికి నువ్వు గార్డియన్ ఎలా అవుతావు అంటారేమో" అన్నాడు కుమార్.

"మీకు తెలిసే ఉంటుంది. సారథి, గిరిజలు ఒక పిల్లవాడిని తెచ్చి పెంచుకుంటున్నారు. ఆ కుర్రవాడి సంరక్షణ కోసం గిరిజ ఉద్యోగం మానేసింది. పిల్లవాడిని నేను చూస్తానని, గిరిజ పనికి వెళ్ళచ్చని నేను నా సహాయాన్ని అందించినా గిరిజ ఉత్సాహం చూపలేదు. బహుశా గిరిజకి నా పెంపకం మీద లేదా నా సామర్థ్యం మీద నమ్మకం కలగలేదేమో. అందుచేత నేను సారథి, గిరిజలకి అంత ఉపయోగపడను. అలాంటప్పుడు నేను అక్కడ ఉండటం కంటే కొన్నాళ్లు న్యూయార్క్‌లో గడిపి తిరిగి వెళ్ళిపోవడం ఒక్కటే మార్గంలా కనపడుతోంది" అంది జలజ.

"మీరు వచ్చి అట్టే కాలం అవలేదు. తల్లిదండ్రులు పిల్లల గురించి వ్యాకులపాటు పడడం సామాన్యమే అయినా, నేను వాళ్లకి ఉపయోగడడంలేదు. అని ప్రతీ క్షణమూ ఆలోచించనవసరం లేదేమో. ఒక వయస్సు వచ్చాక వాళ్లు మీ గురించి ఆలోచించాలి. జీవితకాలమంతా వాళ్ల గురించే మీరు ఆలోచిస్తుంటే, మీ గురించి వాళ్లు ఎప్పుడు ఆలోచిస్తారు? ఆ రెండింటికీ మధ్య గీత ఎప్పుడు గీయాలి? మీరు ఇతరుల గురించి బతకడమే కాకుండా మీ గురించి మీరు బతకాలి. అది నా వ్యక్తిగత ఉద్దేశం. మీకు నేను ఇలా మాట్లాడడం నచ్చకపోవచ్చు. గతంలో మీరు సంగీత పాఠాలు చెప్పేవారు. అక్కడ ఏమైనా ఖాళీ ఉందేమో చూడండి. సమయం గడిచిపోతుంది. నాలుగు డాలర్లు ఆదా చేసుకోనూవచ్చు" అన్నాడు కుమార్

"నేవదిలి వెళ్ళేక సంగీతం చెప్పడానికి ఇంకెవరో వచ్చి ఆ స్థానంలో చేరారు" అంది జలజ.

జలజలో అంతవరకు నెలకొన్న ఒంటరితనం మటుమాయమైంది. చేదు మందు తిన్న తరువాత తేనె నాకితే తీయదనాన్ని ఆస్వాదించినట్లు కుమార్ తిరిగి కనిపించగానే తీయదనం ఆమెలో ఉబికింది.

కుర్రవాడిని దత్తత తీసుకోగానే సారథి ఒక బెడ్ రూమ్ ఉన్న ఫ్లాట్ నుంచి రెండు బెడ్ రూమ్‌లు ఉన్న ఇంటికి అద్దె ఎక్కువ అయినా మారాడు. జలజ ఆగమనానికి ముందు సారథి గిరిజలు ఒక బెడ్ రూమ్ వాడుకునేవారు. రెండవ బెడ్ రూమ్‌ను దత్తత తెచ్చుకున్న కుర్రాడి కోసం కేటాయించారు. అందులో వాడి ఇతర ఆట వస్తువులు ఉన్నాయి. అందుచేత జలజ యథా ప్రకారం గతంలోలా హాల్‌లో పడుకోవలసి వచ్చింది. సారథి, గిరిజల మీద ఆర్థిక ఒత్తిడి పెరగడమేకాకుండా, ఇంటికి రాగానే కుర్రవాడి బాధ్యత అంతా గిరిజ నుంచి అతడికి మారడంతో ఇతర వ్యాపకాలకి సమయం చిక్కేది కాదు. సారథి, గిరిజలకి ఎలా సహాయం చేయాలా? అని ఎంత ఆలోచించినా ఏమీ స్ఫురించక, గింజుకుంటూ ఆ మాటే ఒకసారి టెలిఫోన్‌లో కుమార్‌తో ప్రస్తావించింది జలజ.

"మీ సమస్యలు రెండు రకాలున్నాయి. ఒకటి, మీరు ఉద్యోగం చేసి సారథికి ఆర్థికంగా సహాయపడడానికి ప్రయత్నం. రెండవది, మీరు ఉద్యోగం చేసుకుంటూ ఇక్కడ ఉన్నన్ని రోజులు మీకయ్యే ఖర్చు ఆర్జించుకోవడం. ఈ దేశంలో ఉద్యోగా

### కొత్తగాలి...

ఆకాశం కనులనుండి
రాలిన
ఆనందబాష్పాలే
రాత్రి-నక్షత్రాలు

-దలపాక ప్రకాష్, విజయవాడ

లన్నీ యువకులకే, సాంకేతిక పరిజ్ఞానం ఉన్న వ్యక్తులకే, ఇతరులకి వచ్చే ఉద్యోగావకాశాలు చాలా తక్కువ. అందువలన మీకు మొదటిది సాధ్యం కాకపోవచ్చు. కాని రెండవది సాధ్యమవుతుందేమో, కాని మీకున్న వీసా మీరు పనిచేయడానికి సమ్మతించదు. ఇదివరలోలా ఏదో ఉద్యోగం దొరుకుతుందేమో ప్రయత్నించండి. అది సాధ్యపడకపోతే, ఎవరైనా నలుగురు, ఐదుగురు పిల్లలు సంగీతం నేర్చుకుందామనుకుంటున్నవాళ్ళు ఇక్కడ కనిపిస్తే మీకు తెలియపరుస్తాను. మీ వీసా మిమ్మల్ని అనుమతించినంతకాలం మీకేమీ అభ్యంతరం లేకపోతే నా ఫ్లాట్‌లో ఉన్న రెండు బెడ్రూంలలో ఒక దానిని వాడుకోవచ్చు" అన్నాడు కుమార్. జలజ ఏమీ రియాక్ట్ అవకపోవడం గమనించి "అన్నివిధాలా ఆలోచించండి. ఏవైనా అవకాశాలు ఉన్నాయా? ఉన్నాయంటేనే నేను ముందడుగు వేస్తాను. మీరు వస్తానంటే ఫీజు వగైరాలు మీతో మాట్లాడి నిర్ణయిస్తాను" అంటూ సంభాషణ ముగించాడు కుమార్.

"ఇక్కడ ఇండియన్లు నడుపుతున్న దుకాణాలలో పని చేయవచ్చా?" అని జలజ కాకతాళీయంగా ప్రశ్నించింది సారథిని. అతడు తీవ్రమైన అభ్యంతరం వెలిబుచ్చడంతో ఆ ఆలోచన విరమించుకుంది. అలాంటి దుకాణాలలో కుటుంబ సభ్యులనే ఉపయోగించుకుంటారని, అథవా ఎవరినైనా ఇతరులని నియమించినా జీతం చాలా తక్కువ ఇస్తారని, తమ బంధువులు రాగానే ఉద్యోగం నుంచి తీసేస్తారని సారథి వివరించడంతో మౌనం వహించింది జలజ. ఇతర అవకాశాలు ఏవీ కానరాలేదు జలజకి. అసలే ఇరుకు ఫ్లాట్ అవడంతో బేబీ సిట్టింగ్ వీలవ్వలేదు. ఇతరుల ఇళ్ళకి వెళ్ళి బేబీసిట్టింగ్ చేయవచ్చేమో కాని దానికి కారు అవసరం. కారు, లైసెన్స్ ఇన్స్యూరెన్స్ అన్నీ తలనొప్పులే అవడంతో ఆ మార్గానికి గండిపడింది. అదీగాక బేబీ సిట్టింగ్‌లో ఉన్న ఇబ్బందులు దానికున్నాయి. సమస్య మళ్ళీ మొదటికి వచ్చింది. మొదటి ప్రాముఖ్యత ఇవ్వకపోయినా కుమార్ చేసిన రెండవ ప్రతిపాదన వైపు దృష్టి మరల్చింది జలజ. ఒకరోజు మార్పుకోసం ఎక్కడికైనా వెళ్తే బాగుంటుంది. "వీలుంటే జార్జియా చూడడానికి ఒకసారి రమ్మనమని కుమార్ ఆహ్వానించాడు. వెళ్దామని ఉంది ఏమంటారు?" అని సారథి, గిరిజలని ప్రశ్నించింది జలజ.

సారథి ఏమనుకుంటాడో అని గిరిజ ఎంత తప్పు పట్టుకుంటుందో. అనుకుని భయపడినా తనకు వెళ్ళాలని ఉందని బైటికి వ్యక్తపరచకపోతే ఏదీ సాధ్యపడదని ధైర్యం చేసింది జలజ.

'అలాగే వెళ్ళిరా? అన్నాడు సారథి. మేమూ వచ్చేవాళ్ళమేకాని ఈ కొత్త బాధ్యత, సారథికి సెలవు, మూడు టిక్కెట్లు ఖర్చు మమ్మల్ని ఎక్కడకీ కదలనీయదు' అంది కోడలు గిరిజ.

సారథి గిరిజల విశాల భావాలకు మనస్సులోనే జోహార్లు అర్పించింది. అదే ఇండియాలో అయితే ప్రజలేమనుకుంటారు? ఒక ఒంటరి స్త్రీ, ఒంటరి పురుషునితో ఒకే ఇంటిలో నివసించడమా! ఇది సంఘవిరుద్ధం అంటుంది. ఆమెకి పిల్లలు లేరా?

అక్కడ ఎందుకు ఉండడంలేదని ప్రశ్ని స్తుంది. అలా వీలు కాకపోతే ఒంటరిగా ఎందుకు నివసించదు? అని స్త్రీని ప్రశ్ని స్తుంది. స్త్రీ వయస్సు అరవై ఏళ్ళని వాదిస్తే అది గణనలోనికి రాదంటుంది. ఆమెకి పెళ్ళిళ్ళకి, శుభకార్యాలకి పిలుపులు ఆగిపోతాయి. ఎక్కడైనా ఆ స్త్రీ ఎదురుప డితే మొహంమీద చిరునవ్వు రెండు సెక న్లకి మించి నిలవదు. 'ఎవరు తను? అత నికి నీకు ఏమిటి సంబంధం' అని ప్రశ్నిం చలేక, చేతకాక నాగరికంగా, అధునాత నంగా ఎదురుగా ఏమీ అనకుండా చెవులు కొరుక్కుంటుంది. తమకి అర్థమవని దానికి తమకి ఇష్టం వచ్చినట్లు అర్థం చేసు కుని తాము చేయనిది ఈమె చేసిందని కుత్సితపు ఆలోచనల్ని మనస్సులో మధనం చేసి భరించలేక వమనం చేసు కుంటుంది. మార్పు వ్యక్తికి బాధని కలిగి స్తుంది అంటారు వేదాంతులు. ఇలాంటి మార్పుని సమాజం భరించగలదా? అంత మార్పు అనుకుంటూ సారథి, గిరిజలు తనమీద నమ్మకం, గౌరవం ఉంచినందుకు ఆనందపడింది జలజ.

"కుమార్‌కి ఫోన్‌చేసి తనకి అట్లాంటా వచ్చే ఉద్దేశం ఉందని ఏదైనా ఉద్యోగం దొరుకుతుందేమో చూడు" చెప్పింది జలజ.

"అప్పుడు మీరు కంప్యూటర్‌ని కొంచెం కొంచెం వాడేవారు. ఇప్పుడేమైనా కంప్యూ టర్‌లో ప్రవేశం ఉందా?" అనడిగాడు కుమార్.

"లేదు" అంది జలజ.

"అయితే మ్యూజిక్ లెసన్స్ ఉద్యోగం కోసం వెతుకుదాం" అన్నాడు కుమార్.

"ఉద్యోగం వచ్చినా రాకపోయినా కుమార్ తన గురించి శాయశక్తులా ప్రయ త్నిస్తాడు" అనుకుంటూ ఏమవుతుందో చూద్దాం అని ఆశ నిరాశల మధ్య ఊగి పోతూ కళ్ళు మూసుకుంది జలజ.

★ ★ ★

"ఏమిటీ, ఈవేళ ఇంత ఆలస్యం చేశారు?" అంటూ లోపలికి వస్తున్న జల జని ప్రశ్నించాడు కుమార్. ఉస్సూరంటూ సోఫాలో చతికిలపడింది జలజ.

లింగులింగుమంటూ ఉన్న ముగ్గురికి పాఠం చెప్పడానికి ఇంత సమయం పట్టిందా? అంటూ జలజని సరదాగా ఎద్దేవా చేయబోయాడు కుమార్.

"మీరు ఎన్ని కబుర్లు అయినా చెబు తారు. చెణుకులు విసురుతారు. నామీద ఈ ముగ్గురికీ బాగా నమ్మకం కుదిరితే వాళ్ళు ఇతరులకి నా గురించి బాగా చెప్పి, మరికొందరిని తీసుకువస్తారని నా తాప త్రయం. అలసిపోయి వచ్చింది. నీళ్ళో, జ్యూసో ఇద్దామనిపించకుండా ఈ దెప్పు ళ్ళలో దూరిందే మీ ధోరణి?" అంటూ చీవాట్లేసింది జలజ. నవ్వుకుంటూ లేచి రిఫ్రిజిరేటర్‌లోంచి జ్యూస్ గ్లాసులోనికి వంచి తీసుకువచ్చి జలజకి అందించాడు కుమార్. జలజ జ్యూస్ చప్పరిస్తూ తిరిగి అందుకుంది.

"గంటకి ఆరుడాలర్లు అంటే నెలలో ఒక విద్యార్థి దగ్గర దాదాపు నూట నలభై డాలర్లు అంటే మొత్తం నెలకి నా ఆదాయం నాలుగు వందల బస్ చార్జీలకు పోతుంది. నా కష్టానికిదేనా ప్రతిఫలం" అంది జలజ. ఫక్కున నవ్వేడు కుమార్.

గుర్రుగా అతడివేపు చూసింది జలజ.

కుమార్ నవ్వు ఆపుకుని "మీతో పెద్ద చిక్కే. న్యూయార్క్‌లో ఉన్నపుడు ఏ ఉద్యోగమూ దొరకడం లేదని వాపో యారు. నెలకి నాలుగు వందలు వస్తున్న ఇక్కడా మీరు ఉస్సూరంటున్నారు. ఇప్పుడేగా మీరు మొదలుపెట్టారు. క్రమేణా విద్యార్థులు, ఆదాయం పెరుగు తుందని ఆశిద్దాం ఉదయం టిఫిన్ చేసి

వెళ్తున్నారు. మధ్యాహ్నం లంచ్ సమయానికి తిరిగి వస్తున్నారు. పాఠం చెప్పడానికి ప్రిపరేషన్ ఏమీ అక్కరలేదు. ఒకపని ఏర్పడింది. వ్యక్తిగా మీలో ఆత్మవిశ్వాసం పెరిగింది. అంకుల్ సేమ్‌కి టాక్స్ ఎగవేస్తున్నారు. ఇంకా ఏంకావాలి?" అన్నాడు కుమార్ ఒకపక్క విమర్శ, ఇంకో పక్క ధైర్యాన్ని పెంపొందిస్తూ. జలజ కుమార్ చెప్పిన దాని గురించి ఆలోచిస్తోంది.

"మీకు సంగీతంలో ప్రవేశం ఉంది కాబట్టి చాలా తక్కువైనా చేస్తున్న పని గౌరవమైనది. హోటల్ కిచెన్‌లలో, సరుకులు, అమ్మే దుకాణాలలో పనిచేసే దానికంటే దీనిలో డిగ్నిటీ ఉంది. అది మీ నైజానికి సరిపోయినది. మీకు తీరుబడి ఉంది కాబట్టి దొరికిన దానిని వదలకుండా పని చేస్తున్నారు. ఇండియాలో ఉంటే ఇది చాలా కష్టం. చాలామంది మీకు పోటీగా ఉంటారు. మీలా పిల్లలని చూడడానికి వచ్చి ఉండిపోయిన చాలామంది తల్లిదండ్రులకి చేయడానికి ఏమీ లభించదు. మనవడినీ, మనవరాలినో తోపుడు బండీలో తోసుకుని బయటికి తీసుకెళ్ళడం వాళ్ళ దినచర్యలో హైలైట్. ఇంటిలో వంట వండుతారు. అఫ్‌కోర్స్. ఇండియాలో అంతకన్నా ఏం చేస్తారని మీరనవచ్చు. అవును నిజమే అందుకు వాళ్ళతో పోల్చి చూస్తే మీరు మెరుగు. చిన్న పిల్లల సన్నిధిలో గడుపుతారు. ఒక గంట ప్రతీరోజు" అంటూ ఆగాడు కుమార్.

"మీతో ఏది మాటలాడినా నన్ను ఎంకరేజ్ చేస్తూ లాభాలనే ఉదహరిస్తారు. ఇది మీకు చిన్నప్పటి నుంచీ ఉన్న గుణమా లేక మధ్యలో వచ్చిందా?" అనడిగింది జలజ.

"అస్సలే మీరూ, మీ పరిస్థితి తృప్తికరంగా లేదనుకుంటున్నప్పుడు నేనూ అదే తిరిగి చెబితే మీరు డీలా పడిపోతారు. అది నాకు ఇష్టంలేదు" అన్నాడు కుమార్.

"మీకు సరిగ్గా జ్ఞాపకం ఉందో లేదో దేశం వచ్చి మూడు నెలలు కావస్తోంది. నా వీసా కాలపరిమితి ఆరునెలలు" అంది జలజ.

"మీరు ముందస్తుగా వీసా పొడిగింపునకు అప్లికేషన్ పెడితే మీరు మరొక తొమ్మిదినెలలు ఇక్కడ ఉండవచ్చు. మరో సారి ఇండియాకు ట్రిప్ కొట్టి రావచ్చు. మీరు కావాలంటే సారథి ద్వారా గ్రీన్ కార్డ్ సంపాదించవచ్చు. తరువాత వీసా కాలం అయిపోతోందన్న బెడద ఉండదు. ఇక్కడే ఉండి ఇండియా వెళ్ళి వస్తూ ఉండవచ్చు" అన్నాడు కుమార్.

"ఏమిటి దానివలన ప్రయోజనం? ఇక్కడ ఉన్న సారథికి ప్రత్యేకంగా నా అవసరంలేదు. అక్కడ ఉన్న సరోజకి నా అవసరం ఉంది అన్న భ్రమలో చాలాకాలం ఉండి తేరుకున్నాను. నా ఉనికికి ఎక్కడా విలువ ఉన్నట్టు గోచరించడంలేదు. ఇప్పుడు నా వయస్సు అర్హతై ఒకటి. జబ్బు పడితే హాస్పిటల్‌లో చేరడానికి కావలసిన ఇన్స్యూరెన్స్ లేదు. ఉద్యోగం లేదు. డాక్టర్ రాయుడు అన్నట్లే నేను ఒంటరిని" అంది జలజ బరువుగా నిట్టూరుస్తూ.

"అలా ఎందుకు అనుకోవాలి? ఈ ట్యూషన్లే బాగా నడిస్తే మీ ఖర్చుకి ఇండియా వెళ్ళి రావడానికి కావల్సినన్ని డాలర్లు సమకూర్చుకుంటారు. ఇన్స్యూరెన్స్ ఖరీదు ఎక్కువే కాదనను. ప్రస్తుతానికి మీరు ఆరోగ్యంగా ఉన్నారు. మీ ఆరోగ్యం మీద నమ్మకం లేనపుడు ఏదైనా అనుమానం మొలకెత్తినపుడు ఇండియా వెళ్ళరుగాని. రేపు ఏమీ ఆశాజనకంగా కనిపించడం లేదని మీరు అన్నా ఇక్కడ గడిపినన్నాళ్ళు తరువాత ఏమౌతుంది. అన్న

ఆలోచనల్ని మాత్రం మెదడులోనికి రానీయకండి. ఆలోచించి చూస్తే నేను మీకంటే ఏకాకిని. వచ్చేవారం పెన్సిల్వేనియాలో కేవ్స్ చూడడానికి వెళ్దామని ఉంది. మీరు వస్తారా?" అనడిగాడు కుమార్.

"ఒక విధంగా చూస్తే ఎవరికి వాళ్ళే ఈ లోకంలో. అందరూ ఏకాకులే చివరికి మీరు సూచించినట్లు అటూ ఇటూ తిరుగుతూ సంవత్సరాలు గడిపేస్తే లోకం ఏమనుకుంటుంది? గమ్యం లేకుండా, స్థిరత్వం లేకుండా కుమ్మరి పురుగులా నా పరుగు సరోజ కాపురంలో ఎలాంటి ప్రభావాన్ని చూపిస్తుందో! సారథి, గిరిజలు తను అట్లాంటా వెళతానంటే సరేనన్నారు కానీ నెలల తరబడి ఇక్కడ ఉండిపోయి ఉద్యోగంలాంటిది చేస్తుంటే ఏమనుకుంటారో" అంటూ ఆలోచనలో పడింది జలజ.

"మీరు చెప్పిన దాని బట్టి మీ ఉనికి వాళ్ళకి ఏమీ సహాయపడలేదని, కొన్ని సందర్భాలలో ఇబ్బంది కలిగించిందని అనిపిస్తోంది తప్ప మీ వల్ల వాళ్ళకి ప్రత్యేకంగా ఆనందం కలిగిందని చెప్పలేదు. మీ జీవితాన్ని ఎక్కడ ఎలా గడిపినా ఇండియాలో వాళ్ళకి పట్టింపు ఉండకూడదు. అందులో ఇంత దూరంలో ఉన్న మీ గురించి ఆరా తీసి జీవితాల్ని నాశనం చేయడానికి ఎవరి దగ్గరా తీరుబడిలేదు. అందుచేత ఆ నిర్ణయం మీ మీదే ఆధారపడి ఉంటుంది. ఒంటరిగా బతుకుతూ చుట్టూ ఉన్న ప్రజానీకం బంధువుల రాపిడి బాగుందనుకుని అక్కడే ఉండిపోతారో లేక ఇక్కడ ఉంటారో మీ ఇష్టం. మీ నిర్ణయం ఏదైనా ఈ దేశం వచ్చారు కాబట్టి. తొమ్మిది నెలలు ఇక్కడ గడిపి మీరు మీ ప్రశ్నకి సమాధానం కోసం వెతకండి. నేను మనసా వాచా మీరు ఇక్కడ ఉండాలనే వాంఛిస్తాను. కాదు నేను వెళ్ళిపోతానంటే విచారించినా మీ నిర్ణయాన్ని గౌరవిస్తూ ఈ మనిషి ఇంటి తలుపులు మీకు ఎప్పుడూ తెరిచే ఉంటాయని మరోసారి చెబుతాను" అన్నాడు కుమార్.

జలజ ఏమీ మాట్లాడలేదు. రెండు నిమిషాలు తరువాత ఇప్పుడే వస్తానని బాత్రూంలోకి వెళ్లి లైట్ స్విచ్ ఆన్ చేసింది. ఒక్కసారి బాత్రూంలో ఉన్న ఎనిమిది బల్బుల వెండి కాంతి నలుదిశలా వ్యాపించింది. అద్దంలో తన ప్రతిబింబం వేపు పరీక్షగా చూసుకుంది జలజ.

జుత్తు తెల్ల పడలేదు కానీ బాగా పల్చపడింది. చెక్కిళ్లలో ఉన్న చిక్కతనం తగ్గి కంటి రెప్పల కింద నలుపు చారికలతో పాటు చిన్నమడతలు కనపడుతున్నాయి. నున్నగా ఉంటూ నిగనిగలాడే కంఠం మీద ధృడత్వం లోపించి కంఠనాళం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. భుజాల మీదున్న జాకెట్ కాలం ముందు ఓటమిని తెలియచెబుతుంటే క్రమేణా మారి తన శరీరాన్ని చూసి ఆందోళనతో కళ్ళు మూసుకుంది. ఐనప్పటికీ అద్దంలో తనకి కనిపించిన ప్రతిబింబం కళ్ళముందర నుంచి మాయమవలేదు.

ఏరోప్లేన్ బాత్రూంలో కనిపించిన

### కొత్తగాలి...

**కన్నవారి కన్నా**
**కట్టుకున్నవారి విలువెక్కువ**
**అమ్మపాలుకన్నా**
**డెయిరీ పాలధర తక్కువా?**

*– ఈతకోట సుబ్బారావు, నెల్లూరు-4*

మొహం మరోసారి ప్రత్యేక్షమైనా అప్పటికి ఇప్పటికి ఒక తేడా పసికట్టింది జలజ. శరీరం వడలినా, ముడతలు లీలగా కనిపిస్తున్నా ఈ మొహంలో ఒక రకమైన తళతళ వెలుగు కనిపిస్తున్నాయి.

దానికి ముఖ్యకారణం కుమార్. అవును, కుమార్ విశ్లేషించిన దానితో తను ఏకీభవించక తప్పదు.

కొంత వయస్సు వచ్చాక చాలా కాలం తరువాత రాబోయే సంవత్సరాల గురించి ప్లాన్ చేయనవసరం లేదు. రెండు మూడేళ్ళ తరువాత ఏమౌవుతుందో అని విపరీతంగా ఆలోచించి దానికోసం ఇప్పుడు నడిచే బాటని మార్చుకోవచ్చు కానీ రెండు మూడేళ్ళ తరువాత పరిస్థితులు మారితే ఈ ప్రయత్నం, ఈ ప్లానింగ్ అంతా నిష్ప్రయోజనం. అందుచేత కుమార్ అన్నట్లు తొమ్మిది నెలలు గడిపేస్తే సరి అప్పుడు పరిస్థితులని సమీక్షించి తరువాత అప్పటికి సరి అయినదనిపించే మార్గాన్ని ఎన్నుకోవడం మంచిది అనుకుంటూ మొహం కడుక్కుని, పౌడరు అద్దుకుని చిరునవ్వుతో బైటికి వచ్చింది జలజ.

తేరుకుని రవ్వంత కొత్త వెలుగుని ఆపాదించుకు వచ్చిన జలజని ఆసక్తితో గమనిస్తూ "ఈవేళ మీరు వంటచేసే ఉత్సాహంలో లేరు. చైనీస్ తిండి తిందామా? మనం వెళ్లబోయే ట్రిప్ గురించి చెబుతాను" అన్న కుమార్ ప్రతిపాదనకు 'సరే' అంది జలజ.

"నాకు ఒక చిన్న పని ఉంది, అరగంటలో పూర్తి చేసుకు వచ్చేస్తాను, అప్పుడు భోజనానికి బైటకి వెళ్దాం. మీరు టీవీ చూస్తూ ఉండండి" అంటూ కుమార్ బైటికి వెళ్లాడు.

జలజకు టీవీ చూడాలనిపించలేదు. కేవ్స్ గురించి పేఫ్లెట్ ఎదురుగా కనిపిస్తే చదవనారంభించింది. కుమార్ తనను అక్కడికే తీసుకెళ్లబోతున్నాడు కాబోలు అనుకుంటుంటే ఒకసారి టెక్సాస్‌లోని కేవ్స్ చూడడానికి వెళ్లినపుడు జరిగిన సంఘటన జ్ఞాపకానికి వచ్చింది జలజకి.

న్యూయార్క్ నుంచి టెక్సాస్‌లోని సేన్ ఎంటోనియేకు ఏరోప్లేన్‌లో వెళ్లి, దాని దగ్గరగా ఉన్న ప్రదేశాలన్నీ కారులో తిరిగి చూశారు.

మరుసటి రోజు కేల్షియమ్ గుహలని చూడడానికి రాత్రి ఒక మోటార్‌లో ఆగారు తనూ, కుమార్.

తెల్లవారిన తరువాత ఉదయం గదిలో ఉక్కగా ఉందని, స్వచ్ఛమైన గాలి కోసం తను కిటికీ తలుపు తెరిచింది. చల్లని గాలితో పాటు ఒక పెద్ద కందిరీగ లోపలికి జోరబడింది.

"చల్లగాలి కావాలంటే ఎయిర్‌కండిషనర్ని ఫేన్‌లో పెడతాను, లోపలికి తాజా గాలి వస్తుంది. కిటికీ తలుపులు తీస్తే, ఈగలు, దోమలు, తేనెటీగలు వచ్చేస్తాయి. జాగ్రత్త" అంటూ కుమార్ హెచ్చరించాడు.

చిన్నపుడు ఒకసారి తేనెటీగ నాలుగు సార్లు కుట్టడం జ్ఞాపకానికి రాగానే తను ఒక్కసారి బిగుసుకుపోయింది. చప్పున కిటికీ తలుపు మూసేసింది. కుమార్ ఎ.సి.లో ఫేన్ మాత్రం ఆన్ చేశాడు. అప్పటికే లోపలికి చేరిన పెద్ద కందిరీగ అటూ ఇటూ పరిగెడుతోంది. బైటికి పారిపోవడానికి తొందరపడుతోంది. దానివేపే చూస్తూ పరుపుమీద కూర్చుంది తను. గదిలో బల్బులన్నీ వెలగడం వల్ల గది నిండా వెలుతురు విస్తరించి ఉంది. కందిరీగ తన చుట్టూ తిరుగుతోంది దగ్గరగా. కుమార్ తనవేపే ఆసక్తిగా, పరిశీలనగా చూస్తుంటే,

"ఏమిటి అంత పరీక్షగా చూస్తున్నావు? " అనడిగింది తను.

"చెప్పనా? "

"చెప్పమనేగా అడిగింది" అంటూ ఖస్సు మంది తను.

"అయితే నేచెప్పను" అన్నాడు కుమార్.

"చెప్పు, చెప్పు" అంది తను అసహనాన్ని అదిమిపెట్టుకుంటూ.

"ఆ ఈగ పరిగెడుతుంటూ, నీ బుగ్గల మీద దాని నీడ పడినపుడు నీ బుగ్గలు ఎర్రగా కందిపోతున్నాయి" అన్నాడు కుమార్.

తనకి ఆశ్చర్యంతో నోటమాట రాలేదు. ఈగ సంగతి ఎలాగున్నా, నిజంగానే తన బుగ్గలలోకి ఎరుపుదనం వచ్చినట్లు తనకే తెలిసింది. బాత్రూంలోనికి వెళ్లి తలుపు గడియపెట్టి చూస్తూ, అద్దంలో తన ప్రతి బింబం తనని చూసి అసూయపడింది. బైటికి వచ్చినా ఆ రక్తపు ఎరుపుదనం తగ్గ లేదు తనకి.

కేవ్స్ చూడడానికి బయలుదేరుతూ రిసె ప్షన్‌లో తాళం ఇస్తుంటే, "నువ్వు నీ హైస్కూల్ స్వీట్‌హార్ట్‌ని పెళ్లి చేసుకు న్నావా? " అనడిగింది రిసెప్షన్ క్లర్క్.

"అలా ఎందుకనుకున్నావు? " అంది తను.

"సారీ, అలా అనకూడదేమో, బట్ యు లుక్ ఎ లవ్లీ కపుల్ ఎండ్ హేపీ" అంది క్లర్క్. ఆమె ఊహ తప్పని పరిస్థితి వివ రించాలనిపించినా, అది అనవసరమైన ఇతర ప్రశ్నలకి కారణభూతమౌతుందేమో నని చిరునవ్వి నవ్వి, బయట కారు దగ్గర నిలుచున్న కుమార్‌ని చేరుకుంది తను. మూడు, నాలుగు గంటలు తను కుమా ర్‌తో సరిగ్గా మాట్లాడలేకపోయింది. ఉరకలు పెడుతూ పరిగెడుతున్న ఆనం దాన్ని అదిమి పెట్టడానికి తనెంతో అవస్థ పడింది.

కుమార్ తనలో ఉన్న లావణ్యానికి మాటలతో కొత్త వెలుగుని, చేతలతో కొత్త మెరుగుని తెప్పించేవాడని చాలా తరచూ అనుకుంది జలజ.



"డాక్టర్‌గారు ఉన్నారా? " అన్న ప్రశ్న వినగానే రాయుడిలో చలనం వచ్చింది. ఉదయం నుండి ఒక పేషెంట్ కూడా రాకపోవడంతో, ఖాళీగా ఉండడమెందుకని సిగరెట్ మీద సిగరెట్ ఊదేస్తున్న రాయుడిని ఆ ప్రశ్న మేల్కొలిపింది. వెంటనే ఆనవాలు పట్టలేకపోయినా, ఆ గొంతు ఎందుకో పరిచయమైన దానిలాగే ఉంది. ఎవరయి ఉంటారు? "కొత్త పేషెంట్ కాబోలు, ఈ గోపీ వెధవ ఎక్కడ చచ్చాడో" అనుకుంటూ కుర్చీలో సరిగ్గా సర్దుకున్నాడు డాక్టర్ రాయుడు.

విద్యుత్ సరఫరా ఆగిపోయి ఒక గంట యింది, గదిలో వెలుతురు అట్టే లేదు.

తలుపు తెరుచుకుని, మెల్లిగా తలుపు మీద రెండువేళ్లతో తట్టి, గదిలోకి వచ్చిం దొక స్త్రీ.

ఉదయం నుంచీ కళ్లు మూసుకుని సిగ రెట్లు తాగడం వల్ల, గదంతా వ్యాపించిన పొగ ప్రభావం వల్ల, కళ్ల అద్దాలు లేకపో వడం వల్ల, తక్కువ వెలుతురున్న గదిలో నికి వచ్చి ఇరవై అడుగులు దూరంగా నిలుచున్న ఆకారమైతే కనిపిస్తోంది. కాని చప్పున పోలిక తెలియలేదు డాక్టర్ రాయు డికి.

రాయుడు సంకట పరిస్థితి చూసి జాలి పడి కాబోలు ఆ ప్రాంతానికి సంబంధించి

ఎలక్ట్రికల్ ఇంజనీర్ విద్యుత్ సరఫరా చేయగానే, గదిలో ఉన్న రెండు ట్యూబ్ లైట్లు ఒక్కసారి వెలిగాయి. ఎదురుగా నిల బడి ఉన్న రోజీని చూసి సంభ్రమంతో లేచి నిలబడ్డాడు డాక్టరు రాయుడు.

"రాజమండ్రిలో పని ఉండి వచ్చాను. ఇటే వెళ్తూ క్లినిక్ బోర్డు కనిపించడంతో ఒకసారి పలకరించి వెళదామని ఆగాను" అంది రోజీ తన ఆకస్మిక రాకకి కారణాన్ని వివరిస్తూ.

రోజీ మాటల్లో నిబిడీకృతమై ఉన్న సంకోచం, భయం, తడపాటు కనిపెట్టి, "రా రోజీ, ఈవేళ ఉదయం నుంచీ ఏ పేషెంటూ రాలేదు. పనిలేకపోతే నాకు విసుగు ఎక్కువవుతుంది. నువ్వు వచ్చావు కూర్చో" అంటూ మర్యాద చేశాడు డాక్టర్ రాయుడు.

రోజీలో బెరుకుతనం తగ్గడంతో రాయుడు ఎదురుగా ఉన్న కుర్చీలో మెల్లిగా సర్దుకుని కూర్చుంది. మీద ఫేన్ తిరుగుతోంది. గదిలో పేరుకున్న వేడిని ఫేన్ రెక్కలు ఉత్పన్నం చేస్తున్న గాలి చల్లపరచ ప్రయత్నిస్తుంటే, నుదుటన పట్టిన చమటని జేబులోంచి తెల్లని రుమాలు తీసి తుడుచుకున్నాడు డాక్టర్ రాయుడు.

కుర్చీలో సగమే ఆక్రమించుకు కూర్చున్న రోజీ ముంగురులు అటూ ఇటూ కదులు తున్నాయి. తననే గమనిస్తున్న రాయుడి తీక్షణమైన చూపుకు నుదుటన ఉబికిన చమట సంగతి కూడా పట్టించుకోకుండా ఇబ్బందిగా కదలకుండా చిత్తరువల్లే ఉండి పోయింది రోజీ.

"వచ్చిన పని పూర్తయిందా? కాకినాడ తిరిగి వెళ్లిపోతూ ఇక్కడ ఆగేవా? " అనడి గేడు రాయుడు.

"అవును. అయితే మీ ప్రాక్టీస్ బాగా లేదా? నా టైలరింగ్ షాప్ పనిలాగే సాగుతోందన్నమాట" అంటూ మెల్లిగా నోరు విప్పింది రోజీ.

"తొందరగా వెళ్లిపోవాలా? ఒక అర గంట ఉండగలవా? "

"అంత తొందర ఏమీలేదు"

గోపీని పిలిచి రెండు కాఫీలు తీసుకుర మ్మని డబ్బిచ్చి పంపాడు డాక్టర్ రాయుడు.

"ఇప్పుడు చెప్పు" అన్నాడు గోపీ తలుపు తీసుకుని బైటికి వెళ్లాక.

చెప్పడానికి ఏముంది?

"చెప్పడానికి ఏమీ ప్రత్యేకత లేదు. నాలుగు కుట్టుమిషన్లు పెట్టి, బట్టలు పని వాళ్లతో కుట్టించి, ఖాతాదారు ఇచ్చిన డబ్బులో దాదాపు సగం వాళ్లకి ఇచ్చి, మిగతా మిగిలిన పైకంతో గడుపుతు న్నాను. గది అద్దె, ఎలక్ట్రిసిటీ ఖర్చులు వగై రాలు తీసేస్తే మిగతాది బొటాబొటిగా సరిపోతుంది. ఈమధ్యనే అద్దె పెంచమని, లేకపోతే ఖాళీ చేయమని దుకాణం యజ మాని నాలుగుసార్లు హెచ్చరించి వెళ్లాడు. అద్దె పెంచడం ఒకటి, రెండు వందలు పెంచగలను కాని అతను అడిగినంత నేను ఇచ్చుకోలేను. ఇంకోచోటకి వెళ్తే దుకాణం నడుస్తుందో, లేదో అన్న అను మానం. అది తప్ప నాకు ఇంకేమీ ఆధా రంలేదు" అంటూ నిట్టూర్చింది రోజీ. డాక్టర్ రాయుడు ఏమి సమాధానమీయ లేదు. గోపీ లోపలికి వచ్చి కాఫీ కప్పుల్ని ఇద్దరికీ అందించి బైటికి వెళ్లిపోయాడు.

"గోపీకి నెలకి ఎంత జీతం ఇస్తు న్నారు? "

"పదిహేను వందలు, అన్ని పనులు చేసిపెడతాడు. ఇంజక్షనివ్వడం తెలుసు"

"అయినా సరే, పదిహేనువందలు చాలా ఎక్కువే" అని ఆలోచనలో పడింది రోజీ.

"కాకినాడ కంటే రాజమండ్రిలో అద్దెలు

ఎక్కువ. ఈ కొంపకి రెండు వేలు అద్దె. ఎలక్ట్రిసిటీ, వాటర్ ఖర్చులు అదనం. అంటే నా క్లినిక్ నడపడానికి కనీసం నాలుగువేల రూపాయలు కావాలి. సిగరెట్ల ఖర్చు కూడా కలిపితే రోజుకి రెండు వందలు ఆదాయం అవసరం. అలా కాని పక్షంలో ఇబ్బందే" అన్నాడు డాక్టర్ రాయుడు.

"మరి తిండికయ్యే ఖర్చు? "

"నాకు తిండికయ్యే ఖర్చు తక్కువే. దాని కంటే రోజూ తాగే ఆరేడు కప్పుల కాఫీ, టీలకే ఎక్కువ ఖర్చవుతుంది. ఈమధ్య కాలంలో రోజుకి ఆరేడుగురు రోగులు మాత్రమే వస్తున్నారు. నేనూ క్లినిక్ ఇక్కడ నుండి ఇంకోచోటికి మార్చడమో, లేక ఏదైనా నర్సింగ్‌హోమ్‌లో ఉద్యోగంలో చేరిపోవడమో చేయాలి. నాకు ఎమ్.డి. డిగ్రీ లేదు. కాని అనుభవం ఎక్కువగా ఉండడం వల్ల ఉద్యోగం లభిస్తుంది. అయితే ఒక్కటే చిక్కు. ఒకసారి నర్సింగ్ హోమ్‌లో చేరాక మన స్వతంత్రం పోతుంది. యాజమాన్యం చెప్పినట్లు నడవాల్సిందే. ఆ టెస్ట్, ఈ టెస్ట్‌లు అంటూ అనవసరంగా టెస్ట్‌లు నర్సింగ్‌హోమ్ లేబొరేటరిలో చేయించి, రోగులని పీడించి యాజమాన్యానికి డబ్బు ఆర్జించాల్సి వస్తుంది. ఇవన్నీ కాదనుకుని పల్లెటూరుకి వెళ్లి గుట్టుగా రోజులు వెళ్లదీయవచ్చు, కొంత గజిబిజీగా ఉంది. త్వరలో ఈ సమస్యని ఎదుర్కొని పరిష్కారమార్గం కనిపెట్టాలి" అంటూ కాఫీ తాగనారంభించాడు డాక్టర్ రాయుడు.

"మీరు పల్లెకి వెళ్లిపోతే ఆర్థిక సమస్య కొంతవరకు పరిష్కారమవుతుందేమో కాని ఇతర సమస్యలు ఉత్పన్నమవుతాయి. మీరు మీకున్న స్నేహితులకి దూరంగా వెళ్లిపోవాల్సి వస్తుంది. పల్లెటూరిలో ఒంటరిగా బ్రతికేటప్పుడు ఏదైనా సహాయం కావలసివస్తే ఎలా? " అంటూ సందేహపడింది రోజీ.

"ఈవేళ ఛస్తే రేపటికి రెండు లెక్క. ఒంటరి బతుక్కి నాకేమి భయం లేదు. కాని మా సుబ్బుకి దూరమైపోతాను" అన్నాడు డాక్టర్ రాయుడు.

ఇద్దరూ మాట్లాడకుండా కాఫీ తాగడం ముగించారు. రోజీ కాఫీ కప్పు టేబుల్‌మీద ఉంచుతూ "మరి నే వెళ్తాను" అంటూ లేవబోయింది.

"తొందరగా వెళ్లవలసిన అవసరం లేకపోతే కూర్చో" అన్న రాయుడి ప్రతిపాదన రోజీకి నచ్చింది కాబోలు, రవ్వంత రక్తం మొహంలోనికి చింది ఆనందాన్ని ప్రకటించింది.

"ఒకప్పుడు నర్సులని చూస్తే చాలా సంబరపడేదానిని, నర్స్ అయితే ఎంత బాగుంటుందో అని ఆశ్చర్యపడేదానిని. ఇతరుల కంటే డాక్టర్లకి, నర్స్‌లకి, మానవ సేవ చేసే అవకాశం ఎక్కువ" అంటూ నిట్టూర్చింది రోజీ.

"కావాలనుకుంటే అదేమీ పెద్ద విషయమే కాదు. నీకు అంత కోరికగా ఉంటే నర్స్ ట్రైయింగ్‌కి వెళ్లు"

"ఇప్పుడు? ఈ వయస్సులోనా? అదీ కాక నర్సింగ్ కోర్సుకి కనీసం పదోతరగతో, ఎనిమిదో తరగతో పాసవ్వాలి. అది అసాధ్యం. అన్నింటికన్నా ముఖ్యం చదువుకి డబ్బో? " అంది రోజీ.

"ఒక పని చెయ్యి. నా దగ్గరికి అప్పుడప్పుడు వస్తుంటే ఇంజక్షనివ్వడం, చిన్న దెబ్బలకి కట్టు కట్టడం లాంటివి నేర్పిస్తాను. మెల్లిగా ఏదైనా ప్రైవేట్ నర్సింగ్ హోమ్‌లో ఉద్యోగం సంపాదించవచ్చు" అన్నాడు.

"ఆ! అవన్నీ అయ్యే వ్యవహారాలు కావు. ఒకసారి రాజమండ్రి వచ్చి వెళ్లడానికి అరవై రూపాయలు కావాలి తెలుసా? "

"మీ షాపు యజమాని అడిగినంత

ఇచ్చుకోలేనన్నావుగా నువ్వు. ఉన్న ప్రదేశం నుండి కాకినాడలో ఇంకో ప్రదేశానికి మారే కంటే రాజమండ్రిలో నీ నాలుగు కుట్టు మిషన్లకి సరిపడా గది చూసుకో. నర్సు అవ్వాలనే కోరిక తీరుతుందేమో" అన్నాడు రాయుడు.

"ఈ ప్రపంచంలో బతకడానికి డబ్బు కావాలి. తినడానికి, ఉండడానికి వసతికి, బట్టలకి, జబ్బు పడితే మందులకి, డాక్టర్లకి డబ్బు కావాలి. డబ్బు లేకపోతే చావే మంచిది. చచ్చేక శవాన్ని కాల్చడానికి కూడా డబ్బు కావాలి. పిల్లలు ఉంటే తల్లి దండ్రుల గురించి పట్టించుకునేవారు నా చేతకానితనం వల్ల, నా నిర్లక్ష్యం వల్ల బంగారంలాంటి కొడుకుని పోగొట్టుకున్నాను. ఇంకొకరికి అన్యాయం చేయడమే కాకుండా నాకు నేనే అన్యాయం చేసుకున్నాను. నాలాంటి వాళ్లకి తొందరగా చావు వస్తే బాగుంటుంది" అంటూ దిగాలుపడి, కంటిలో తిరిగిన నీటిని పైటచెంగుతో తుడుచుకో ప్రయత్నించింది.

"ఊరుకో రోజీ, గతించిన దాని గురించి బాధపడి ఏమీ సాధించలేం. కరుణ చనిపోయిన సంగతే నాకు చాలాకాలం వరకు తెలియలేదు. తెలిసినా నేను ఏంచేసేవాడిని? " అంటున్న రాయుడి గొంతు బొంగురుపోయింది. రెండు స్తంభాలని కట్టి ఉంచిన వంతెనలా తనకి రోజీకి మధ్య కరుణ, వారధి. ఆ వారధి మధ్యగా తెగి కూలిపోయినపుడు, రోజీ తను ఒకరినొకరు ఓదార్చుకోవడం సహజం, కాని అది జరుగలేదు. ఇద్దరి బాధా భరింపలేనిదైనా కళ్లకెదురుగా కనిపించిన కరుణ మరణం రోజీని తన బాధ కంటే ఎక్కువ బాధ పెట్టి ఉంటుంది. ఆ సమయంలో తను అక్కడ లేక ఉపశమన వాక్యాలు, ఓదార్పు చెప్పలేకపోయాడు. కాకినాడ రోడ్డుమీద "అయిదు నిమిషాలు చూడడం తప్ప కరుణ చనిపోయాక ఒంటరిగా రోజీతో

## కొత్తగాలి...

**చావు-**
**అలసటలేని నిద్ర**
**పుట్టుక-**
**వెతల బ్రతుకు ముద్ర**

-పాయసం సుబ్రహ్మణ్యమహర్షి, నెల్లూరు

మాట్లాడటం ఇదే మొదటిసారి. అందుకే కరుణ గురించి ప్రస్తావన రాగానే ఇద్దరిలోనూ అణుచుకునే దుఃఖం బైటపడింది.

రోజీ కళ్లలోంచి, కట్టలు తెగిన డ్యామ్‌లోంచి బైటికి ప్రవహిస్తున్న నీరులా కన్నీళ్లు పొంగుతుంటే కుర్చీలోంచి లేచి, నిలబడి రోజీ భుజం మీద చేయివేసి సముదాయించబోయాడు రాయుడు. కొడుకు గురించిన ఏవ జ్ఞాపకాలు కమ్ముకున్నాయో పేగు తెంచుకు పుట్టిన కరుణ లారీ కింద నలిగిపోయిన దృశ్యమే కళ్ల ముందర కనిపించిందో కాని కుర్చీలోంచి లేచి నిలబడి బల్లిలా రాయుడిని హత్తుకుని వెక్కివెక్కి ఏడ్చింది రోజీ.

రోజీ ఏడవడం వినిపించి కాబోలు, గోపీ రవ్వంత తలుపుతెరిచి లోపలికి చూసి మధ్య తలుపు వేశాడు. పది నిమిషాలు గడిచాక రోజీ మెల్లగా పట్టు సడలించి కుర్చీలో తలదించుకుని కూర్చుని పైటచెంగుతో మొహాన్ని తుడుచుకుంది. రాయుడు తిరిగి తన కుర్చీలోకి చేరి పరీక్షగా రోజీవేపు చూశాడు. జవసత్వాలుడిగి, పోషణ లేక చిక్కిపోయిన రోజీ, నీళ్లూ, వెలుతురు కోసం అర్రులు చాస్తూ ఆకులు ముడుచుకుపోయి, సగం ఎండిపోయి, మొదట్లో మాత్రమే లీలగా జీవం ఉన్న చెట్టులా ఉంది. కనుగుడ్లు అటూ ఇటూ తిప్పుతూ పోట్లాటకి దిగి గెలుస్తానన్న

ధీమాతో ఒంగోలు గిత్తలా ఉండే అలనాటి రోజీకి మౌనంగా, దీనంగా రేపటి గురించి భయం కమ్మేస్తుంటే నోటికి చెయ్యి అడ్డు పెట్టుకుని దుఃఖాన్ని ఆపుకోవడానికి ప్రయత్నిస్తూ నీరసపడిపోయిన ఈ రోజీ ఒక్కతేనంటే తనకి నమ్మకం కుదరడంలేదు.

జీవితం కొందర్ని కర్కశంగా హింసించి నలిపేస్తుంది. అలాంటి కోవకే ఈ రోజీ చెందుతుంది అనుకుంటూ, నాకు బాధ్యతలు అంటూ ఏమీ లేకపోయినా, బలహీనతలు ఉన్నాయి. నీకు సహాయం కావాలంటే, నాకు చేతనయితే చేస్తాను. నర్సు అవడం నీకిష్టమైతే దాని గురించి ప్రయత్నిద్దాం" అన్నాడు రాయుడు.

"అది జరగనిపని అని ఇప్పుడేగా అనుకున్నాం? "

"ఈ ఇంట్లో మూడు గదులున్నాయి. రోగులని చూసేగది, నేనుండేగది, చెత్తా చెదారం పడేసిన గది. అవి కాకుండా పెద్ద వరండా ఉంది. నువ్వు కావాలంటే, నీ సామాన్లని తెచ్చుకుని దానిని వాడుకో, వరండాలో కుట్టుమిషన్లని ఉంచి కుట్టుపనులు ఏవైనా ఉంటే చేసుకో. గోపీ హైద్రాబాదు వెళ్ళిపోతానని రెండు మూడుసార్లు అన్నాడు. ఈ వేళ కాకపోయినా ఆరేడు నెలల్లోనైనా ఉద్యోగం మానేస్తాడు. నాకు ఒక నర్సు లేదా అసిస్టెంట్ అవసరం. నువ్వు, అతను వెళ్ళే లోపల అతను చేసే పనులు నేర్చుకుంటే, అతనికి ఇచ్చే జీతం నీకిస్తాను. ఆలోచించుకో" అన్నాడు రాయుడు.

"మీ ప్రతిపాదన వల్ల అన్నివిధాలా లాభపడేది నేను. కాని దానివలన మీకు అన్నీ ఇబ్బందులే ఎదురవుతాయి. అదీకాక రేపు గురించి ఆలోచించాలి కదా? " అంది రోజీ.

"ఈవేళ బతకడం గురించి నేను ఆలోచించి ఏదో ఒక పరిష్కార మార్గం చూపిస్తే, నువ్వు 'రేపు, ఎల్లుండి' గురించి ప్రశ్నలు వేస్తున్నావు. రేపు గురించి ఎవ్వరూ ఏమీ చెప్పలేరు. ఈవేళ గడిస్తే కదా రేపు వస్తుంది? మనలాంటివాళ్ళ సంగతి పక్కకి పెట్టినా, తోడు దొరికి జీవితాంతం కలిసి ఉన్న వ్యక్తులకే ఎప్పుడో ఒకప్పుడు ఒంటరితనం తప్పదు" అన్నాడు రాయుడు. పాలిపోయి, శుష్కించిపోయిన రోజీ మొహంలో వెలుగు చూసి తృప్తిగా నిట్టూర్చాడు రాయుడు.

★ ★ ★

ఖాళీగా ఉన్న గదిలోకి తన సామాన్లు చేరవేసి, ఎవర్నికైనా కుట్టుపని అవసరం ఉందా? అని గోపీచేత వాకబు చేయించి, వచ్చిన పనులను తనే పూర్తిచేస్తూ ఒకనెల గడిపింది రోజీ. ఆ నెలలో రాయుడు రోగులకి ఇంజక్షన్ ఇవ్వడమెలాగో చూపించాడు. హోటల్ నుంచి వచ్చిన కేరియర్ ఇద్దరూ మధ్యాహ్నం సర్దుకుతినడం, రాయుడు సాయంకాలం సుబ్బారావు ఇంటినుంచి తిరిగివచ్చి ఎవరి గదుల్లో వాళ్ళు నిద్రపోవడం రివాజు అయింది. ఒకరోజు సుబ్బారావు ఇంటినుండి తిరిగి వచ్చిన రాయుడితో, "మీరిలా అతిగా తాగడం ఒంటికి మంచిది కాదు. మీ స్నేహితుడు మీకు చెప్పడంలేదా? " అనడిగింది రోజీ. రాయుడు దానికి సమాధానం ఇద్దామా? వద్దా? అన్న ఆలోచనలోపడి కళ్ళు మూసుకున్నాడు. రోజీ తిరిగి అందుకునేంతలో, రాయుడు నోటిమీద రెండు వేళ్ళని ఉంచి మాట్లాడవద్దని సైగతో వారించాడు. రోజీ మాట్లాడకుండా ఆగి, రాయుడు ఏంచెబుతాడో అని ఎదురుచూస్తుంటే మౌనంగా గదిలోనికి వెళ్ళి తలుపేసుకున్నాడు రాయుడు.

★ ★ ★

మర్నాడు ఉదయం, రాయుడు కాఫీ తాగుతూ "రోజీ, అలా కూర్చో, నేను

చెప్పేది జాగ్రత్తగా విను" అన్నాడు.

రాయుడివేపు పరిశీలనగా చూసింది రోజీ.

"ఒక పల్లెటూరికి వెళ్తే అక్కడ ఒక వ్యక్తి ఎదురయ్యాడనుకో. నీకు మామిడిపళ్ళు ఇష్టమా? అంటే అతను ఔను అంటాడనుకో. తరువాత కనిపించిన రెండవ వ్యక్తిని, మూడవ వ్యక్తిని అదే ప్రశ్న వేస్తే 'ఔనని' సమాధానం వస్తే ఈ ఊరిలో ఉన్న ప్రజలందరికీ మామిడిపళ్ళంటే ఇష్టం అని ప్రకటిస్తే, అది నిజం కాకపోవచ్చు. నాకున్న అనుభవం, ఇతరులు చెప్పగా విని అర్థం చేసుకున్నది మాత్రమే ఇది. ఒక స్త్రీ, పురుషుడు జోడుగా సహజీవనం సాగించ సిద్ధపడినపుడు, తొలిదశలో ఒకరి మెప్పుదలకి ఇంకొకరు తాపత్రయపడడం సహజం. ఒక వ్యక్తి ఇష్టాలను బట్టే రెండో వ్యక్తి తన ధోరణిని మార్చుకోవచ్చు. ఆ మార్పు తనంతట తాను వాంఛించినదే కానీ, రెండవ వ్యక్తి ఆదేశం మీద కాదు. రోజులు గడుస్తుంటే యవ్వనపు వేడి, ఆకర్షణ తగ్గేక నా గురించి ఇది చెయ్యి, అది చేయకులాంటి ధోరణి ఆ ఇద్దరిలో ఎవరైనా వ్యక్తపరిచి రెండవ వ్యక్తిచేత బలవంతంగా చేయిస్తే, ఆ వ్యక్తిలో ప్రతిఘటన చెలరేగవచ్చు. ఏదిఏమైనా అలా చేయాల్సిందే అని పట్టుపడితే ఆ జంట జీవనంలో అపశృతి మొదలయిందనుకోవాలి. అప్పటికి తాత్కాలికంగా అలా చేయడానికి అంగీకరించినా అతని స్వేచ్ఛ, స్వతంత్ర కట్టడి అయిపోతున్నాయన్న ఉద్దేశం అతనిలో ఉద్భవించే అవకాశం ఉంది. తిరుగుబాటుకు బీజం పడుతుంది. బాగా ఇష్టమని గులాబీని చేతిలో ముడిచి ఉంచితే అది త్వరగా వాడిపోతుంది. ఒక వ్యక్తి, రెండవ వ్యక్తికి బానిస కాకూడదు. ఒక వ్యక్తి రెండవ వ్యక్తిమీద అథారిటీ చెలాయించకూడదు. ఒకరి చేష్టలు, రెండవ వ్యక్తిని అవమానపరిచేలా కాని, నొప్పించేలా కాని ఉండకూడదు. ఒక వ్యక్తి రెండవ వ్యక్తిని మార్చ ప్రయత్నించకూడదు. ఆ వ్యక్తి తనకి తానే మారాలి. సహజీవన సరిహద్దులు దాటకుండా కలిసి ఉంటూ స్వేచ్ఛని అనుభవించగలగాలి. సహజీవనంలో జోడు ముఖ్యమే, కాని తోడు అంతకన్నా ముఖ్యం. మార్పు తొందరగా రాదు కొందరికి. ఈ వయస్సులో నేలభిలషించేది తోడు. జోడు జీవితం మనం గడిపాం. నేచెప్పినది నీకు అర్థమయితే నేను చాలా ఆనందపడతాను" అన్నాడు రాయుడు.

అర్థమయిందన్నట్లుగా తల ఊపింది రోజీ.

★ ★ ★

"ఎలా ఉంది అమ్మమ్మా అమెరికా?" అంటూ నందిని ఒళ్ళో కూర్చుని కబుర్లు అడుగుతూ చెబుతూ ఉంటే నెల్లాళ్ళ గడిచేయి.

"మళ్ళీ వెళ్తావా? అమ్మమ్మా?" అన్న నందిని ప్రశ్నకి జలజ సమాధానమిచ్చేంతలో సరోజ కలుగ చేసుకుని,

"ఎందుకు వెళ్ళదూ? అక్కడ మీ అమ్మమ్మ సంగీత పాఠాలు చెప్పి డాలర్లు ఆర్జిస్తోంది. ఎంచక్కా అటూ ఇటూ తిరుగుతోంది" అంది.

"తొందర్లో వచ్చేస్తారు కదూ?" అంటూ కుమార్ దిగాలుగా సాగనంపడం జ్ఞాపకానికి వచ్చింది జలజకి.

"ఇదివరకటిలా కాదు, ఇప్పుడు అక్కడ బాదరబందీలు ఏమీలేవు" అంది తను ఉత్సాహంగా.

"వచ్చే నెల పదిహేనవ తారీఖు కల్లా వచ్చేస్తాను. అక్కడికి వెళ్ళాక ఒక వారం రోజులు అటూ ఇటూ అవవచ్చు" అంది జలజ తిరిగి.

తను చెప్పిన పదిహేనవ తారీఖు

## కలిమి లేములు కావడి కుండలు

**అప్పటి నిజం**

**దా**దాపు శతాబ్దం క్రితం లండన్‌లోని ఓ దుకాణంలో ఒక కుర్రాడు పనిచేసేవాడు. ఉదయం అయిదుకి లేచి, ఆ దుకాణాన్ని ఊడ్చి పద్నాలుగు గంటల పాటు బానిసలా పని చేసేవాడు. రెండేళ్ళ తర్వాత ఇక తనుచేసే పనిలోని విమర్శలను తట్టుకోలేక అతనా ఉద్యోగాన్ని వదిలేసాడు. ఓ ఇంట్లో హౌస్ కీపర్‌గా పనిచేసే పదిహేను మైళ్ళ దూరంలో ఉన్న తన తల్లి దగ్గరకి వెళ్లేవాడు. ఆ దుకాణంలో పనిచేసే కంటే ఆత్మహత్య నయం అంటూ ఆమె దగ్గర ఏడ్చాడు. తన స్కూల్ టీచర్‌కు తన దురవస్థని వివరిస్తూ ఓ పెద్ద ఉత్తరం రాసాడు తను. ఆయన ఇతన్ని ఓదారుస్తూ ఉత్తరం రాస్తూ 'నువ్వు ఎప్పటికైనా గొప్పవాడివవుతావన్న నమ్మకం నాకుంది. నా దగ్గరకి వస్తే, చిన్న క్లాసులకి టీచర్ ఉద్యోగం ఇస్తాను' అని సమాధానం రాసాడు.



ఆయన రాసిన ఆ వాక్యం ఆ కుర్రాడి జీవితాన్నే మార్చేసి అతన్ని ఆంగ్ల సాహిత్య చరిత్రలో పెద్ద పీటవేసి కూర్చోపెట్టింది. బహుశ మీరతని పేరు వినే ఉంటారు. అతనే హెచ్.జి.వెల్స్.

ఇంకొక పదిరోజుల దూరంలో ఉంది. మళ్ళీ రాయుడి దగ్గరకి వెళ్ళి టిక్కట్ సంగతి వాకబు చేయాలి. రాయుడిని తను అమెరికా నుంచి వచ్చేక వెళ్లి చూసి వచ్చింది. దురదృష్టవశాత్తు రోజీ ఏదో పని మీద బైటకి వెళ్ళింది. ఆమెతో మాట్లాడ లేదు. ఈమారు ఖచ్చితంగా ఆమెని కలవాలి అనుకుంటూ నందినితో ఆటలో పడింది జలజ. సాయంకాలం రాయుడి దగ్గరకి వెళ్ళాలి అనుకుంది జలజ. మధ్యాహ్నం ఒక గంట నిద్ర తీశాక, మూడు గంటలకి సరోజ టీకప్పు అందిస్తూ, "అమ్మా నీకొక ఉత్తరం వచ్చింది" అంటూ లోపలికి వెళ్ళి ఒక కవర్ పట్టుకొచ్చి ఇచ్చింది. బైట చేతిరాత సారథిది. సారథి ఇంతలో ఉత్తరం ఎందుకు రాసేడబ్బా? అంటూ కవర్ చింపి లోపలి ఉన్న కాగితాన్ని తెరచింది జలజ.

"అమ్మకి,

నీకు ఇది ఎలా రాయాలో తెలియలేదు. కాని రాయక తప్పదు. ఎవరో దుండగులు కుమార్‌ని హత్యచేసి అతని కారుని దొంగిలించుకెళ్ళారు. శవం రోడ్డువారగా పడి ఉంటే పోలీసులు కనుక్కున్నారు. ఇది జరిగి పదిహేను రోజులపైనే అయింది" అన్న రెండు వాక్యాలు చదవగానే జలజకి కళ్ళు బైర్లు కమ్మి కుర్చీలో తల పట్టుకు కూర్చుండిపోయింది.

# కాలాతీతం



# ప్రైడ్ అండ్ ప్రెజుడిస్

**జేన్ ఆస్టిన్ 1813లో రాసిన నవల 'ప్రైడ్ అండ్ ప్రెజుడిస్' ఆధారంగా 2004లో తీసిన 'బ్రైడ్ అండ్ ప్రెజుడిస్' సినిమా ఇంగ్లిష్, హిందీ, పంజాబీ భాషల్లో ఒకేసారి విడుదలయింది. ఇందులో తన అందంతో ప్రపంచాన్ని ఓ ఊపు వూపిన ఐశ్వర్యరాయ్ నవలలోని కథానాయిక ఎలిజబెత్ బెనేట్ పాత్రను పోషించి పలువురి మన్ననలను పొందారు.**

"ఎంటర్‌టెయిన్‌మెంట్‌కు మారు పేరు జేన్ ఆస్టెన్" అంటాడు సామర్సెట్ మామ్. వినోదమే కథాసాహిత్య ప్రధాన ప్రయోజనమనుకుంటే ఆమె నవలల్లో వుండేదదే. యుద్ధము-శాంతి, బ్రదర్స్ కరమ్‌జోవ్ చాలా గొప్ప నవలలు. కాని సగటు పాఠకుడికి వాటిని చదివి ఆస్వాదించే స్థాయి తక్కువ. అందుకనే హాయిగా చదువుకోగలిగిన కథ 'ప్రైడ్ అండ్ ప్రెజుడిస్'. ఇంగ్లండు ప్రధాని బెంజమిన్ డిజ్రేలి ఈ నవలను "కనీసం పదిహేడుసార్లు చదివి ఆనందించాను" అంటూ ప్రకటించాడు. యువతీ యువకుల చుట్టూ తిరిగే ఈ కథకు మనం "ప్రేమలు- పెళ్లిళ్లు" అని పేరు పెట్టుకున్నా బాగానే వుంటుంది.

లాంగ్‌బోర్న్‌లో స్థిరపడ్డ బెనేట్‌గారికి పెళ్లై యిరవై మూడేళ్లు దాటాయి. ఎదిగిన అయిదుగురు ఆడపిల్లలతో యిల్లు కళకళలాడుతున్నది. వాళ్ల తల్లికి సహజంగానే కూతుళ్ల పెళ్లి బెంగ పట్టుకుంది.

"నెదర్‌ఫీల్డ్ పార్క్ (పక్కనున్న ఎస్టేట్)కు ఎవరో కొత్త యజమాని వచ్చాడు. తెలిసిందా? " అంటూ ప్రారంభించింది ఒక ఉదయం. ఆమె రోజూ యిలాంటి వార్తలేవో చెబుతూనే వుంటుంది.

"అతడి పేరు బింగ్లీ. అవివాహితుడు. సాలీనా అయిదువేల పౌండ్లు ఆదాయమట. ఉత్తర ఇంగ్లండు నుంచి వచ్చాడు.

కాని యిక్కడే హెర్ట్‌ఫర్డ్ షైర్‌లో వుండాల నుకుంటున్నాడు..." అవసరమున్నా లేక పోయినా ఎప్పుడూ ఏదో ఒకటి వాగు తూనే వుంటుందామె. కాని ఈ ఆగంతకు డెలాంటివాడో తెలుసుకోవటం తనకూ అవసరమే. మర్యాదగా పలకరించి వచ్చాడు బెనేట్. చార్ల్స్ బింగ్లీ యువకుడే కాదు. అందగాడు కూడా.

రిటర్న్ విజిట్ చెయ్యటం సంస్కారవం తుల లక్షణం. పైగా, ఆడపిల్లల అందచం దాల గురించి విన్నాడు. వారం తిర క్కుండానే, బింగ్లీ కూడా బెనేట్ యింటి తలుపు తట్టాడు. పెద్దకూతుళ్లు జేన్, ఎలి జబెత్‌లిద్దరూ బాగా డాన్స్ చేస్తారని కూడా తెలిసింది. 'కనుల విందు' కోసం ఇల్లంతా గాలించాడు బింగ్లీ. కాని లోపలికి ఆహ్వానించిన తండ్రి తప్ప మరో ఆడపు రుగు కనిపించలేదు. అయితే పిల్లలు మాత్రం, మెట్ల పైనున్న గదిలో నక్కి అతి థిని నఖశిఖపర్యంతం పరీక్షించారు. పొరు గింటి లేడీ లుకాస్‌నడిగి అతడి గురించి మరింత సమాచారం సేకరించారు (లుకాస్ కూతురు చార్లాట్‌తో జేన్, ఎలిజ బెత్‌లకు మంచి స్నేహం వుంది). బెనే ట్‌లు గనక డాన్సు పార్టీ అరేంజ్ చేస్తే తాను మిత్ర బృందంతో కలిసివస్తానని వాగ్దానం చేశాడట బింగ్లీ.

అతడికిద్దరు అక్కలు. ఒకావిడకు పెళ్లైంది. భర్త పేరు హర్స్ట్. ఈ కుటుం బమూ, మరో మిత్రుడు డార్సీ కూడా పార్టీకి వచ్చారు. అయిదు నిముషాల్లోనే డాన్స్ ఫ్లోరు మీద అందరికీ తెలిసిపో యింది- డార్సీ ఆదాయం ఏడాదికి పదివేల పౌండ్లు. సంపదతోపాటు, అందం, ఠీవి కూడా తోడైతే ఆడపిల్లల కళ్లన్నీ అతడి మీదే వుండవా!

అయితే ఆనాటి డార్సీ ప్రవర్తన ఎలిజబె త్‌ను చాలా బాధించింది. బింగ్లీ, జేన్‌తో డాన్స్ చేస్తున్నప్పుడు, డార్సీ వచ్చి, "ఈ ఊళ్లో వున్న ఒకే ఒక అందగత్తెతో నువ్వు ఎంజాయ్ చేస్తున్నావు" అన్నాడు చిలిపిగా.

"నిజమేగాని మరో బ్యూటీ కూడా వుంద క్కడ. వీళ్ల సిస్టర్ ఎలిజబెత్" అంటూ వేలు చూపించాడు బింగ్లీ.

"ఏదో ఓ మోస్తరుగా వుందిలే. అయినా అలా ఎవరితో పడితే వాళ్లతో డాన్సు చెయ్యటం నాకిష్టముండదు" అన్నాడు డార్సీ.

అంతకన్న అవమానమేముంటుంది!

★ ★ ★

తరువాతి రోజుల్లో లాంగ్‌బోర్న్, నెదర్ ఫీల్డ్‌ల మధ్య రాకపోకలు పెరిగాయి. "తల్లిని భరించటం కష్టం. చిన్న పిల్లలు ముగ్గురూ మనకనవసరం. జేన్, ఎలిజబె త్‌ల కోసమే వాళ్లతో పరిచయం పెంచుకో వాలి" అంటూ తీర్మానించారు బింగ్లీ సిస్టర్స్.

"వాళ్లకు అహంకారమెక్కువ. పొగరుబో తులు" అనుకుంది ఎలిజబెత్. బింగ్లీ, తన అక్క జేన్‌పట్ల ఆసక్తి ప్రదర్శిస్తున్నాడని తెలుసు. కాని, డార్సీ కూడా తననిష్టపడు తున్నాడని వూహించలేదామె. పార్టీలో అంత ఘోరంగా అవమానించిన వాడికి ప్రేమ వుండే అవకాశమే లేదు.

అయితే అనుకోకుండా ఒకసారి ఎలిజ



# జేన్ ఆస్టెన్ (1775-1817)

పారిశ్రామికీకరణకు ముందు ఇంగ్లండులో ఉన్ని వ్యాపారమే ప్రధాన వృత్తి. జేన్ ఆస్టెన్ పూర్వీకులు గొర్రెల్ని పెంచి, నాణ్యమైన ఉన్నితో బాగా లాభాలు గడించారు. అలా వచ్చిన అదనపు ఆదాయంతో పొలాలు కొని భూస్వాములుగా ఎదిగారు. అయితే జేన్ తండ్రి జార్జ్‌కు ఈ వారసత్వ సంపద ఏమీ మిగల్లేదు. చర్చిలో రెవరెండ్‌గా వచ్చిన ఉద్యోగంతో సంపాదన సరిపోక, ట్యూషన్లు చెప్పుకుని ఎనిమిది మంది సంతానాన్ని (ఇద్దరు కూతుళ్లు, ఆరుగురు కొడుకుల్ని) పోషించాడు. నాటకాలు వెయ్యటమే ప్రధాన వినోదంగా పెరిగారు పిల్లలు. ప్రతిసారీ ఓ కొత్త కథ ఊహించి ప్రదర్శించటంలో జేన్‌కు సహాయం చేసింది అక్క కసాండ్రా. స్కూలుకు వెళ్లాలని ఎంత ఆసక్తి వున్నా, ఆర్థిక స్థోమత లేక ఆడపిల్లలిద్దరూ ఇంటివద్దే చదువుకున్నారు. తరువాత, కొన్నాళ్లు ఆక్స్‌ఫర్డ్ సౌంతాంప్టన్, రీడింగ్ లేడీస్ బోర్డింగ్ స్కూళ్ల కెళ్లింది జేన్. స్థానిక గ్రంథాలయం నుండి తెచ్చుకున్న పుస్తకాలు భవిష్యత్ రచయిత్రిలో సాహిత్యాభిలాష పెంచాయి. హెన్రీ ఫీల్డింగ్, సామ్యుయెల్ రిచర్డ్‌సన్, వాల్టర్ స్కాట్, సామ్యుయెల్ జాన్సన్, విలియం కూపర్, జార్జ్ క్రాబ్, ఫానీ బర్నీల రచనలను ఆరాధించిన జేన్, వాళ్ల ప్రభావంతో పద్నాలుగవ ఏటనే నవలా రచనకు శ్రీకారం చుట్టింది. ఆమె ప్రారంభించిన తొలి నవల "ఎలినార్ అండ్ మారియాన్" (తరువాత ఇదే 'సెన్స్ అండ్ సెన్సిబిలిటీ'గా అచ్చయింది) పుస్తకం మీద రచయిత్రి పేరుకు బదులు 'బై ఎ లేడీ' అని మాత్రమే ముద్రించారు.

అయితే జేన్ ముగించిన తొలి రచన 'ఫస్ట్ ఇంప్రెషన్స్'ను 1797లో ఆమె తండ్రి చదివి కాడెల్ అనే పబ్లిషర్‌కు పంపారు. ఈ నవల 'ప్రచురణకు పనికిరాద'ంటూ తిరిగివచ్చింది. పదహారేళ్ల తర్వాత ఇదే నవల 'ప్రైడ్ అండ్ ప్రెజుడిస్'గా పాఠక లోకాన్ని ఉర్రూతలూగించింది. రచయిత్రి జీవితకాలంలోనే మూడు ముద్రణలు పొందింది.

బెత్, డార్సీలు ఎదురెదురుగా కూర్చోవలసి వచ్చింది. బింగ్లీ ఆహ్వానంమీద నెదర్‌ఫీల్డ్‌కు వెళ్లిన జేన్ వానలో చిక్కుపడి, అనారోగ్యంతో రాత్రంతా అక్కడే గడిపింది. ఇంట్లో తల్లి ఆందోళన చూడలేక ఎలిజబెత్ అక్కను తీసుకొస్తానని బయల్దేరింది. కానీ వాతావరణం అనుకూలించకపోవటంతో, ఆమె కూడా బింగ్లీ అతిథిగా వుండిపోక తప్పలేదు. అప్పుడు తెలిసింది. జేన్ బింగ్లీలకు పెళ్లి జరిగే అవకాశం లేదు. బింగ్లీ సోదరి డార్సీని ఇష్టపడుతున్నది. ఆస్తి దక్కించుకోవాలంటే బింగ్లీ మరో సంపన్నురాలిని చేసుకోవాలి. ఈ విషయాలన్నీ డార్సీ మాటల ద్వారా గ్రహించింది. పెంబర్లీ, డెర్బీషైర్‌లలో అతనికి పెద్ద ఎస్టేట్‌లున్నాయి.

నిజానికి బెనెట్‌లకున్న ఆస్తి కూడా తక్కువేమీ కాదు. కొడుకుల్లేరు గనక అదంతా కూతుళ్లకే చెందాలి. త్వరలో యిదంతా అన్యాక్రాంతమై పోతుందని బెంగ పట్టుకుంది మిసెస్ బెనెట్‌కు.

సరిగ్గా అప్పుడే పాతికేళ్ల కాలిన్స్ యింటి ముందరికి వచ్చి వాలాడు. దూరబంధువు.

అయినప్పటికీ కాపీరైట్ హక్కుల కింద జేన్‌కు ముట్టింది నూటపది పౌండ్లే.

జేన్ పెళ్లి చేసుకోలేదు. కాని కసాండ్రాకు రాసిన ఉత్తరాలు చదివితే ఆమె ప్రేమలో పడినట్టుగా ఆధారాలున్నాయి. తనిష్టపడిన టాం లెఫ్రామ్‌నే 'ప్రైడ్ అండ్ ప్రెజుడిస్'లో 'మిస్టర్ డార్సీ'గా చిత్రించిందంటారు. ఇది గాక 1802లో వచ్చిన ఒక పెళ్లి ప్రస్తావనను కూడా ఆమె కొంత తటపటాయించి తిరస్కరించింది.

కుటుంబ సభ్యులూ, ఇంటికి వచ్చిపోయే బంధుమిత్రులూ, ఇరుగుపొరుగు తప్ప సమాజ జీవితం గురించి ఏమీ తెలియని జేన్ తన పరిమిత పరిచయాలతోనే వ్యక్తుల్ని అధ్యయనం చేసి అద్భుతమైన నవలలు రాసింది. ఆ రోజుల్లో ఇప్పట్లాగే ఆడపిల్లలకు పెళ్లే ముఖ్యం. పెళ్లిలో డబ్బు, హోదాలకే ప్రాధాన్యం. ఆచార వ్యవహారాలు, కుటుంబ తగాదాలు, పెళ్లికెదిగిన పిల్లలు, వాళ్లు కలలుకనే యువకులు- ఆమె కథలన్నీ వీటి చుట్టూ తిరుగుతాయి. హాస్యం, వ్యంగ్యం తన అస్త్రాలుగా, వ్యక్తుల భేషజాలకు తూట్లు బొడిచింది జేన్. ఆమె లాగ హృద్యంగా కథ చెప్పటం అనితర సాధ్యం. ఇంగ్లీషు సాహిత్యంలో షేక్స్పియర్ తర్వాత అంత గొప్ప రచనలు చేసింది జేన్ ఆస్టెన్ మాత్రమే అన్న వాళ్లున్నారు. రాజకీయాలు, సామాజిక ఉద్యమాలు ఆమెకు తెలియవు. కవులు విలియం వర్డ్స్‌వర్త్, లార్డ్‌బైరన్ సమకాలీకులైనా డేవిడ్ హ్యూమ్, జాన్ లాక్ లాంటి తాత్వికులే ఆమె 'లౌకిక దృష్టి'ని ప్రభావితం చేశారు.

ఆధునిక విమర్శకులు లయోనెల్ ట్రిల్లింగ్, ఎడ్వర్డ్ సయ్యద్ లాంటివాళ్లు జేన్ గురించి ప్రత్యేక పరిశోధనా గ్రంథాలు రాశారు. ఆమె రాసిన ఇతర నవలలు, మాన్స్‌ఫీల్డ్ పార్క్ (1814), ఎమ్మా (1815).

1816లో జేన్ ఆరోగ్యం పాడైంది. మూత్రపిండాలకొచ్చిన క్షయవ్యాధిగా గుర్తించారు. చివరి క్షణాలో, కసాండ్రా 'నీకేం కావాలని' అడిగితే, 'చావు' అని జవాబిచ్చిందట జేన్. చాటన్‌లోని జేన్ ఆస్టెన్ మ్యూజియం అభిమానులకు పవిత్ర యాత్రాస్థలం. రచయిత్రి మరణానంతరం 'పర్సుయేషన్' 'నార్థాంగర్ ఆబీ' నవలలు 1817లో ప్రచురితమైనాయి. ఇవిగాక ది వాట్సన్స్, సాండిటన్‌ల అసంపూర్తి రచనలను కూడా వదిలివెళ్లింది జేన్.

ఆడపిల్లలకు కజిన్ వరుస. మంచివాడేగాని స్వోత్కర్ష ఎక్కువ. హన్స్‌ఫర్డ్‌లో లేడీ కేతరిన్ డిబోర్గ్ వద్ద వుంటున్నాడు. అయిదుగురిలో ఎవరో ఒకరు కావాలి. జేన్ నచ్చింది కాని ఆమె మరొకర్ని ఇష్టపడ్డదని తెలిసి ఎలిజబెత్ అయినా ఫరవాలేదన్నాడు. లాంగ్‌బోర్న్ నుండి మైలుదూరంలో వుంది మెరిటన్. తల్లి, చెల్లెలు ఆంట్ ఫిలిప్స్‌ను చూడటానికి తరచూ అక్కడికెడుతుంటారు ఆడపిల్లలు. అయిదుగురిలోనూ చిన్నవాళ్లు కాత్‌రైన్, లిడియాలకు ఆవిడంటే మరీ యిష్టం. ప్రస్తుతం సైనిక పటాలం అక్కడ విడిది చేసింది. అందరూ దాని గురించే మాట్లాడుకుంటున్నారు. ఒక ఉదయం, నలుగురు ఆడపిల్లలు (మరో పిల్ల మేరీ యింటి వద్దే వుంది) కజిన్ కాలిన్స్‌తో మెరిటన్‌కు బయల్దేరారు. కల్నల్ డెన్నీని చూడాలని లిడియా కోరిక. సైనిక శిబిరంలో మరో ఆఫీసర్ వికాంను పరిచయం చేశాడు డెన్నీ. అప్పుడే అక్కడికి బింగ్లీ, డార్సీలు కూడా వచ్చారు. అందరూ కలిసి ఆంట్ ఫిలిప్స్ యింట్లో పార్టీ కెళ్లారు. డార్సీ తనకు బాల్యంనుండే తెలుసనీ, వాళ్ల

కుటుంబ విషయాలు, రహస్యాలు కొన్ని చెప్పాడు వికాం. డార్సీ ప్రవర్తన మంచిది కాదు. అతడి వల్ల తనకు చాలా అన్యాయం జరిగింది. లేడీ కేతరిన్ డి బోర్గ్, లేడీ ఆన్ డార్సీ అక్కా చెల్లెళ్లు. తమ పిల్లల పెళ్లి ద్వారా రెండు ఎస్టేట్లూ కలుపుకోవాలనుకుంటున్నారు.

డార్సీ వల్ల నష్టపోయిన సజ్జనుడు వికాం. ఇలాంటివాడు తనకు సహచరుడైతే బాగుండుననుకుంది ఎలిజబెత్. కాని తరువాతి పార్టీకి అతడు రాలేదు. కాలిన్స్ కబుర్లు వినలేకా, డార్సీ డాన్సు చెయ్యమని బలవంతం చెయ్యటం వల్లా యింటి కెళ్లిపోయింది.

మరునాడు తనను వివాహం చేసుకుంటానని బహిరంగ ప్రకటన చేశాడు కాలిన్స్. లేడీ కేతరిన్ డిబోర్గ్ వద్ద సులభంగా ఉండొచ్చునన్నాడు.

ఎలిజబెత్ నిర్మొహమాటంగా ఈ ప్రస్తావనను నిరాకరించింది.

★ ★ ★

వికాంకు పార్టీకి రాకపోవటానికి ఓ బలమైన కారణముంది. డార్సీలాంటి దుష్టులకు దూరంగా వుండటమే మేలనుకున్నానని ఎలిజబెత్‌కు వివరించాడు. మరోవైపు తాజాగా జేన్ గుండె పగిలింది. "డార్సీ సోదరి అద్భుత సౌందర్యవతి. ఆమెను కలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నాను. ఆస్తి వ్యవహారాలలో పొరుగూరికి వెళ్లవలసిన అవసరం కూడా వున్నది" అంటూ ఉత్తరం రాశాడు బింగ్లీ.

పెళ్లి విషయంలో కాలిన్స్ పట్టువదలని విక్రమార్కుడే. ఎలిజబెత్ కాదన్నంత మాత్రాన నిరుత్సాహపడవలసిన అవసరం లేదు. 'మగాళ్లందరూ ఒకటే' అనుకుందేమో, చార్లాట్ లూకాస్ తన అంగీకారం తెలిపింది.

వారం గడిచింది. మిసెస్ బెనేట్ సోదరుడు గార్డినర్, ఆయన భార్య లాంగ్‌బోర్న్‌లో కొన్నాళ్లు గడపటానికి వచ్చారు. అన్నను చూడగానే ఆడపిల్లలతో తను పడుతున్న కష్టాలన్నీ ఏకధాటిగా చెప్పుకుని ముక్కు చీదింది మిసెస్ బెనేట్. ప్రేమికుని చేతిలో భంగపడ్డ జేన్ గది విడిచి బైటికి రాలేదు. "వాతావరణం మారితే పిల్ల కాస్త కోలుకుంటుందేమో, దాన్ని వెంట తీసికెళ్లండి" అంటూ అన్నను కోరింది మిసెస్ బెనేట్.

లాంగ్‌బోర్న్‌లో ఉన్నన్నాళ్లూ మెరిటన్‌లో విడిది చేసిన సైనికుల కార్యకలాపాలను బాగా గమనించారు గార్డినర్ దంపతులు. ముఖ్యంగా ఎలిజబెత్ ప్రేమించిన వికాం గురించి ఆరా తీసింది మిసెస్ గార్డినర్. అతడు పెద్దగా ఆస్తిమంతుడు కాదు. అలాంటివాణ్ణి చేసుకుని తన మేనకోడలు ఏం సుఖపడుతుంది!

ఇదే ఆలోచన వికాంకు కూడా వచ్చివుండాలి. అతడు మరో మిస్‌కింగ్‌తో ప్రేమాయణం నడిపించాడు. ఇటీవలే ఆమెకు పదివేల పౌండ్ల ఆస్తి కలిసివచ్చింది.

కాలిన్ దంపతుల ఆహ్వానం మీద హన్స్‌ఫర్డ్ వెళ్లిన ఎలిజబెత్‌ను కేతరిన్ డిబోర్గ్ తరచుగా డిన్నర్‌లకాహ్వానించింది. అక్కడ ఆమెకు అనేక విషయాలు తెలిసివచ్చాయి. వికాం డబ్బు మనిషి. మిస్ కింగ్ తర్వాత అతడు డార్సీ చెల్లెలు జార్జియానాను లేపుకుపోవాలనుకున్నాడు (ఆ పిల్లకు పదిహేనేళ్లే). అమాయకులైన ఆడపిల్లల జీవితాలతో ఆడుకుంటున్న నయవంచకుణ్ణి నిలువరించి ఘాటుగా మందలించాడు డార్సీ. కాని త్వరలోనే ఎలిజబెత్‌కు మరో దుర్వార్త తెలిసింది. ఊళ్లో చెల్లెలు లిడియా, వికాంతో లేచిపోయింది. అప్పటికే అతడు జూదంలో వెయ్యిపౌండ్లు పోగొట్టుకున్నాడు.

# దారిద్ర్యంతో వికసించిన కమలం



అప్పటి నిజం

ఓసారి లండన్‌లోని ఓ చిన్న కుర్రాడికి రచయిత అవ్వాలన్న సంకల్పం కలిగింది. ఐతే నాలుగేళ్ళకి మించి అతను స్కూల్‌కి వెళ్ళలేదు. అతని తండ్రి, చేసిన అప్పులని తీర్చలేకపోవడంతో అప్పుల వాళ్ళు అతన్ని జైలోకి పంపారు. ఆకలంటే ఏమిటో అనుభవపూర్వకంగా తెలిసిన ఆ కుర్రాడు ఎలుకలు తిరిగే ఓ గోడౌన్‌లో సీసాల మీద లేబుల్స్ అంటించే ఉద్యోగంలో చేరాడు.

అతను తను రహస్యంగా రాసిన మొదటి కథని అర్ధరాత్రి ఎవరూ చూడకుండా వెళ్ళి ఓ పత్రికకి పోస్ట్ చేసాడు. కథ తర్వాత కథ వెనక్కి తిరిగి రాసాగింది. చివరికి కథని అంగీకరించామని తెలిపే ఉత్తరం వచ్చిన ఓ గొప్పరోజు వచ్చింది. ఆ కథకి అతనికి ఓ షిల్లింగ్ కూడా పారితోషికం ముట్టలేదు. కాని ఆ ఎడిటర్ అతన్ని రచయిత స్థానంలోకి చేర్చారు. ఆ ఉత్తరం చదవగానే ఏంచేయాలో తోచక, చెంపలవెంట ఆనంద బాష్పాలు కారుతుంటే లండన్ వీధుల్లో తిరిగాడు.

తన ఓ చిన్న కథని అచ్చులో చూసుకోవడంతో అతనికి తను సమర్ధవంతమైన రచయితని కాగలనన్న నమ్మకం ఏర్పడింది.

ఆ కుర్రాడి పేరు కూడా మీరు వినే ఉంటారు.

అతనే చార్లెస్ డికెన్స్.

కుటుంబ మర్యాద మంటగలవకుండా వుండాలంటే మొదట వాళ్ళిద్దరికీ పెళ్ళి చెయ్యాలి. వికాం కోసం వేట ప్రారంభించారు. పట్టుకోవటం కష్టమేమీ కాదు. బల ప్రయోగం చేసైనా సరే పెళ్ళికి ఒప్పించాలి. బెనెట్ తన ఆస్తిలో అయిదువేల పౌండ్లు లిడియా పేర రాసివ్వాలనీ, మరో వంద పౌండ్లు సాలీనా భరణంగా యివ్వాలనీ షరతు పెట్టాడు వికాం. చేసేదేముంది అంగీకరించక తప్పదు. వికాంలో సుగుణాలు కన్పించాయి. కుర్రాడు అనుకున్నంత చెడ్డవాడు కాదు. మంచి వంశమే.

పెళ్ళి చేసి, నూతన వధూవరులను లాంగ్‌బోర్న్ తీసుకొచ్చారు. ఈ తతంగమంతా డార్సీ సమక్షంలోనే జరిగింది. హన్స్‌ఫర్డ్‌లో వున్న ఎలిజబెత్‌కు లిడియా వ్యవహారం వెనుక దాగిన మిస్టరీ అర్థం కాలేదు. ఎందుకిలా జరిగిందో చెప్పమంటూ మేనత్తను వేడుకుంది. "వికాం చేసిన అప్పులన్నీ తీర్చి అతణ్ణి పెళ్ళికొప్పించాడు డార్సీ. అయితే తనవల్లే యిది జరిగిందని ఎవరికీ తెలియటం అతనికిష్టం లేదు" అంటూ ఉత్తరం రాసింది మిసెస్ గార్డినర్. డార్సీ పట్ల కృతజ్ఞతతో, ప్రేమతో తన జీవితం అతనికే అంకితం అనుకుంది ఎలిజబెత్.

ఆస్తి వ్యవహారాలు చక్కబెట్టుకుని నెదర్‌ఫీల్డ్‌కు తిరిగి వచ్చిన చార్లీ బింగ్లీ, బెనెట్‌ల యింటికి వచ్చి జేన్ తన కలల రాణి అని, ఆమెనే చేసుకుంటానన్నాడు.

ఇంక శుభంకార్డు పడటమే తరువాయి. మేనల్లుడు డార్సీని ఆశీర్వదించటానికి లేడీ డిబోర్గ్ కూడా గ్రూపు ఫొటోలో చేరింది. కొత్త జంటల నవ్వుల తుళ్ళింతలతో బెనెట్ గారింట్లో ఆనందం మూడింతలైంది.

– ఎం.వసంత

శ్రీ వేదం

# మహిళావిద్యతో మహికి శుభోదయం

-సంధ్యావందనం లక్ష్మీదేవి

'స్త్రీ చదువుకుంటే చెడిపోతుంది. ఇల్లువిడిచి బయటకెళ్లితే ఇతర ఆకర్షణలకు లోనవుతుంది.. ఆమె చదువుకుంటే అనేక సమస్యలు వస్తాయి.. అందుకే బయట ప్రపంచంతో ఆమెకు సంబంధాలు ఉండకూడదు. వంటింటికే పరిమితం కావాలి..'

ఇదీ ధర్మాధికారులుగా చెప్పుకునే కొందరు పెద్దల ఒకనాటి మాటలు. వేదకాలంలో కాక అనంతర మధ్యకాలంలో జరిగిన తతంగంగా దీన్ని గుర్తించాలి. సదరు పెద్దలు... స్త్రీవిద్య నేర్వడాన్ని అత్యంత హీనంగా, తుచ్ఛంగా ప్రచారం చేశారు. తమ విషప్రచారానికి వారు వేదాల్ని, కొన్ని ధర్మగ్రంథాలను అడ్డుపెట్టుకున్నారు. అసత్యాలు పలికారు. వేదం స్త్రీకి విద్య నిషేధించిందని బొంకారు. ఫలితంగా స్త్రీ ఆకాలంలో చదువుకు నోచుకోలేకపోయింది. నిరక్షరాస్యురాలిగా మిగిలిపోయింది.

"దుహితుః పాండిత్యం గృహతంత్ర విషయమేవ వేదే అనధికారాత్"

కొందరు ఆచార్యులు స్త్రీల పాండిత్యం గృహకార్యాలవరకే పరిమితం చేశారు. అంటే ఏదో దయ తలిచినట్లు- చదువుకున్నా చాకలి పద్దుకు, భర్తకు ఉత్తరంముక్క రాసేందుకు పనికొచ్చే చదువు స్త్రీకి ఉంటే చాలన్నారు. అదికూడా విధిగా కాదన్నారు. దరిమిలా మధ్యకాలంలోని స్త్రీకి మామూలు చదువులేదు. ధర్మశాస్త్రాలకు సంబంధించిన చదువు అంతకంటే లేదు. దాంతో స్త్రీ తన ధార్మిక పిపాసను తీర్చుకునేందుకు మఠాలను, మందిరాలను ఆశ్రయించాల్సి వచ్చింది. సాధుసంతులను దర్శించింది. చదువులేని, చదువురాని స్త్రీని సమాజం ధర్మ భ్రష్టురాల్ని చేసింది. దాని పరిణామంగా ఎందరో స్త్రీలు దేవదాసీలుగా వ్యభిచారవృత్తిలో మగ్గిపోయారు. తమ జీవితాలను కలుషితం చేసుకున్నారు. నిజం చెప్పాలంటే- నాటి సమాజం స్త్రీని మూగపశువును చేసి సంకెళ్లతో బంధించింది. అన్నీ సహించి పడి ఉండమంది. అట్లాంటి మూఢదశలో భారతదేశంలో చీకట్లు కమ్ముకున్నాయి. అపుడే సంస్కరణవాదులు స్త్రీ విద్యపై గొంతెత్తి ఘోషణలు చేశారు.

స్త్రీలు వేదం చదవకూడదని వేదంలో ఎక్కడా లేదు. సరికదా, వేద విద్వాంసురాలు కావాలని మాత్రం ఉంది. యోగ్యతలను అనుసరించి బ్రహ్మవిద్యలను నేర్చుకోవాలనీ ఉంది. వేదం స్త్రీని 'పురంధిర్ యోషా' అంటే- బహుముఖ ప్రజ్ఞావంతురాలిగా ప్రశంసించింది. 'యోషా వై సరస్వతీ' అని శతపథబ్రాహ్మణం స్త్రీని సాక్షాత్ సరస్వతిగా అభివర్ణించింది.

నిజానికి ప్రాచీన కాలంలో సామాన్య స్త్రీలకూ ఉపనయనం, వేదారంభ సంస్కారాలు జరిగేవి. వేదాలు అధ్యయనం చేసేందుకు తల్లిదండ్రులు వారిని గురుకులాలకు పంపేవారు. అక్కడ వారు సంస్కారవంతులై సమాజానికి హితం చేసేవారు. వేదకాలంలో గార్గీ, సులభ, మైత్రేయి, కాత్యాయనీ మొదలైన స్త్రీలు వేదశాస్త్రాలను అధ్యయనం చేశారు. ఆ నాటి స్త్రీలు గొప్ప విదుషీమ

ణులుగా, విద్వత్ శిరోమణులుగా పేరుపొందారు. ఋషుల, మునుల ధర్మసందేహాలను సైతం తీర్చగలిగేవారు. వారి విద్యాభ్యాసం ఉత్కృష్ట పద్ధతిలో ఉండేది. కొందరు ఆజన్మ బ్రహ్మచారిణులై ధర్మప్రచారం చేసేవారు. వాస్తవం చెప్పాలంటే ధర్మశాస్త్రాలన్నీ స్త్రీల స్వాతంత్ర్యాన్ని, స్వాభిమానాన్ని రక్షించాయి. అన్ని కోణాల నుండి స్త్రీజనోద్ధరణకు కృషి సాగించాయి.

"ఏకపది ద్విపదిసాచతుష్పది-పరమేవ్యోమన్" వేదం స్త్రీ విద్యను ఎన్నో విధాలుగా సమర్థించింది. వేదాలను, ఉపవేదాలను, వ్యాకరణాది ధర్మశాస్త్రాలతోపాటు వైద్యం, గణితం, భూగోళం, విజ్ఞానశాస్త్రం, శిల్పకళలు, సాంకేతిక విద్యలతో పాటు పాకశాస్త్రాన్ని కూడా నేర్చుకోవాలని చెప్పింది. అపుడే సంపూర్ణమైన స్త్రీవిద్య, స్త్రీ జనోద్ధరణ జరుగుతుందని ప్రాచీన వేద ఋషులు బోధించారు.

"స్త్రీహి బ్రహ్మాబభూవిథ..." అంటే-

వేదం స్త్రీని బ్రహ్మతో సమానంగా గౌరవించింది. బ్రహ్మంటే జ్ఞానమనే అర్థమూ ఉంది. స్త్రీ జ్ఞానదేవత. ఆమె వరిష్ఠురాలు, శ్రేష్ఠురాలు, జ్యేష్ఠురాలు. సంతానాన్ని నిర్మించి సృష్టి కార్యానికి తోడ్పడుతుంది కనుక ఆమె బ్రహ్మ. జ్ఞానం, సరస్వతీ శబ్దాలు సకల విద్యలకు ప్రతీకలు. 'యజ్ఞం దదే సరస్వతీ!' అనగా సత్యవిద్యల స్వరూపిణి స్త్రీ అని వేదం కీర్తించింది.

స్త్రీ విద్యావంతురాలైతే సమాజాన్ని తనకు కావలసినరీతిలో మలచుకోవచ్చు. సంతానాన్ని చక్కదిద్దుకోవచ్చు. సంఘానికి సహకరించవచ్చు. అది ఆనాటి విశిష్టభావన. ప్రాచీనకాలంలో స్త్రీలు వేదాలను చదివేవారు.. చదివించేవారు. యజ్ఞయాగాది శుభకార్యాల్లో భర్తతోపాటు భార్యకూడా పాల్గొని స్వయంగా వేదమంత్రోచ్చారణ చేసేది. స్త్రీ సకల విద్యాపారంగతురాలు కావాలని వేదం బోధిస్తుంది. వేదకాలంలో వేద ఋషులతోపాటు వేదఋషికలు కూడా మంత్రార్థద్రష్టలుగా ఉండేవారు.

స్త్రీలు విద్యావంతులైనపుడే దేశం, సమాజం సర్వతోముఖాభివృద్ధితో సుసంపన్నమవుతాయి. మహిళలు చదువుకుని విజ్ఞానాన్ని సముపార్జించుకున్ననాడు ముందుగా వారి కుటుంబం, తద్వారా సమాజం, తర్వాత దేశం అభ్యున్నతిని సాధిస్తాయనడంలో అతిశయోక్తి లేదు. ఒకప్పుడు విద్యావిషయకంగా ఎంతో ముందున్న స్త్రీ కాలగతిలో కొంతకాలం తెరచాటుకి వెళ్లినా... వర్తమానంలో మళ్లీ పూర్వవైభవాన్ని సంతరించుకుంటోందన్న సంగతి అవగతమవుతోంది. నాటి సంస్కరణల ఫలితం నేడు స్త్రీ జీవితాల్లో ప్రతిఫలిస్తోంది. స్వావలంబనతో జీవించడం, స్వతంత్రంగా ఆలోచించడం, దేశానికి గర్వకారణంగా తమను తాము మలచుకోవడంగా ఈ అభ్యున్నతి ప్రతిఫలిస్తోంది. సమగ్ర దేశాభివృద్ధికి, ప్రగతికి స్త్రీల అభ్యుదయం అవసరం. అందుకు స్త్రీవిద్యే మూలం. స్త్రీవిద్యపట్ల నిర్లక్ష్యం వహిస్తే ఎంతో మూల్యం చెల్లించుకోవాల్సి వస్తుంది. సమాజ శ్రేయస్సు వెనకడుగు వేస్తుంది.



ఇదంతా గ్రహించే సామాజిక ఉక్కు చట్రాలను, ఇతరత్రా నిర్బంధాలను ఛేదించుకుని ఈనాటి స్త్రీ తనకు కావలసినరీతిలో, కావలసిన విద్యలను నేర్చుకుంటోంది. తన అస్తిత్వాన్ని చాటుకుంటోంది. బంతిని ఎంత బలంగా భూమికికొడితే అంతే గట్టిగా పైకి లేస్తుంది. స్త్రీల విషయంలో జరిగిందదే. అణచివేతకు గురయ్యేది ఏదీ అట్టడుగునే ఉండిపోదు. అచిరకాలంలోనే అంతే వేగంతో తిరుగుబాటు చేస్తుంది. ఇది చరిత్ర చెప్తున్న నగ్నసత్యం.

వీటన్నింటినిబట్టి స్త్రీవిద్యకు వేదాలు ఎంత ప్రాధాన్యమిచ్చాయో నేటి తరానికి అవగతమైతే అదే పదివేలు. అదృష్టవశాత్తూ నేటి సమాజం స్త్రీ విద్యపై ప్రత్యేక శ్రద్ధను చూపిస్తోంది. కాని, మారుమూల గ్రామీణ ప్రాంతాలలో ఇంకా స్త్రీకి అక్షరజ్ఞానం లేదు. శ్రమదోపిడీకి గురవుతోంది. స్త్రీ చుట్టూ అంధకారం అలముకుంది. ఆ అగాధం నుండి విద్య అనే ప్రకాశమార్గం వేపు స్త్రీలను నడిపించాలి. ఇది విజ్ఞులైన వారందరి బాధ్యత. అప్పుడే సమాజానికి శుభోదయం!

**లోకాస్సమస్తాస్సుఖినోభవంతు**




# జవాబులేని ప్రశ్న

పరాంకుశం ట్యాంక్ బండ్ మీద జాషువా విగ్రహం సమీపంలో కూర్చుని తదేకంగా ఆలోచిస్తున్నాడు. ఊళ్లో ఎంత గౌరవంగా బతికాడు తను! ఏ గొడవొచ్చినా, ఏ తగాదా వచ్చినా పంచాయతీకి అంతా తనవద్దకే వచ్చేవారు. '.. పంతులు గారు దరమరాజు.. నీతీ, నేయం తెలిసినోడు. ఆ సారు చెప్పినట్లు ఇనుకుందాం' అంటూ తనతీర్పుకు శిరసావహించేవారు. అలాంటి తాను తనకు న్యాయం చేయమని ఏ పెద్దలను ఆశ్రయించాలో తెలియడంలేదు. వెన్నమీగడలతోపాటు నీతి నియమాల్ని నూరిపోసి పెంచుకున్న కొడుకు వెన్నమీగడల్ని జీర్ణించుకున్నాడే తప్ప నీతి నియమాలకు నీళ్లు వదిలాడు.

రెండేళ్లక్రితం-

'తక్కువ రేటులో ఫ్లాటు అమ్మకానికి వచ్చింది.. నగరం నడిబొడ్డున ఇరవై లక్షలకు త్రీబెడ్ రూమ్ ఫ్లాటంటే ఎంత లక్కు? నా దగ్గర ఐదు లక్షలుంది. ఊళ్లో పొలం, ఇల్లు అమ్మేసి పదిహేనులక్షలు సర్దావంటే ఫ్లాటు మన సొంతం అవుతుంది నాన్నా' అంటూ ఫోన్ చేశాడు.

'మీరిద్దరేకదా మామయ్యగారూ ఒక్కరూ పల్లెలో అంతిల్లు ఏం చేసుకుంటారు? పిల్లలూ మిమ్మల్నే కలవరిస్తుంటారు. అదికాస్తా అమ్మేసి వచ్చేయండి అందరం ఎంచక్కా ఫ్లాటులో ఉండొచ్చు' అంటూ కోడలు సుమతి ఉదయం,

సాయంత్రం ఫోన్‌చేసి మొహమాట పెట్టేది.

అందుకే అనసూయ వద్దంటున్నా కూడా వినకుండా ఇల్లు, పొలం తెగనమ్మి పదిహేను లక్షలు తెచ్చి కొడుకు దోసిట్లో పోశాడు తను. ఆరోజు కొడుకన్న మాట ఇప్పటికీ గుర్తే తనకు. 'మీ దయవల్ల మాకో ఇల్లమిరింది. వీలును బట్టి నెలకింత ని నీకు ఆ పదిహేను లక్షలు ఇస్తాను నాన్నా' అన్నాడు చేతులు పట్టుకుని.

'నీ మొహం! ఆ డబ్బేదో పిల్లల పేరుతో రికరింగ్‌లో వేసుకో. వాళ్ల భవిష్యత్తుకి పనికొస్తుంది' అని తనంటే కోడలు అమాంతం కాళ్లమీద పడి 'దేవుడంటే ఎక్కడో లేడు మామయ్యగారూ మీరే' అంటూ మొక్కింది.

నగరానికి చేరిన కొత్తలో పింఛను డబ్బుతో నెలనెలా బియ్యం, ఉప్పు, పప్పు తెచ్చిపడేసేవాడు తను. ఏడాది తిరిగేకల్లా అనసూయ ఆరోగ్యం చెడడంతో పింఛన్ డబ్బంతా ఆస్పత్రులకూ, వైద్య పరీక్షలకే హారతి కర్పూరమయ్యేది. అప్పటి నుంచీ ఇంట్లో పోరు మొదలైంది. పిల్లిమీద, కుక్కమీద పెట్టి కోడలు సుమతి సతాయించేది. 'పొదుపు' అంటూ పనిమనిషిని మాన్పించి ఇంటెడు చాకిరీ అనసూయపై తోసేసింది. రాత్రిపూట కీళ్లనొప్పులతో అనసూయ నరకం చూసేది. అయినా తెల్లారి మళ్లీ చాకిరీ చాకిరీయే! అనసూయ గుర్తొచ్చి కళ్లు చెమ్మగిల్లాయి పరాంకుశానికి.

మొదట్లో తమకు ఒక బెడ్‌రూమ్ ఇచ్చినా తర్వాత దాన్నే గెస్ట్‌రూమ్‌గా మార్చారు. అతిథులొస్తే తమ మకాం హాల్లోకి మారిపోయేది. అనసూయ నిష్క్రమణం తర్వాత పీజీ చదువుకని సుమతి చెల్లెలు సిటీకి రావడంతో తమగది ఆమెకిచ్చారు. దరిమిలా తన మంచం హాల్లోనే సెటిలైంది. రాత్రులు నిద్రపట్టదు. ఆవార పొద్దున్నే లేవడం కాస్తంత ఆలశ్యమైతే సుమతి 'బారెడు పొద్దెక్కినా నట్టింట ఈ నిద్రలేంటి దరిద్రం?' అంటూ విసుక్కునేది.

మొదట్లో తనతో ప్రేమగా మాట్లాడే కొడుకు క్రమంగా మాటలు తగ్గించాడు. పిల్లలు, అబ్బాయి స్కూలుకు, ఆఫీసుకు వెళ్లేదాకా అంటే- ఉదయం తొమ్మిదింటి దాకా తనకు కాఫీచుక్క గొంతులో పడేది కాదు. ఉదయాన్నే కాఫీ అలవాటైన తనకు దీనికన్నా పెద్ద శిక్ష లేదన్పించేది.

అనసూయ పోయాక పింఛన్ డబ్బు ఇంట్లో ఇవ్వడంలేదు తను. కన్నతండ్రికి పట్టెడు మెతుకులు పెట్టాల్సిన బాధ్యత కొడుక్కు లేదా అనుకునేవాడు. మందులకు వాడుకుంటూ మిగిలింది దాచుకున్నాడే తప్ప తనూ పైస బయటకు తీయలేదు. దీని ఫలితం తీవ్రంగానే కన్పించింది. మనవడు, మనవరాలు తప్ప ఇంట్లో మాట్లాడేవారే కరవయ్యారు. తను పిల్లలతో మాట్లాడుతున్నా 'కబుర్లు చాలించి వచ్చి హోమ్‌వర్క్ చేసుకోండి' అని కసిరేది కోడలు. పగలు ఉడకపోత భరించలేక ఫ్యానువేసుకున్నా, కాలక్షేపానికి టీవీ పెట్టుకున్నా 'కరెంటు బిల్లు ఆరొందలు వచ్చింది. ఎక్కడనుంచి తెచ్చి కట్టాలి. పుడుతూనే ఫ్యాన్లూ టీవీలతో పుట్టారా? ఏ పుస్తకమో చదువుకోవచ్చు గదా? ఏ పేపర్‌తోనో విసురుకోకూడదా?' అని సణిగేది. దాంతో ఆ రెంటినీ తాను ఆపేయక తప్పేది కాదు. విచిత్రం ఏమంటే- తను వాడే ఫ్యానూ, టీవీలకే ఆవిడకు కరెంటు వృథాఖర్చు అన్పించేది.

డబ్బుగురించి సాయంత్రం ఇంట్లో గొడవ బాగానే జరిగింది. ఐదువేల పింఛను డబ్బు నువ్వేంచేస్తున్నావని కొడుకు నిలదీశాడు. నీకు లెక్క చెప్పాల్సిన అవసరం నాకు లేదని తనూ దీటుగానే

సమాధానమిచ్చాడు. అయితే తక్షణం ఇంట్లోనుంచి బయటకు వెళ్లమన్నాడు. ఈ ఇంటికి పదిహేను లక్షలు పెట్టాను అవి ఇచ్చేస్తే పోతానన్నాడు తను. ఇవ్వక పోతే? రెట్టించాడు వాడు. వెళ్లను అన్నాడు తను. మెడపట్టి గెంటితే ఏంచే స్తావ్ అంటూనే చటుక్కున అన్నంత పనీ చేశాడు తన పుత్రరత్నం.

ఆ హఠాత్పరిణామంతో గుమ్మం తగిలి పడిపోయాడు తను. కొడుకు అదేం పట్టిం చుకోకుండా విసురుగా తనగదిలోకి పోయాడు. అతన్నే అనుసరించింది కోడలు సుమతి.

'తాతయ్యా తాతయ్యా' అంటూ ఏడుస్తూ మనవరాలు మనవడు తనను లేవదీశారు. మంచం వద్దకు చేర్చారు. మంచినీళ్లు తాగించారు. ఆ రాత్రితనను భోజనానికి రమ్మన్నవారు లేరు. పిలిచినా వెళ్లదలచుకోలేదు తను. పిల్లలిద్దరూ కింద పడడంతో వాచిన తన మోకాళ్లకు అమృ తాంజనం రాస్తూ అలాగే తనమంచంమీద నిద్రపోయారు.

తర్వాత తను ఇల్లువదిలి వచ్చేశాడు. బంధువులున్నా ఎవరింటికీ వెళ్లాలన్పించ లేదు. నేరుగా రామకృష్ణమఠానికి వచ్చి ధ్యానంలో కూర్చున్నాడు. తర్వాత ట్యాంక్ బండ్ మీదకు చేరాడు. హోటల్లో కూడా ఏమీ తినాలన్పించలేదు. ఇంటికీ వెళ్లాల న్పించలేదు..

రాత్రి పదిదాటుతున్నా అక్కడి నుంచి కదలాలన్పించడం లేదు. అల్లంత దూరాన పచ్చికపై ఏమిటది మెరుస్తోందని లేచి వెళ్లాడు. అది ఎవరో మరిచిపోయిన లెదర్ బ్యాగ్.. లోపలచూస్తే గుండె ఆగి నంత పనైంది. కారణం.. కరెన్సీకట్టలు! లక్ష రూపాయలు! వెంటనే ఆటో మాట్లా డుకుని సమీపంలోని పోలీస్‌స్టేషన్‌లో బ్యాగ్‌సహా సొమ్మంతా అప్పగించాడు. వెంటనే సీఐ పత్రికా విలేకరులందరికీ ఫోన్‌లో విషయం చెప్పేశాడు. 'నిలువెత్తు నిజాయితీ' అంటూ పరాంకుశం ఫొటోతో మర్నాడు అన్ని దినపత్రికల్లో ఫొటోలు.. ఆ సమయంలో తనక్కడ ఎందుకు ఉందీ కూడా వివరించక తప్పలేదు. దాంతో ఆయన పరిస్థితి అర్థమైన పాఠకులు 'ఆయ నను మా ఇంట్లో ఉంచుకుంటాం.. మాకు పెద్దదిక్కు లేదు' అంటూ పోలీస్ స్టేషన్‌కు ఫోన్‌లే ఫోన్‌లు. ఆ డబ్బుతాలూకు యజ మాని వచ్చి 'నా జీవితాన్ని కాపాడారు బాబాయిగారూ! మీ కొడుకే అనుకోండి. నా ఇంటికి వచ్చేయండి' అంటూ బతిమా లాడు.

ఉదయం పదిగంటల వేళ కొడుకు, కోడలు, మనవలు హుటాహుటిన స్టేష న్‌కు వచ్చారు. వారి ముఖాల్లో పశ్చా త్తాపం.

'నాన్నా సారీ! నువ్వు డబ్బు వృథా చేస్తు న్నావనుకున్నా.. రాత్రే నీ పుస్తకాలు సర్దు తుంటే అసలు విషయం తెలిసింది. కేవలం వెయ్యి రూపాయలు మందులకు వాడుకుని రెండేసి వేలు పిల్లలిద్దరి పేరునా రికరింగ్ డిపాజిట్ చేస్తున్నావని. మమ్మల్ని క్షమించి ఇంటికి వచ్చేయి నాన్నా..' కొడుకు గొంతు గాద్గదికమైంది.

'మామయ్యగారూ మీ అబ్బాయి తప్పు లేదు. దోషిని నేను..' గొంతులోని దుఃఖం మాటను చుట్టివేసింది కోడలికి. మనవడు మనవరాలు అప్పటికే తాతయ్యను అల్లుకు పోయారు.

పరాంకుశం కొడుకును ఉద్దేశించి 'నాన్నా శ్రీహరీ నాదొకే ఒక్క సందేహం! రాత్రి పిల్లల పేరుతో పాస్‌బుక్‌లు కన్పిం చకపోతే నువ్వు ఇవ్వాళ ఇక్కడికి వచ్చేవా డివేనా?'

శ్రీహరి తలొంచుకున్నాడు.

– చంద్రప్రతాప్

# ఫిబ్రవరి విజేతలు వీరే!

ఫిబ్రవరి చతురప్రవేశికకు వచ్చిన అసంఖ్యాక స్పందనల్లో సరైన సమాధానాలు పంపి డ్రాలో విజేతలైన ఈ అయిదుగురికీ అభినందనలు. వీరికి త్వరలో బహుమతులు అందుతాయి.

1. ఎం. అలమేలు - మల్కాజిగిరి, హైదరాబాద్
2. వాసాల ప్రభాకరరావు - ఇంగ్లీషుపాలెం, మచిలీపట్నం
3. ఆయేష - ఉప్పల్, హైదరాబాద్
4. కె.వి. దుర్గామోహన్‌రావు - వనస్థలిపురం, హైదరాబాద్
5. ఆర్.ఎస్. రత్నమ్మ - అమీర్‌పేట, హైదరాబాద్

## అన్ని సమాధానాలు సరిగా పంపిన ఇతరులు

1. పద్మజారాణి బులుసు, రామచంద్రాపురం 2. యలమర్తి అనూరాధ, పెనుగొండ 3. యన్. శేష ఫణిశర్మ, కర్నూలు 4. జె. నాగేశ్వరరావు పిఠాపురం 5. కె. మధుసూధనరావు నిజామాబాద్ 6 ఎం. కేశవనాయుడు, ఆరిలోవ 7. తాతినేని ఆషా, మియాపూర్, 8. పారుపల్లి వెంకటేశ్వరరావు, నల్లకుంట 9. ఎస్. రాజరాజేశ్వరీదేవి, సరూర్‌నగర్ 10. మేడిచర్ల జయలక్ష్మి, రామరాజులంక 11. యస్. హరనాధబాబు, విద్యానగర్ 12. కాకర్తి పిచ్చిబాబు, చిలకలూరిపేట 13. బందా శ్రీనివాస రావు, కొత్తపేట, ఒంగోలు 14. కె. రాణిశ్రీ, బ్రాడీపేట, గుంటూరు 15. జనవంచి సత్యవతి సమత, మిర్యాలగూడ 16. కె.వి.లక్ష్మి, పెద్దపల్లి, ఆలమూరు 17. పి. సావిత్రీదేవి, శ్రీశైలం 18. వి.ఆర్.కె. అల్లంరాజు, కాట్రేనికోన 19. వంగపల్లి అరుణ, నల్లకుంట 20. ఎం. మైమూన్, చెన్నయ్ 21. పి. రవిశంకర్, ఏలూరు 22. చిట్టిపెద్ది కోటయ్యశాస్త్రి, కాకినాడ 23. యు. విజయశేఖరరెడ్డి, హైదరాబాద్ 24. పి.వి.ఎన్. ప్రసాద్, నౌలూరు, గుంటూరు జిల్లా 25. వెల్చేరు సూర్యకుమారి, విజయనగరం 26. నెమలిదిన్నె రమణారెడ్డి, ముండ్లమూరు, ప్రకాశం జిల్లా 27. ఎం. జయకమల, మచిలీపట్నం 28. పసుపులేటి మీనమ్మ, సంతనూతలపాడు 29. తలకట్టు మహీపాల్‌రెడ్డి, గాంధీనగర్ 30. గుడిచుట్టు ప్రవీణ్, ముస్తఫానగర్, ఖమ్మం 31. చిప్ప రాఘవరాము, సూరత్, గుజరాత్ 32. కళ్యాణం సీతారామయ్య, పెదమోదుగపల్లి, కృష్ణాజిల్లా 33. డి. వెంకటనాగిరెడ్డి, లక్‌డీకాపూల్ 34. 'సుందరి' గొల్లలవలస, శ్రీకాకుళం జిల్లా 35. నేమాన సుభాష్‌చంద్రబోస్, ఇలిసిపురం జంక్షన్, శ్రీకాకుళం టౌన్ 36. సి. సురత్‌ప్రియ మాధవనగరు, కర్నూలు 37. పి. విజయశ్రీ తణుకు 38. ఎస్. బాలకృష్ణమూర్తి, ఆర్.కె.పురం, హైదరాబాద్ 39. వల్లూరి సుధాకర్, ఆర్.కె.పురం, హైదరాబాద్ 40. మంతెన సత్యనారాయణరాజు, జంగారెడ్డిగూడెం 41. పి.కోటేశ్వరరావు, కూకట్‌పల్లి 42. అల్లంపాటి వెంకటేశ్వర్లు, సంగం నెల్లూరు జిల్లా 43. అబ్దుల్ అజీజ్ పండిట్, వనపర్తి, మహబూబ్‌నగర్‌జిల్లా 44. సరిదైన రాము, రైలుపేట ఒకటవ లైను, గుంటూరు 45. అంకే సునీల్‌కుమార్, గనిగెర, అనంతపురం జిల్లా 46. కొప్పుల వేదవల్లి, గొల్లప్రోలు, తూ॥గో॥జిల్లా 47. సి. ప్రీతి, హన్మకొండ, వరంగల్ 48. పి. కమల, జ్యోతినగర్ పోస్ట్, కరీంనగర్ జిల్లా, 49. ఎమ్. విజయలక్ష్మి, తార్నాక 50. వి. మాలతి, రెడ్డికంచరపాలెం, విశాఖపట్టణం 51. పి.బి.ఎస్. ఇందిర, విజయనగరం 52. ఎం. మునిశ్రీలత, పూనా 53. షేక్ సైరా అజ్రీన్, అద్దంకి 54. నరసింహారావు కల్యాణి, నారాయణపేట, మహబూబ్‌నగర్ జిల్లా 55. పి. శకుంతల, పెదగంట్యాడ, విశాఖపట్నం కె. కృష్ణదీప్తి, నగరం, గుంటూరు జిల్లా 56. డి. విజయకుమారి, దిల్‌సుక్‌నగర్ 57. కె. రమాకుమారి, సుబ్రహ్మణ్యంపేట, విజయనగరం 58. సామంచి సుబ్బలక్ష్మి, లాసన్స్‌బేకాలనీ, విశాఖపట్నం 59. డాక్టర్ వి. వెంకటరమణయ్య, ఎర్రముక్కపల్లి సర్కిల్, కడప 60. తిప్పావఝుల సుబ్రహ్మణ్యం, ఇందుకూరుపేట 61. బి. భారతి, కె.టి.రోడ్, తిరుపతి 62. ఐ మహాలక్ష్మి, కొరిశెపాడు 63. ముమ్మిళ్ల వందన, హన్మకొండ 64. కె. సులోచన, చింతల్ 65. శిష్టారాధాకృష్ణమూర్తి, సత్యనారాయణపురం 66. సి. హెచ్. మోహన్‌రావు, విద్యానగర్ 67. ఎస్.లీలావతి, ఎ.ఎస్.రావు నగర్ 68. ఎస్వీ స్వామి, ఒంగోలు 69. బి.వీరయ్య ముదిరాజ్, మౌలాలి

# చతుర ప్రవేశిక

## మార్చి 08

మార్చి 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. అన్నీ సరిగా రాసినవారికి ఆకర్షణీయమైన బహుమతులు లభిస్తాయి.. (ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. విజేతల ఎంపికలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. సంపాదకులదే తుదినిర్ణయం).

1. కుమార్ అమెరికాలో ఇష్టపడే నగరమేది?
2. ప్రభాకర్ భార్యపేరేమిటి?
3. జలజను తొలిసారి కుమార్ ఎక్కడ చూశాడు?
4. నవలలో సిగరెట్లు ఊదేసే డాక్టర్ పేరు?
5. అమెరికాలో జలజ విద్యార్థులకు ఏం బోధించేది?
6. పూనేలో కుమార్ స్నేహితురాలెవరు?
7. జలజ కూతురు పేరేమిటి?
8. కుమార్‌ని జలజకు పరిచయం చేసిందెవరు?
9. రాయుడు మోటార్‌బైక్ తగిలి గాయపడింది?
10. స్టార్‌ని చేస్తానంటూ రోజీని ప్రలోభపెట్టింది?
11. 'ప్రైడ్ అండ్ ప్రెజుడిస్' చిత్రంలో నటించిన బాలీవుడ్ కథానాయిక?
12. 'బాంబోపాఖ్యానం'లో వాచ్‌మేన్ పేరేమిటి?
13. స్త్రీవిద్యపై గొంతెత్తి ఘోషణ చేసిందెవరు?
14. 'ప్రైడ్ అండ్ ప్రెజుడిస్' రచయిత్రికి ముట్టిన సొమ్మెంత?
15. పరంధామయ్య కోడలి పేరేమిటి?

---

పంపినవారి పేరు: ------------------------------------ వయసు (   )

చిరునామా: ------------------------------------------------

------------------------------------------------------------

------------------------------------------------------------

పిన్‌కోడ్:                                    ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర,
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

✦ ప్రవేశికలు మాకు చేరాల్సిన చివరి తేదీ ఈనెల 20.

**ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.** ఒక్కొక్కరూ ఎన్ని కూపన్లయినా పంపొచ్చు.

# ఉపాధి

## చతుర కథ



విశాఖా ఎక్స్‌ప్రెస్ విజయనగరం ప్లాట్ ఫారం విడిచిపెట్టింది.

పరుగున వెళ్ళి నడుస్తున్న రైలెక్కాడు ఫణి. ఫుట్‌పాత్ వద్ద నలుగురైదుగురు నిలబడి వుంటే వాళ్లని తోసుకుంటూ లోపల కెళ్లాడు. భుజాన వేలాడుతున్న బ్యాగ్ తీసి పై బెర్తు మీద పెట్టి ఫ్యాంట్ జేబు తడుముకున్నాడోమారు. చేతికి పర్సు తగలకపోవడంతో అతగాడికి ముచ్చెమటలు పోసాయి. కంగారుగా ఒకటికి రెండుసార్లు జేబుల్లోకి చేతులు పోనిచ్చాడు. ఉహుం... పర్సు జాడే లేదు. దిగి పోదామనుకుంటే అప్పటికే బండి మాంచి స్పీడందుకుంది. ఏం చేయాలో తోచక పిచ్చి చూపులు చూడసాగాడు.

అతడి అవస్థను గమనించి "ఏంటి బాబు అలా వెతుక్కుంటున్నావు. డబ్బు

గాని పోయిందా? " అడిగాడు దళసరి కళ్ళద్దాలు ధరించిన ఓ పెద్దాయన.

"ఔనండి, నా పర్సు ఎవరో కొట్టేసారు. అందులో ఐదొందలున్నాయి" అన్నాడు ఫణి.

భయం వల్ల అతడి గొంతు వణుకుతోంది. "అయ్యో పాపం, ఇంతకీ నువ్వెక్కడికెళ్ళాలి? " అడిగాడు పక్కనే నిలబడ్డ చారలషర్టు యువకుడు అతడి మీద సానుభూతి కురిపిస్తూ.

"విజయవాడలో నేనో ఇంటర్వ్యూకి అటెండవ్వాలి. నాన్నగారు అప్పు చేసి మరీ దారి ఖర్చులకు డబ్బిచ్చారు. ఇప్పుడు నాకేం చేయాలో పాలుపోవడంలేదు."

అతడి స్థితికి తోటి ప్రయాణికులు జాలి పడ్డారు.

"ఇంతకీ నువ్వు పర్సు ఎక్కడ పోగొట్టుకున్నావో ఏమిటో" అన్నాడు కళ్ళద్దాలాయన.

"స్టేషన్ కొచ్చేటప్పుడు పర్సు జేబులోనే ఉందండి. గేటు వద్ద జనాన్ని తోసుకుంటూ లోపల కొచ్చేటప్పుడే పోయి వుంటుందనుకుంటున్నాను."

ఫణి మాటలకు "సరే ఇక్కడున్న పదిమందిని జేబులు చూపించమందాం. దొంగ ఎవరో దొరికి పోతాడు. అందుకు మీరంతా సహకరించాలి" అన్నాడు తోటి ప్రయాణికులతో ఆ పెద్దమనిషి.

"తప్పకుండా అలా చేస్తేనే బావుంటుంది" అన్నారంతా.

"మీ పిచ్చిగాని డబ్బు కాజేసిన వ్యక్తి ఇంకా పర్సు జేబులో పెట్టుకుని ఇక్కడే కూర్చుంటాడటండీ! ఈ పాటికది ఎన్ని చేతులు మారిపోయి ఉంటుందో! అందర్నీ సోదాచేసి వెర్రి మొహం వేసే బదులు తలొకరు తలో పది ఆ కుర్రాడికి సహాయపడితే పోలా? ముందుగా నేనే బోణీ చేస్తాను" అంటూ జేబులో నుంచి వంద కాగితం తీసి ఫణి చేతిలో పెట్టబోయాడు.

"వద్దండీ. నా ఖర్మకి మీరేం చేస్తారు? నా పాట్లేవో నేను పడతాను" డబ్బు తీసుకోవడానికి మొహమాట పడ్డాడు ఫణి.

"పరవాలేదు తీస్కో. ఇటువంటి పరిస్థితి నా తమ్ముడికే వస్తే చూస్తూ ఊరుకుంటానా, చెప్పు" అంటూ బలవంతంగా ఆ కాగితాన్ని అతడి షర్టు జేబులో కుక్కాడు చారలషర్టు వ్యక్తి.

"చిన్నవాడైనా అతగాడి ఈవిని విశేషంగా భావించాలి. ఈ వయసులో అంత గొప్ప గుణం ఎంతమందికి ఉంటుందంటారు" అంటూ అతడిని వేనోళ్ళ కొనియాడారు. అంతే కాదు తలొకరు తలో పది, ఇరవై ఆ అబ్బాయికిచ్చారు.

"థ్యాంక్సండీ. మీ మేలు ఈ జన్మలో మరచిపోలేను. దయ చేసి మీ అడ్రస్ ఇవ్వండి ఇంటికి వెళ్ళగానే మీ డబ్బులు మీకు ఎమ్.ఒ. చేస్తాను" కృతజ్ఞతగా అన్నాడు ఫణి.

"అదేమిటయ్యా ఈ మాత్రానికే అంత ఇదైపోతున్నావ్. ఎదుటివాడు కష్టంలో ఉన్నాడని తెలిసి ఆదుకోలేనివాడు నా దృష్టిలో మనిషే కాదు. వెధవది డబ్బుదేముంది. ఇవాళ వస్తుంది. రేపు పోతుంది. ఎప్పటికి నిలిచేది మన మంచితనమే. విష్ యు బెస్టాఫ్ లక్" అంటూ ముందుకు కదిలాడు చారల షర్టు వ్యక్తి.

చేసిన ఉపకారానికి అందరికీ మరో మారు కృతజ్ఞతలు తెలియజేసుకున్నాడు ఫణి.

అయితే అతడి పర్సు చారల షర్టు వ్యక్తే కొట్టేసాడని, తనిఖీ చేస్తే ఎక్కడ పట్టుబడి పోతానో అన్న బెదురుతోనే అతడా సలహా ఇచ్చాడన్న సంగతి ఫణితో సహా అక్కడున్న వాళ్ళెవరికీ తెలీదు.

–దూరి వెంకటరావు

# మనసున ఉన్నదీ...

★ 'చతుర' ముఖచిత్ర చిన్నారికి 'హలో' చెప్పి 'వారెవ్వా' అంటూ పేజీలు తిప్పగానే 'అపార్ట్‌మెంటాలజీ' కనిపించింది. చదివి కడుపారా నవ్వుకున్నాను. 'శీలపరీక్ష'లో అనసూయ వ్యక్తిత్వం ఎంతో ముచ్చటేసింది. 'ఇదీవేదం' అర్థం చేసుకుంటూ 'కొత్తగాలు'లను ఆఘ్రాణించాను. 'పదండి ముందుకు'లో జిగురుమూర్తి ఇచ్చే షాక్‌ని తలచుకుని 'ఆహా' అనుకున్నాను. మధ్యమధ్యలో జోక్స్‌కి స్పందిస్తూ... ప్రపంచ వింతలను ఆస్వాదిస్తూ, 'కాలాతీతం'లో తుర్గనేవ్ పరిచయం చేసుకుంటూ 'టాంక్‌బండ్' కథ వద్ద తేలాను. ఆ కథ మానవత్వానికి పరాకాష్ట అనే నిజాన్ని తెలుసుకుని 'చతుర' ప్రవేశికలో ప్రవేశించి పదాలతో కాసేపు సేదతీరాను.

**-యలమర్తి అనూరాధ,** పెనుగొండ

★ 'కొత్తగాలి'. ఈ శీర్షికలో ఔత్సాహికులందరికీ అవకాశమిస్తున్నందుకు సంతోషంగా ఉంది. యర్రంశెట్టిగారి 'అపార్ట్‌మెంటాలజీ' ఎంతగానో అలరించింది. నెలకో కవిని ఫొటోతో పరిచయం చేయగలరు.

**-మేడిచర్ల సూర్య ప్రకాశరావు,** రామరాజులంక

★ 'కొత్తగాలి'ని ఒకే పుటతో స్తంభింప చేయకుండా, చాలా పుటల్లో వీచేటట్లు చేసిన మీ 'చతురత అభినందనీయం.

**-భమిడిపాటి సోమయాజి,** హైదరాబాద్

★ కొత్తగాలి శీర్షిక సూపర్బ్. కానీ, నానీలు కనీసం నాలుగైదు లైన్లన్నా ఉంటే బాగుంటుంది. అలాగే, మినీకవితలు, జోక్స్ కూడా ఉంటే ఇక 'చతుర'కు తిరుగేలేదు.

**-పి.వి.ఎన్. ప్రసాద్,** తెనాలి

★ సందేశాత్మక నవలలతో పాఠకులను ఎంతగానో 'చతు ర' అలరిస్తోంది. మంచి రచనలకు వేదికైన 'చతుర'కు అభినందనలు.

**-సిహెచ్. అరుణ,** కొత్తపేట, నల్గొండ జిల్లా

★ వర్తమానంలో రాజకీయనాయకులు చెప్పేదొకటి... చేసేదొకటి. ఇలాంటి వారు ఫిబ్రవరి చతురనవల 'శీలపరీక్ష'లోని అనసూయను ఆదర్శంగా తీసుకుని ప్రజాసేవ చేస్తే బాగుంటుంది.

*-బి. గంగానాథ్,* మౌలాలి, రంగారెడ్డిజిల్లా

★ తనకంటూ ఏమీ కోరుకోకుండా సమాజశ్రేయస్సుకీ, బడుగువర్గాల అభ్యున్నతికీ పాటుపడే త్యాగజీవిగా అనసూయమ్మపాత్రని బాగా చిత్రీకరించారు. జీవితకాలం గుర్తుంచుకోదగ్గ మణిపూస శీలపరీక్ష నవల

*-పద్మజాశాస్త్రి,* రామచంద్రాపురం, తూర్పు గోదావరిజిల్లా

★ ప్రతినెల చతుర నవలతోపాటు అనేకానేక శీర్షికలు ఎంతగానో ఆకట్టుకుంటున్నాయి

**-యు. విజయశేఖరరెడ్డి,** కూకట్‌పల్లి, హైదరాబాద్

★ కొత్తగాలి శీర్షికతో ఔత్సాహిక కవులకు సముచిత స్థానం ఎంతో ముదావహం. నాకు బాగా నచ్చిన మరో శీర్షిక-చతుర ప్రవేశిక. కొత్త ఉత్సాహంతో, ఇనుమడించిన ఆనందంలో చతురను అక్కున చేర్చుకుని మురిసిపోతున్నాం.

*-నేమాని సుభాష్‌చంద్రబోస్,* శ్రీకాకుళం టౌన్

---

**చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -500 082**

ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **RAMOJI RAO** **VASUNDHARA PUBLICATIONS** 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 2008

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

